# శ్రీ కుసుమ హరనాథ ప్రచార సంస్థ

## కార్యవర్గం

| | | |
|---|---|---|
| శ్రీ సదే పోలిరెడ్డి | బెంగుళూరు | అధ్యక్షులు |
| శ్రీ భోగా నరుసయ్య | హైదరాబాదు | ఉపాధ్యక్షులు |
| శ్రీ టి.వి. జనార్ధనరావు | సికిందరాబాదు | కార్యదర్శి |
| శ్రీ టి. కరంచంద్ | హనుమకొండ | కార్యదర్శి |
| శ్రీ పుల్లూరు హరనాథ్ | ఇల్లందు | కోశాధికారి |

సంస్థ యాజమాన్యంలో ప్రచురింపబడుతున్న త్రైమాసిక పత్రిక

# శ్రీ కుసుమ హరనాథవాణి

సంపాదకుడు, ప్రచురణ కర్త, ముద్రాపకుడు

**శ్రీ టి.వి. జనార్ధనరావు ఎం.ఏ.,**

ప్రతులకు

**శ్రీ టి.వి. జనార్ధనరావు**

శ్రీ కుసుమ హరనాథాశ్రమం
ప్రశాంతినగర్, న్యూనల్లకుంట,
హైదరాబాదు - 44.



శ్రీ కుసుమ హరనాథులు

శ్రీనందలాల్‌పాల్ నేను ఎలా వ్రాశానో అలాగే ఏ మాత్రం భావం మారకుండా ఆంగ్లంలోకి అనువదించారు.

మీ మనస్సులో ఎటువంటి సందేహం కలిగినా పాగల్ హరనాథ్ పత్రాల్లో ఏదో ఒక దానిలో సమాధానం లభిస్తుంది. స్థిమితంగా పఠించండి.

- శ్రీ కుసుమ హరనాథ్

మనవంటి పతితులకు మన ఠాకూరు శ్రీహరనాథుని పరిచయం చేయటమే ఈ పుస్తక ప్రచురణ ఉద్దేశం. ఏ ఒక్కరైనా మన ఠాకూరు కృపకై తపిస్తే, మధురమైన హరి నామస్మరణ పట్ల అభిరుచి పొందితే - అప్పుడే ఈ నా శ్రమ సఫలమవుతుంది.

- శ్రీ అటల్ బిహారీ నాంది

# ముందుమాట

కుసుమహర

శ్రీ కుసుమ హరనాథ మహాప్రభువు స్వయంగా నన్ను 22-7-1972 సాయంత్రం తన స్వజనుడిగా స్వీకరించారు. ఈ ఉపాధికి తదాదిగా అనేక అనుభవాల్ని ప్రసాదించారు.

శ్రీ కంతేటి వెంకట జ్వాలా నరసింహారావు గారు (గుంటూరు) 1979లో శ్రీ కుసుమ హరనాథ భక్తి ప్రచార కార్యక్రమాల్లో పాల్గొని నా అనుభూతుల్ని, ఆనందాన్ని నలుగురితోనూ పంచుకొనవలసిందిగా సూచించారు. వీరు నాకు పాగల్ హరనాథ్ ఆంగ్ల ప్రతి పార్ట్స్ I & II ఇచ్చారు. దాన్ని నేను 1983లో అనువదించాను.

శ్రీ కుసుమ హరనాథ ప్రచార సంస్థ వారు 1984లో పార్ట్ I పుస్తక రూపంలో ప్రచురించారు. 1984 జులై నుండి పార్ట్ II శ్రీ హరనాథ మురళి మాస పత్రికలో ధారావాహికగా 56 నెలలు వచ్చింది. ఇందుకు శ్రీ కుసుమ హరనాథ ప్రచార సంస్థ వారికి, శ్రీ హరనాథ మురళి పత్రికా కార్యవర్గానికి, ముఖ్యంగా నన్ను ప్రోత్సహించిన శ్రీ రాళ్ళబండి సత్యాలు అన్నయ్య గారికి కృతజ్ఞుడను. ఈ లేఖావళి రెండు భాగాల్ని ఒకే పుస్తకంగా పునర్ముద్రిస్తున్న శ్రీ కుసుమ హరనాథ ప్రచార సంస్థ వారికి కృతజ్ఞుడను.

**ఏకోహి దోషో గుణసన్నిపాతే**

**నిమజ్జ తీందోః కిరణేష్వివాంకః**

'మచ్చ చంద్రుని కిరణాలలో ఎలా కలిసిపోయి గుర్తింపబడటం లేదో అలాగే ఎన్నో మంచి గుణాల మధ్య ఒక దోషం గణింపబడదు' అని కాళిదాసు చెప్పినట్లుగా ప్రభు లేఖావళిలోని మకరంద బిందువుల్ని ఆస్వాదించే భక్తలోకం నా భ్రమ, ప్రమాదాల వల్ల దొర్లిన అనువాద దోషాలేమైనా ఉంటే వాటిని నలుసుల్లాగా భావిస్తారేగాని, ఏవగించుకోక, ఆదరిస్తారని ఆశిస్తాను.

# పాగల్ హరనాథ్ - మొదటిభాగము

అనువాదం : శ్రీ టి.వి. జనార్ధనరావు, ఎం.ఏ.

## 1వ పత్రము

ప్రియా,

సదా 'హరి' మధుర నామాస్వాదనలో మత్తిలి ఉండు. పవిత్రత అపవిత్రత అన్న భావాల్ని మనస్సులో జొరనీయకు. ప్రపంచంలో అపవిత్రమైన జీవియే లేదు. ఉన్నదా, అది భగవన్నామ సన్నికర్షతో పవిత్రాతి పవిత్రమౌతుంది. కనుక స్వప్న సుషుప్తులలో కూడా భగవన్నామంలో తన్మయుడవై ఉండు. నామం, మంత్ర తంత్ర కలాపాలన్నింటినీ ఆవరించి ఉన్నది. సాక్షాత్తూ భగవానుడితో సమానమైంది. భగవన్నామంకంటె గొప్పది - మరేదీలేదు. శ్రీకృష్ణ నామం సాక్షాత్తూ శ్రీకృష్ణునికంటె గొప్పది, మహత్తరమైంది. ఓహో! ఆ "నామం!" సంతోష ప్రవంతి, ఆనంద స్రోతస్విని. దురదృష్టవంతుణ్ణి నాకా అదృష్టం లేదు. అందుకే హతాశుడి నయ్యాను. నామమాహాత్మ్యం ఎటువంటిదంటే, అది అందరి ప్రాపంచిక దుఃఖాల్ని శమింప జేస్తుంది. ఇక శారీరకమైన బాధల్ని గురించి చెప్పనే అక్కరలేదు. మనస్సులో ఆలోచనలకు తావీయకు. నామం చేస్తూండు. ఈ సకల ప్రపంచం నీదవుతుంది. నీవు వాడి వాడవవుతావు. అనంతమైన ఆనందంలో మునిగి ఉంటావు. దురదృష్టపు ఛాయ కూడా దానిపై బడదు. మానవులకు దాపురించే ఆధి భౌతిక, ఆధిదైవిక ఆధ్యాత్మిక బాధ లేవీ నిన్నెప్పుడూ సమీపించలేవు. అన్ని భయాలూ (భయంతో) నీనుంచి జడిసి పారిపోతాయి. సదా ప్రశాంతత ననుభవిస్తావు. కనుక మహోత్కృష్టమైన కర్తవ్యము జీవితాశయము కృష్ణ నామస్మరణ. ఆయన నామాన్ని నిర్లక్ష్యంచేస్తే స్వర్గాధిపత్య సౌఖ్యం కూడా దుస్తర నరకవేదనగా మారుతుంది. శ్రీకృష్ణుని విస్మరిస్తే మానవుడు మాయకు దాసుడవుతాడు. శ్రీకృష్ణ స్మరణతోనేముక్తి పొందుతాడు. జీవిత చరమదశ చేరుకున్నప్పటికీ ఆఖరి క్షణాలనైనా తదేకంగా భగవన్నామస్మరణతో సద్వినియోగం చేసుకోవాలి. శివత్వాన్ని బ్రహ్మత్వాన్ని సిద్ధింప చేసేటంతటి (యజ్ఞదాన తపశ్చర్యాది) సాధనలు సైతం శ్రీకృష్ణ నామాన్ని అవజ్ఞ చేయటం వల్ల కలిగే అనర్థాన్ని నిశ్శేషంగా పరిహరింప జేయలేవు. ప్రాపంచికమైన సుఖంగానీ, దుఃఖంగానీ అశాశ్వతమే. ఐహిక సుఖాలలో మునిగి శ్రీకృష్ణుణ్ణి విస్మరించటం దోసిలినిండా విషాన్ని త్రాగినట్టే అవుతుంది.

నీ
హర

# 2వ పత్రము

ప్రియమైన జతీన్,

నీ లేఖ చూడగానే నాకు కన్నీళ్ళు వచ్చాయి. నిజంగా నాకేమైనా శక్తులుంటే తప్పకుండా వాటిని నీప్రయోజనానికి ఉపయోగించేవాడినే, క్షంతవ్యుణ్ణి. నా కటువంటి శక్తులు లేవు. నిజం చెప్పాలంటే నేను ఏమీ లేనివాణ్ణి, పైగా శ్రీకృష్ణ ప్రేమ నేను పట్టించుకోను. ఒక లేశమాత్రమున్నా దానిని నీవశంచేసి ఎంతో సంతృప్తిని పొందేవాడిని. అయితే, నీవు చెప్పింది దయాళుడైన కృష్ణుడికి వినిపించింది, అని మాత్రం చెప్పగలను. అతడు నీ హృదయాన్ని పూర్తిగా నిర్మలం చేసి నీ ప్రార్ధనల్ని మన్నిస్తాడు. వితరణదాత కనుక నీ ప్రార్ధనల్ని అనుగ్రహిస్తాడు. ఆ రీతిగా నీవేమి కోరితే అది నిస్సంశయంగా అనుగ్రహిస్తాడు. ప్రశాంతంగా అతని నామాన్ని స్మరిస్తూండు. అచిరకాలంలోనే సుఖశాంతులు లభించటం గమనిస్తావు. అప్పుడు ఎందరో దీనులు నీ చల్లని నీడలో హృదయతాపాన్ని ఉపశమింప జేసుకొంటారు. ఆరోజు దూరంగా ఉందనుకోకు. శ్రీకృష్ణనామం సాక్షాత్తు అతనికంటె చాలా శక్తివంతమైనది, ఉత్తమోత్తమమైన ఆశ్రయం. అటువంటి చైతన్య శక్తి (మరేదీ)లేదు. దృఢ విశ్వాసంతో నామం జపించు. ఆసక్తి రహితంగా చేసినా వృధాకాదు. ఈ తాత్కాలిక నివాసం శాశ్వత విశ్రాంతి స్థానమని భ్రమించకు. ఈ భూమి మీద మనం చూచేదంతా శాశ్వతమైతే - నాకు తోచినంతవరకూ, అది అలాకాదు, కాని ఈ ప్రపంచం ఇలా నిల్వవచ్చు, కాని, నాకుమాత్రం శాశ్వతంగా ఇక్కడ ఉండటం నిశ్చయంగా అసాధ్యం. ఇప్పుడు జీవించి ఉన్నాను. కాని, మరుక్షణం అలా ఉండకపోవచ్చు. అందువలన అశాశ్వతమైన భౌతిక వాసాన్ని శాశ్వతనిలయంగా చూస్తూ శాశ్వత శాంతిధామాన్ని ఎవరూ దూరం చేసుకో కూడదు. ఆ పరిపూర్ణ కరుణామూర్తికిదే నా విన్నపం. అతడు మనవాంఛను తీరుస్తా డని ఆశిస్తాను. మనం ఈ రెండు రోజుల ప్రాపంచిక సుఖాలు, దుఃఖాలవశంలో పడకూడదు. భార్యాబిడ్డల్ని మనవాళ్ళనినమ్మి సర్వకాల సర్వావస్థల్లోనూ మన నిజమైన స్నేహితుడు శ్రీకృష్ణుణ్ణి, మన శాశ్వత పెన్నిధానమైన అతని నామాన్ని విస్మరించ కూడదు.

అతని నామాన్ని మఱవకు. సర్వశక్తులకు మూల కారణమూ, నిధానమూ అయిన భగవన్నామంలో అచంచల విశ్వాసం కలిగి ఉండటం ప్రతివాని కర్తవ్యం. మనో వాక్కాయకర్మలా భగవన్నామాన్ని ఆశ్రయించాలి. ఎవరి సమ్ముఖం శ్రీకృష్ణ సంబంధమైన సంభాషణ ప్రోత్సాహకరమో అతడు మంచి స్నేహితుడు. కాని,

అసంఖ్యాక ప్రాపంచిక బంధాల్ని కల్పించి బిగించాలని ప్రయత్నించేవాడు స్నేహితుడన్నపదానికే అనర్హుడు. ఈ ఉపాధికి సంబంధించిన కార్యాన్ని కేవలంగా, సూక్ష్మంగా కర్తవ్యంగా నిర్వర్తించి, వ్యక్తిగతంగా నీకు అనంతలాభదాయకమూ, ఆనంద దాయకమూ అయిన నీ స్వంత పెన్నిధానంలా భగవన్నామాన్ని హృదయ పూర్వకంగా ప్రేమించు. మరెవ్వరికీ నీ ఆత్మని సమర్పించకు. భౌతిక శరీరం భౌతిక కర్మ లకి వినియోగించి నీ ఆత్మని హృదయాన్ని కృష్ణుడికి సమర్పించి ప్రశాంత పయోధిలో విశ్రమించు. అప్పుడు భయరహితుడివి, దుఃఖాతీతుడివి అవుతావు. సృష్టికి ఏకైక మూల కారణాన్ని ప్రేమించగలిగితే సకల జీవుల్ని సర్వ విషయాల్ని ప్రేమించినట్లే, మొదట్లో చెట్టుకి నీరుపోస్తే ప్రతిరెమ్మకి పోసినట్లే. కృష్ణుని ప్రేమించటం వల్ల సర్వసృష్టి ప్రేమించబడు తోంది. ఒకనికి కృష్ణుడు మిత్రుడయితే అతడు సకల చరాచర జగత్తుకు మిత్రుడే. కనుక కారణాలన్నిటికీ ముఖ్య కారణమైన అతణ్ణి మనసా వాచా కర్మణా నిష్కల్మషమైన భక్తితో ఆరాధించాలి. అందుకే "శ్రీ కృష్ణుణ్ణి ప్రేమించే వాడు మిక్కిలి జాగరూకుడు" అని శాస్త్రాలు చెబుతున్నాయి.

తనతల్లిని రూపుదాల్చిన కృష్ణుడిలా గౌరవించటం ప్రతి వాడిధర్మం. నవమాసాలు మోసి, కని, పాలిచ్చి, పెంచి పోషించిన తల్లి గౌరవించబడకపోతే, ఎవరు గౌరవించ బడేది? దేవుని దివ్య ఉపాధులేవి చూడటానికి? భగవంతుడు ఈ ప్రపంచాన్ని గర్భంలో వహిస్తున్నాడు. పుట్టిస్తున్నాడు, పెంచుతున్నాడు. పోషిస్తున్నాడు. తల్లి ఈ శరీరానికి అదే చేస్తోంది. అప్పుడు నాకు సంబంధించి, ఆమె దైవమెందుకు కాదు? ఇంకొకమాట. భగవంతుణ్ణి నాకు నచ్చిన రూపంలో ఆరాధించి, పూజిస్తూ ఇతరులు వేరే రూపంలో ఆరాధించి పూజించుతుంటే నేను తప్పుపట్టి ఆ పూజా పద్ధతిని అగౌరవపరిస్తే పాపకార్యం చేయటంకాదూ? అలాగే నాకన్నతల్లిపై నా ఆరాధనాభావాన్ని పరిమితం చేస్తూ ఇతరుల తల్లుల్ని అగౌరవపరిచితే నేను అంతులేని పాపబీజాన్ని నాటుతున్నట్లు. అందువల్ల తన తల్లిలాగానే అందరి తల్లులని చూడాలి. అఖరికి ఆడకుక్కల్ని పిల్లుల్నీ కూడా నిరసించకూడదు. తన హృదయ రక్తంతో నీ ప్రాణం పోషించిన తల్లిని భక్తి ప్రపత్తులతో గౌరవించటం నీ ధర్మం. కన్న తల్లినిమించిన దైవం లేదు. ఇంద్ర చంద్రాది దేవతలంతా తల్లి శరీరంలో కేంద్రీకృతమై ఉన్నారు.

ఆటవస్తువుగా భార్యని ఆటలో సహచారిణిగా భావించి ఈజన్మలోనూ వచ్చేజన్మలోను శక్తి దాయకమైన ఓజస్సును దూరం చేసుకోవటం ఏమాత్రంతగదు. భార్య ఇహపరాల్లో సహధర్మచారిణిగా గౌరవించబడాలి. రోజూ ఆడే నాటకాలల్లోని తోటిపాత్ర కాదామె, జన్మజన్మలకీ జీవిత నాటకాలలోని భాగస్వామిని ఆమె, ఆమెను

అలా భావించాలి. జీవనగతులలో యోగ్యమైన సహధర్మచారిణిగా ఆమెకు తగిన గౌరవాన్నివ్వాలి. నీ గుణాలను ఆమె కందించి, ఆమె గుణాలను నీవు గ్రహించు. ఈ ఇచ్చిపుచ్చుకునే ప్రక్రియ ఇద్దరూ ఒక్కటిగా మిళనమయ్యే వరకూ సన్నిహితుల్ని చేస్తుంది. అవ్యక్తానందం ఈ మిళనం. ప్రేమించటం నీవు నేర్చుకుంటే ఆ ప్రేమ రెండురోజుల్లో మర్చిపోకుండా ఉండేట్లు జాగ్రత్తపడు. అనర్థమైన ఐహికవాంఛలకి బానిసవై శాశ్వతానందాన్ని శాశ్వతంగా దూరంచేసుకోకు. నా ప్రేమను స్వీకరించి, ఇతరుల కందించు.

నీ
హర

# 3వ పత్రము

ప్రియమైన తల్లీ!
(నాగేసుబాబు భార్య)

అమ్మా! జపమాల గురించా! ఎందుకడుగుతావమ్మా? అపరిశుభ్రమైన చోట అమూల్యరత్నాన్ని ఎవరైనా చూడటం జరిగితే, తను అశుభ్రంగా ఉన్నందున తీయ వచ్చా లేదా అని ఆలోచిస్తూ కూర్చుని తీసుకోవటానికి సంశయిస్తాడా? అమూల్య రత్నాన్ని తీసుకొనేటప్పుడు మనిషి మనస్సులో ఈ ఆలోచన రాదు. అలాంటప్పుడు, పవిత్రత, అపవిత్రతల ప్రశ్న శ్రీకృష్ణనామం చేయటానికి జపమాల పట్టుకొనేటప్పుడు నీ మనస్సులో ఎందుకు వస్తుందమ్మా? పైగా, సర్వదా పవిత్రాతి పవిత్ర మైనది ఎప్పుడైనా ఎలా కలుషితమౌతుంది? నీవెప్పుడూ పవిత్రురాలివే. ప్రత్యక్షంగా నీవు తాకితే అపవిత్రమైన వస్తువులూ అపవిత్రులూ పవిత్రాతి పవిత్రులవుతారు. అందుకే చెప్తున్నాను అతని నామ జపంచేయాలని మాల తీసుకొనేటప్పుడు ఏ అనుమానాన్ని నీ మనస్సులోకి రానీయకు. అమ్మా, తమ పాపాలను మనస్సులో పెట్టుకొని, పాపాత్ములు గంగా (భగీరథి) నదిలో స్నానం మానివేస్తే వాళ్ళ పాపాలనించి వాళ్ళెలా విముక్తులవుతారు? వారు పాపులుగనుక అంత గౌరవాదరాలు గంగకున్నాయి, పాపులే లేకపోతే గంగకంత గౌరముండేదే కాదు. నీవు హృదయపూర్వకంగా దృఢమైన విశ్వాసంతో మధురాతి మధురమైన శ్రీకృష్ణనామాన్ని నీ కంఠహారంగా చేసుకో. ఇది నా ప్రార్థన. శ్రీకృష్ణ నామానికి మించింది మరేదీ లేదు. ''కృష్ణున్ని ఆరాధిస్తే గొడారి కూడ పవిత్రుడౌతాడు. మానవ జీవిత పరమార్థం శ్రీకృష్ణుని ఆరాధించటం, దీనిని మర్చిపోయి తనకర్మలతో తన్నుతాను మానవుడు బంధించుకుంటున్నాడు.

తాను సర్వకాలాల్లోను భగవంతుని ఆజ్ఞాబద్ధుడైన సేవకుడనని మరచిపోతే మాయకి మూలమైన ప్రకృతి అతని మెడచుట్టూ తన సూత్రాన్ని చుట్టి బిగిస్తుంది. అమ్మా, శ్రీకృష్ణుణ్ణి మరచి ప్రజలు శాశ్వతంగా మాయకి దాసులవుతున్నారు. అందుకే చెప్తున్నాను. అతన్ని మఱవకు, శ్రీకృష్ణుణ్ణి జేరేమార్గమైన అతని నామస్మరణచేస్తూ అందులో సంతృప్తులై ఉండటం. చన్నీళ్ళలో మునిగినవాడిని ఎండవేడి ఏమీ చేయలేదు. భూమి మీద ఉన్నవాళ్ళు ఎండబాధకి గురైనా, తీక్షణమైన ఆ ఎండవేడి నీళ్ళలో ఉన్నవాడిని ఏమీ చేయలేదు. అలాగే శ్రీకృష్ణభక్తిలో నామస్మరణలో తన్మయుడైనవాణ్ణి మాయ ఎన్ని ప్రయత్నాలు చేసినా వశం చేసుకోలేదు. శ్రీకృష్ణనామం మిళితం కాకుండా అమోఘ మయినదేదీ నాకు తెలియదు. అందుకే దానిని శరణు వేడమని ప్రార్థిస్తున్నాను. నామం సర్వదా చేస్తే అతనిపై భక్తిగా పరాకాష్ఠచెంది, సకాలంలో ప్రియతముడైన కృష్ణుణ్ణి చేరుతుంది.

నీ
హర

# 4వ పత్రము

ప్రియమైన క్షీరోద్,

ఇంకా నన్ను రెచ్చగొట్టకు. నీ లేఖ అందుకోగానే వివిధమైన ఆలోచనలు నన్ను కలిచివేస్తాయి. అలాకాదు, నాకళ్ళు నీ లేఖలో అసాధారణమైనదేదో చూచి మెరిసిపోవాలి. ఇలా నాకు వ్రాయకు. మీలో ఒకడిగా నన్ను పరిగణించి సంతోషపెట్టు. నేనొక ఘోరపాపిని, కపటిని. నాపై నున్న నీ అభిమానం నీ కళ్ళల్లో నాలోపాలను చూపుతోంది. అందుకే ప్రేమ గ్రుడ్డిది అంటారు. అందుకే నేను బహుముఖ ప్రజ్ఞాశాలినని అనుకుంటున్నావు. ఎవరూ తన బిడ్డ చెడ్డది అనుకోరు. నీ లేఖ లోని ప్రతిపంక్తీ పిచ్చివాడి వాలకాన్ని చూపుతోంది. నీ మనస్సుని స్థిరంగా కట్టుదిట్టం చెయ్యి. పల్లానికి పారటం నీటికి సహజం. నీరు కదలకుండా ఉండలేదు కాని కుండలో పోస్తే ఉంటుంది. మనస్సూ అంతే. స్థిరమైన కట్టడిలో ఉంచకపోతే పరి పరి విధాల పోతుంది. మనస్సు నాకర్షించే బలీయమైన విషయాలు కాంతాకనకాలు. మొదటిది రెండవదానికంటె బలీయమైనది. కనుక మనస్థైర్యంకోసం కాంతా సాంగత్యాన్ని నిషేధించాలి. నది ప్రక్కన ఉన్న బావిలోని నీటి మట్టం నదినీటితో బాటు పెరగటం తరగటం నీకు తెలియదూ? నది బావినీటిని ఎప్పుడూ గుంజుకుని చివరికి పట్టిపోయేట్టు చేస్తుంది. కనుక నదిలాంటి స్త్రీకి తగినంత దూరంలో

ఉండాలంటాను. కాని నీ మనస్సును దృఢంగా కట్టుదిట్టం చెయ్యటంలో సఫలుడవైతే నదిలోమునిగి ఉండవచ్చు. నీవు చలించవు. ఒక కుండనిండా నీరుపోసి నదిలో ముంచి ఉంచితే నది ఎదుగుబొదుగుల ప్రభావం కుండలోని నీటిపై ఉండక ఎప్పుడూ నిండుగానే ఉంటుంది.

పాముతో చెలగాటాలాడాలంటే దాన్ని మచ్చికచేసుకొనే రహస్యం తెలియాలి. దాన్నిబాగా నేర్చుకోకుండా పాము జోలికిపోతే ప్రాణం పోగొట్టుకోవటం ఖాయం. పాముని పట్టటానికి ప్రయత్నించేముందు, మొదట ఆ రహస్యం తెలుసుకో.

రాజువి కావాలనుకుంటే ముందర హుందాగా ఉండటం నేర్చుకో. క్షీరోద్ నీ మనస్సుని బలమైన త్రాటితో రక్షించుకుని అది మధ్యలో తెగిపోకుండా చూసుకో. ఉత్సాహవంతులైన భక్తులు ఇలా అన్నారు. "స్నానానికని కాంత వంటి నదీజలాల్లోకి ప్రవేశించకు. ఒక్కమునకమునగటానికి స్త్రీలవంటి అగాధ సముద్రంలో గ్రుడ్డిగా పరుగెత్తకు. మిడతల్లా మంటల్లోకి ఎగిరి పడకు. ఈ కన్నీటి కనుమలో ప్రశాంతంగా జీవించగలవాడే నిజంగా తెలివిగలవాడు. కష్టాల్లో విచారిస్తూ జీవించటం ధీరుల లక్షణంకాదు. త్రాగుబోతుల మధ్య త్రాగు బోతులా బ్రతకటం చెప్పదగిందేమీకాదు. దొంగల్లో దొంగలా బ్రతకటం వింతకాదు. తన పరిసరాల్లో ఉన్న వ్యతిరేకశక్తుల్ని ఎదుర్కొని తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొనగలిగినవాడే ధీరుడు. గణనీయుడు. కష్టాల్లో సంతోషంగా సాగిపోవటం తెలివైన సాధన. సహచారిణిగా భార్యని ఆదరించు. ఆటవస్తువుగా ఆమెని భావించి మోసపోకు. రామచంద్రుడు సందర్భానుసారం బంగారంతో చేయించిన సీత విగ్రహాన్ని ప్రక్కన పెట్టుకుని రాజసూయ యాగం చేశాడు. తన హృదయానికి పెన్నిధి అయిన భార్య విగ్రహాన్ని చేయించటంలోను దూరాన్నుంచి దాన్ని చూస్తుండటంలోను ఉన్న ఆనందమే నిజమైన ఆనందం. ఆ ఆనందాన్ని సమీపంగా ఉంటే పొందలేము. చేతికందితే అది మాయముసుగు వేసుకుంటుంది. దూరంగా ఉంటే గాఢమైన ప్రేమగా, అనురాగంగా రూపొందుతుంది. చుట్టూ ఉన్న కష్టాల్ని అతిక్రమించి సూటిగా సాగిపోవటం నేర్పరితరం. సమయం వస్తే చెప్పని విషయాలు చెప్పబడతాయి. అక్షరాల్లో (లేఖలో) వెలువరించటం అసాధ్యం. నీ మనస్సులో నాకు స్థానమివ్వు.

నీ
హర

# 5వ పత్రము

డియర్ అనుకూల్,

నీ ఉత్తరం అందుకున్నాను. నిన్ను నిర్దేశిస్తానని నాకేం తెలుసు? నాకేమైనా జరిగితే, మ్రింగేస్తాను లేకపోతే కక్కేస్తాను. అంతగా ప్రేమిస్తున్నావు కనుక నా మాటలు అతకనివి, ఆలోచించనివి అయినా నీకంత మధురంగా ఉన్నాయి. నా మాటల్లో విలువలేదు. నా పట్ల నీ అభిమానం వాటి కాయోగ్యతనిస్తోంది. భార్య - భర్తతో మాట్లాడుతున్నప్పుడు మైమరచి ఏదో మాట్లాడుతుంది. ఇతరులు వింటే నవ్వుతారు. కాని, ఆ మాటలు భర్తకి అతి మధురంగా అనిపించి ఆమెను వారించాలనుకోడు. భార్యమాటలు భర్తకి అతి మధురంగా ఉంటాయి. భర్త మాటలు భార్యకీ అంతే, కాని, ఆ ఆకర్షణ ఎక్కడుంది? పదాల్లోనా? గాఢ ప్రేమలోనా? అందువల్ల యదార్థ మేమిటంటే నేను చెప్పింది నీకంత మధురంగా అనిపించటం నీకు నామీద ఉన్న గాఢాభిమానాన్ని సూచిస్తోంది.

అత్యుత్తమమైన వస్తువులు అన్నిచోట్లా ఆదరింపబడతాయి. శ్రీకృష్ణుణ్ణి గురించిన మాటలమీద ఉన్న నీ యిష్టానికి యిది తార్కాణం. కుక్కలోనూ, పిల్లిలోనూ, పక్షిలోనూ కూడా కనిపించే మాతృప్రేమ హృదయాన్ని ఆనందపరుస్తుంది; వధూవరుల పరస్పర స్నిగ్ధప్రేమ మనుష్యులలో లాగానే చిన్న జంతువుల్లో కూడా కనిపిస్తుంది. శ్రీకృష్ణుణ్ణి గురించిన మాటలూఇంతే. ఘోరమైన పాపినోటినుంచి వెలువడినా, తర్కబద్ధం కాకపోయినా, ఎంతో మధురంగా అనిపిస్తాయి. నామాటల్లో మాధుర్యం లేదు. చాలాకాలం తర్వాత ఇంటికివస్తున్న భర్తపై భార్యకు కలిగే మధురస్మృతుల్లాగా మధురాతిమధురమైన విషయం గురించి కనుక మీకు అలా అనిపించవచ్చు. నామీద ఆదరం చూపవలసిన అవసరం లేదు. ఎవరైనా శ్లాఘించబడాలంటే అతడు ఎవరిని గురించిన ప్రసంగాలు అతి పవిత్రమో అతి మధురమో అటువంటి మధురమయుడైన శ్రీకృష్ణుడే. సాక్షాత్తూ అతడు అతని నామం ఒక్కటే. పైగా నామం ఇంకా మధురం, శ్రీకృష్ణనామం కూడా మధురమైన వస్తువుపేరు చెప్పగానే మనస్సుకి మాధుర్యం స్ఫురించినట్టుగానే సాధనలోపదేశ్రమ యింపు కాకపోయినా మనస్సుకి తట్టే అనేకమైన కష్టాల్నిప్రక్కనపెట్టి మనస్సుకి ఆనందాన్నే స్ఫురింపజేస్తుంది. "లిల్లీ" అనగానే దాని అందమైన రంగు సొంపైన ఆకారం గుమాళించే సువాసన, దానికి సంబంధించిన అందమైన అనుభూతులు మనస్సులో స్ఫురిస్తాయి. ముళ్ళరెమ్మా, లిల్లీ సంపాదించటానికి పడేబాధలు ఏమీ జ్ఞాపకం

రావు. కాని. నిజంగా మనం లిల్లీని చూస్తే, గుచ్చుకునే ముళ్ళకాడ క్రమంగా వాడిపోవటం. కోసి వేయడం ద్వారా కలిగే ఆకారంలో మార్పూ, ఇంకానచ్చని ఎన్నో విషయాలు మనోనేత్రం ముందుకివచ్చి, లిల్లీపేరు విన్నప్పుడు పొందినంత ఆనందాన్ని పొందలేము. మామిడిపండు మరొక ఉదాహరణ. మామిడిపండుపేరుకీ పండుకీ ఎంతో తేడావుంది. మామిడిపండు అనగానే - ఆపేరే ఎంతో మాధుర్యాన్ని మాత్రమే తలపింప జేస్తుంది. కాని మనం మామిడిపండుని చేతిలోకి తీసుకుంటే, తియ్యగా ఉంటుందా లేదా, అనే అనుమానం మొదట కలుగుతుంది. తర్వాత వగరుగా ఉండేపెచ్చు, గట్టిటెంక తల్చుకుంటాం. కాని మామిడిపండు అన్న పేరులో ఈ నచ్చని విషయాలు గుర్తుకిరానేరావు. పెచ్చు, టెంక తలవగానే స్ఫురించకపోగా, ఇంపైన సువాసన, తియ్యదనం మనస్సుకి తట్టుతాయి. కృష్ణుడికి కృష్ణనామానికి ఉన్న తేడా సరిగ్గా ఇదే. నామంలో అచ్చమైన మాధుర్యముంది. సాక్షాత్తు కృష్ణుడిలో భయవిస్మయాల్ని కలిగించే గుణాలున్నాయి. అందువల్లే అతని నామం అతనికంటె ఎంతోమధురం. అతని నామం ఎందుకు ఎన్నుకోతగిందో ఇంకొక కారణం-నామమే అతన్ని కొనగలిగిన ధనం. కొన్న ఏ వస్తువు కన్నా సరే ధనం విలువైందని ఎంచబడుతోంది. ఎందుకంటే అటువంటివస్తువును డబ్బుతో ఇష్టం వచ్చినప్పుడు కొనవచ్చు కనుక. అలాగే నామధనాన్ని క్రమంగా నిలవజేస్తే దాంతో శ్రీకృష్ణుణ్ణి కొనవచ్చు. అందుకే నామం అన్నిటికంటె ఉత్తమమైంది, శ్రేష్ఠమైంది. ధనాన్ని ప్రోగుచేయటానికి మొదట ఎంతో కష్టపడాలి. పిసినారిలాగా బ్రతకాలి. ప్రభు నామధనాన్ని ప్రోగుచేయటానికి జాగరూకు డవ్వాలి. గుట్టు నేర్చుకోవాలి. కొంతసొమ్ము కూడబెట్టిన తర్వాత దాన్ని వృద్ధి చేయటం తేలిక. ఎందుకంటే దానిమీద వచ్చే వడ్డీవల్ల మూలధనం దానంతటదే పెరుగుతుంది. అలాగే తగినంత పెద్దమొత్తంగా కృష్ణనామాన్ని ప్రోగుచేస్తే, దాపరికం మితిమీరు తుంటే, తీసుకోగల్గినన్ని జాగ్రత్తలు తీసుకున్నా, రహస్యం బట్టబయలవుతుంది. కాని మొదట్లో రహస్యంగానూ, జాగ్రత్తగానూ ఉంచాలి. లేకపోతే సంపాదించిన మొత్తం మొదట్లోనే పోతుంది. ఇందుకే శాస్త్రాలు మరీ మరీ ఘోషిస్తున్నాయి, ప్రభునామాన్ని ఏకాంతంలోనూ, జాగ్రత్త గానూ చేయాలని. నీ నిర్ణయం స్థిరంగా నిల్చేటట్లు తాత్కాలికమైన సుఖం కోసం శాశ్వతానందాన్ని బలిచేసుకోకుండా జాగ్రత్తపడు. మనం కలుస్తామని ఆశిస్తాను. ఎప్పుడు ఆ ఆశనెరవేరుతుందో తెలియదు. అతని సంకల్పాలే నెరవేరతాయి. నా గురించి ఆదుర్దాపడకు. నన్ను అప్పుడప్పుడు తలుస్తూ ఉండు.

నీ

హర

# 6వ పత్రము

ప్రియమైన అయ్యా, (బాబూ నృసింహప్రసాద్ ముఖర్జీ)

మీ దయార్ద్రమైన ఉత్తరం అందుకున్నాను. నెల కొకసారి పూర్ణచంద్రుడు కనిపిస్తాడు కనుక అతనంత ప్రేమింపబడుతున్నాడు. మీ ఉత్తరం చంద్రుడిగుణం పుణికి పుచ్చుకుంది. అందుకే అదంటే నాకంత ఆదరం చక్రవాకంలా. కవరులో పెట్టేటప్పుడు ఉత్తరంలో ఏం పెట్టారో నాకర్థం కావటం లేదు. మీ ఉత్తరం తీయగానే సంతోషం, విచారం ఒక దాని తర్వాత ఒకటి నన్ను ముంచెత్తుతాయి. సరాసరి మీ ఉత్తరం అందుకోగానే మిమ్మల్నే సాక్షాత్తూ చూచినట్లనిపించి నా ఆనందం అవధులు దాటుతుంది. కాని మరుక్షణం నా స్థితి రాబిన్‌సన్ స్థితిలా మారిపోయి "అయ్యో! గతస్మృతులు నన్ను తిరిగి నిస్పృహ వైపుకే పరిగెత్తిస్తున్నాయి" అని అతడన్న మాటలు నిరాశలో పడవేస్తాయి. అదెందుకు నాకంతబాధ కలిగిస్తున్నదో చెప్పలేను. నిస్సహాయుణ్ణి అందరూ అణగద్రొక్కుతారు. గత్యంతరం కానక సహనశక్తిని ప్రసాదించమని ఆర్తరక్షకుడైన శ్రీకృష్ణుణ్ణి దీనాతిదీనంగా ప్రార్థిస్తున్నాను. కష్టాల్లో నా హృదయ పెన్నిధానాన్ని విస్మరించకుండా ఉండాలని కూడా ప్రార్థిస్తాను. నాదని చెప్పేందుకు నాకేమీలేదు. అనాథుణ్ణి. ఎవరు దయతో ఆదరిస్తే వారివాణ్ణి. టిక్కెట్టు కొనకుండా ప్రయాణిస్తున్నాను. ఓడ యజమాని ఎలాశాసిస్తే అలా నడచుకుంటాను. డబ్బులేదు కనుక నాకు నోరులేదు. మీరు టిక్కట్టు కొన్నారు కనుక మీకు స్వేచ్ఛ ఉంది, మీకు అసంతృప్తి కలిగితే మీరు అడగగలరు. స్తుతి ప్రపత్తులు అండగా ఉన్నవారు, టిక్కట్టు కొన్నారు కనుక కెప్టెన్ కనుసన్నలకి తల ఒగ్గనక్కర్లేదు. కాని, నాలాంటి దిక్కులేనివారికి, భక్తిప్రపత్తులు లేనివారికి, ఆ కరుణామయుడి నామ (స్మరణ) సంకీర్తన చేయటం తప్ప వేరు గత్యంతరం లేదు. అతడు వారి పట్ల దయగానే ఉంటాడనుకోండి. అచంచల విశ్వాసంతో సదా అతని నామస్మరణ, అతని సంకీర్తనచేయటం మానవుల ప్రధానకర్తవ్యం. మహారాజుతో మహారాజు, ధనికుడితో ధనికుడు, యోగితో యోగి, సన్యాసితో సన్యాసి, యాచకుడితో యాచకుడు కలవటం మామూలే. కాని, ఏ విభిన్నులయినవారి కలయిక అయినా, ఆనంద దాయకం కానేకాదు. స్తుతిప్రపత్తులలో ధనాఢ్యులైన వాళ్ళు ఈశ్వరుణ్ణి, బ్రహ్మని, ఇంకా ఎవరిని గురించైనా మాట్లాడవచ్చు. కాని, దీనాతిదీనుణ్ణి, అనాథనయిన నేను, ఆర్తులకు, అనాథలకు దిక్కైన గౌరాంగుని ఆశ్రయించాలి. గొల్లపిల్లవాడు, గోపాలుడు, నా హృదయాంతర్వర్తి అయిన కన్నయ్య సాంగత్యం పొందాలి. ఇక్కడ స్తుతుల, తంత్రాల

ధ్యానాల పనిలేదు. కావలసిన దంతా కొంచెం ప్రేమ. కాని, నా అదృష్టం ఎంతబాగులే దంటే ఖర్చులేకుండా ఊరికేవచ్చే మామూలు ప్రేమని సైతం అతనికి అర్పించ లేకుండా ఉన్నాను. కాని, కృష్ణుడు ఎంతటి దయాళుడంటే అతణ్ణి ప్రేమించని వాడిని కూడా ఎక్కువగా ప్రేమిస్తాడు. అతణ్ణి కేవలం ద్వేషించేవాడి పట్ల కూడా అతడు దయాళువే. రాజ ద్వారం దగ్గర యాచించక ఎందుకు అతణ్ణి త్యజించాలి? ప్రేమమయుడి సాంగత్యంలో ఎడారిలోనయినా నివసించ దగినదే. ఓహో! మనసా వాచా కర్మణా వాడి వాడినయ్యేటట్లు దీవించండి. ముక్తిని లక్ష్యపెట్టను. బ్రహ్మ పదము, ఇంద్రపదవి కోరను. నేను కోరేదల్లా అతని సేవకులకి సేవకుడి నవటమే. నా వాంఛలు ఈడేరాలని ప్రార్థిస్తాను. నిస్సహాయులపై గల దయతో చలించిపోయి, కరుణామూర్తి అయిన హరి గౌరాంగరూపంలో అతిదీన పరిస్థితులలో పుట్టి అందరిపై కరుణని వర్షించాడు. శ్రీనిత్యానందుడి రూపంలో వాళ్ళ హృదయాల్లో పరమ ప్రేమని చిలకరించాడు. మనకోసం మన ప్రభువు పడిన బాధలు తలుచుకుంటే మన హృదయం పగిలి రక్తం స్రవిస్తుంది. నీ కరుణ అపారం. ఓ ప్రభూ! మా పాపాలకు నీ వెంతో బాధపడ్డావు. మాపాపభారం మోయటంలో విపరీతంగా బాధ పడ్డావని మాకు తెలిసినా, యింకా మా పాపభారాన్ని రోజూ పెంచుకోవటం మేం మానలేదు. మా గమ్యం ఏమనుకోవాలి! (మాలక్ష్యం ఏమిటి?)

అయ్యా, మీరు వ్రాసింది పూర్తిగా సత్యం. ఒక మనిషి వైష్ణవుడిగా మారగానే వెలివేయబడిన వానిలాగ చూడబడతాడు. స్వార్థం లేనందువల్ల నిర్జీవమైన వస్తువులాగా జీవిస్తాడు. "కులం పోగొట్టుకుంటే వైష్ణవుడవుతాడు" అన్న నానుడి ఒకటి ఉంది. స్వాభావికమైన ఉద్రేకాలు, అంటే గర్వం, దురభిమానం, మోహం, మౌఢ్యం,కామం, అవమానం, భయం బీభత్సం, ద్వేషం మొదలైనవి అతనిలో ఉంటే - అతడు వైష్ణవుడు కాలేడు. కనుక, కులాన్ని రూపుమాప నంతకాలం అతడు వైష్ణవుడుగా మారలేడు. వైష్ణవుడిగా మారగానే సామాన్యంగా అస్తిత్వరహితుడుగా పరిగణింప బడతాడు. కాని ప్రవాహానికి ఎదురు ఈదుతాడు, ఇదే - యమునా నది ఎదురు ప్రవాహమంటే, క్రమంగా ప్రవాహానికి ఎదురీది, వైష్ణవుడు మూలస్థానానికి చేరుకుంటాడు. సురక్షితంగా కాళ్ళూని (నిలద్రొక్కుకుని) అక్కడ నిశ్చలంగా ఉంటాడు. జీవులు, సాధారణంగా ప్రవాహం వెంబడే కొట్టుకుపోయి, సురక్షిత ప్రదేశానికి దూర, దూరంగా పోతాయి. మునుగుతూ లేస్తూ ఒక్క నిమిషం కూడా విశ్రాంతికి నోచుకోవు. అన్నిటినీ విడిచి మనం వైష్ణవుల మవుతామా! శ్రీకృష్ణుడి మధురవేణుగానమే యమునా నదీ ప్రతికూల ప్రవాహాన్ని కలిగిస్తుంది. ప్రవాహానికి

ఎదురీదుతూ జీవి శ్రీకృష్ణుడి వేణుగానం వింటాడు. క్రమంగా పోతూ ఆ వేణువాదిని చూస్తాడు. అతడి జీవితాశయం నెరవేరుతుంది. మామూలు ప్రవాహంతో బాటు దిగువకు వెళ్ళే వాడికి శ్రీకృష్ణుని మధుర వేణుగానం క్రమంగా సన్నగిల్లుతూ మందగిస్తుంది. చివరికి పూర్తిగా దూరమౌతుంది. శాశ్వతంగా ముక్తి మార్గాన్ని పోగొట్టుకొని, అంతకంతకీ అధికమయ్యే దైన్యానికి దాసులవుతారు. దీన హతభాగ్యులు ఊరట చెందకుండా బాధతో కళ్ళనీళ్ళు పెట్టుకుంటారు. గత కర్మల్ని తలుచుకొంటూ భయంతో దుఃఖిస్తారు. అయ్యా, కనుక, కేవలం అనాథబాలునిలా ఉండండి. కులాన్ని దూరంగానెట్టి వైష్ణవులు కండి. మహదానందం! కులాన్ని విడవటం మహదానందం. కులం లేకుండా పోయిందా, ఇతరుల్ని గురించి ఆలోచించనక్కర్లేదు. ఎక్కడైనా మీ భోజనం సిద్ధమే. ఇందుకే "చైతన్యుడి నాలుగు దిక్కులూ శూన్యమే" నని, జనులంటారు. ఈ అంటున్న నా మాటలు విని బహుశా మీరు నన్ను బుద్ధిహీనుడననుకోవచ్చు. నా బహుమానం లభిస్తే పాములబుట్టను మూసి సెలవుతీసుకొనటం మంచిది. ఎరుకలవాళ్ళకి ఎరుకలవాళ్ళు, గురువులకి, గురువులు, అంతర్ హర్మ్యాలికి ఆత్మీయులూ అయిన స్త్రీల వద్దకి నన్ను పోనీండి, నా నేర్పు వారి ముందు ప్రదర్శింపనీయండి.

(నృసింహబాబుగారి భార్యకి)

నమస్కారమమ్మా, ఎలా ఆడాలో నాకు నేర్పావు. అందుకని, జీతం ఇవ్వటానికి కనిపించాను. గతిలేని విద్యార్థి జీతంగా యిచ్చేది నమస్కారాలే కనుక, నీ దయాపూర్ణమైన అంగీకారానికి అవే నీకర్పిస్తాను. నాకు మీరు నేర్పిన ఆ ఆట విశ్వాన్ని సమ్మోహపరిచింది. మీరాడుతున్న ఈ ఖేల ఎవ్వరూ అర్థం చేసుకోగలిగినంత సమర్థులు కారు. మీరు ఘనులు. మీ గురువు, లేకపోతే ఒక్కొక్కప్పుడు శిష్యుడు, మాయావులకి మాయావి, కృష్ణుడు ఘనుడు. మీరు సంకల్పించి సృష్టించినదేదీ యధార్థం కాదు. ఓ! ఘనులు!నిజంగా ఘనులమ్మా! మీరే యమున అనుకూల, ప్రతికూల ప్రవాహాలు. రెండింటిలోనూ మీరే. మీ చేత ఆదరింపబడని వారు ఎప్పటికీ ప్రవాహానికి ఎదురు వెళ్ళలేరు. ప్రవాహానికి అనుగుణంగా కొట్టుకుపోయే వారితోనే ప్రపంచం నిండి ఉంది. మీ ఖేలని అర్థం చేసుకోగలిగిన సమర్థులెవరు? అగాధంలోకి త్రోయగలిగిన వారూ మీరే, మళ్ళీ ఉద్ధరించగల వారూ మీరే. మీరు జీవన్మరణ విధాతలు. సృష్టింపబడిన సకల జీవజగత్తుకి మీరు సామ్రాజ్ఞులు. మీరే వారి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. మీరు పుట్టిస్తారు. పోషిస్తారు. - మీరే భయంకర మృత్యువులా నశింపజేస్తారు. మీ శక్తి మహత్తరమైంది. మీరు మీవలలో వేసుకోనూగలరు, విముక్తి

చేయనూ గలరు. మీరు ఇచ్ఛాశక్తులు, దయామూర్తులు, విస్మయ మూర్తులు, భయంకర మూర్తులు, మీరు బహుముఖులు. మనిషి మిమ్మ్మ ఆరాధించే రీతిలో చూస్తాడు. దుర్గాదేవి సృష్టిని పోషిస్తుంది, దయామూర్తి. కాని, మళ్ళీ భీభత్సమూర్తి. భయంకర మూర్తి బగళగా అసురసంహార మూర్తి. మీరే రాజరాజేశ్వరిగా సర్వసృష్టిలో అతిలోక సౌందర్య సామ్రాజ్ఞులు. కాళిగా దేవతలలో కెల్లా భయంకరమూర్తులు. మీ ఖేలనీ, లీలలను అర్ధంచేసుకోగల సమర్థులు ఎవరు? ఇప్పుడు నేను ప్రార్థించే దేమంటే, మీ దయని పోగొట్టుకోకూడదని, మీ ప్రగాఢ స్నేహమయ కరుణామయ మూర్తిని నేనెప్పుడూ చూడాలని, మీ కఠినత్వాన్ని గురించిన ఆలోచనే నన్ను కంపింపజేస్తోంది. ఇంకా భయపెట్టకండి. మీ శిష్యుడిగా, కరుణామయవీక్షణాలతో నావంక చూడండి. ఈ పిచ్చివాడి ప్రేలాపనలకి ఆగ్రహించకండి.

మీ యిద్దరి అనురాగాన్నీ చూరగొంటూ, ఉంటాను.

మీ
హర

# 7వ పత్రము

అయ్యా, (నృసింహబాబు)

అతని నామం స్మరించటం కంటె అతని గుణాల్ని కీర్తించటం కంటె మించి ఇంకేముంది? ఇదే అన్నిటికీమూలం. అన్నీ దీనివల్లనే లభిస్తాయి. ఇదే శివుని ఆనందానికీ, నారదుని ముక్తికీ కారణం. శుకదేవుని ఘనతకు ఇదే కారణం. నామం ప్రేమని కలిగిస్తుంది. ప్రేమ ప్రేమాధి నాథుడైన నా మధురాతి మధుర రాసవిహారి (శ్రీకృష్ణుడు) దగ్గరకుచేర్చుతుంది. ఒక్క ధృవతారని ఆధారం చేసుకుంటే అన్ని గ్రహాల పరిజ్ఞానం పొందినట్లు, చెట్టుమొదట్లో నీళ్ళు పోస్తే - ఆ చెట్టు కొమ్మలు, రెమ్మలు, ఆకులు చివరికి పువ్వులకు కూడా నీరు పెట్టబడినట్లు, ఒకడు శ్రీకృష్ణుడి ముఖ్యాశ్రయమైన అతని నామం చేస్తే, అతడు తన మతపరమైన ప్రక్రియ లన్నిటినీ చేసిన ఫలితాన్ని పొందుతాడు. అష్టైశ్వర్యాలనీ పొందుతాడు. అతని కోరికలన్నీ ఈడేరతాయి. సర్వ మత ఆరాధనల ఫలితాలు నామం నుంచే సంప్రాప్తమ వుతున్నాయి. కనుక అతని నామం స్మరించటం కంటె, అతని గుణగానం చేయటం కంటె, ఇతరము ఏమన్నా చేయాలేమో నాకు తెలియదని అంటాను. చిరకాలార్జితమైన ధార్మిక ఆరాధనల వల్ల భగవన్నామ మాహాత్మ్యంపై విశ్వాసం కలుగుతుంది. కృష్ణనామం సాక్షాత్తూ కృష్ణుని కంటె బలవత్తరమైంది, రమణీయమైంది. నారదుడు

ఏరకమైన తపస్సులనైనా ఆరాధనలనైనా చేయాలని కోరుకున్నాడా? ఏరకమైన తాంత్రికశక్తి, సిద్ధి ఐనా శివుడు పొందనిది ఉన్నదా? శుకదేవుడు నిష్ణాతుడుకాని శాస్త్రాంగమేదైన ఉన్నదా? అసలు వారు భగవన్నామాన్ని, వారి ముఖ్యాశ్రయంగా చేసుకున్నమాత్రం చేతనేకదా? నామాన్ని ముఖ్యాశ్రయంగా వారు గౌరవించారు. అలాగే వారి ఉనికిని నామంలో లయింపజేశారు. పరమానందంలో రోజులు గడిపారు. శ్రీకృష్ణుడు మనల్ని అలాగే ఆనందంలో పిచ్చివాళ్ళని చేసే రోజుకోసం తపిస్తున్నాము. ఎప్పుడు ఆదయామయుడు మనమీద కరుణ వర్షిస్తాడో చూద్దాం. బలవంతం చేయటానికి అవకాశం లేదు. అదంతా అతని యిచ్ఛమీద ఆధారపడి ఉంటుంది. అది విశ్వాసంతో నిరీక్షించే విషయం. " నేను వైకుంఠంలో లేను. యోగి హృదయంలోనూ లేను. ఎక్కడ నా భక్తులు నన్ను కీర్తిస్తారో అక్కడ ఉన్నాను" . ఈ మాటలు కృష్ణుడన్నాడు. కేవలం ఇది బోధించటానికే వ్రజధామ సర్వస్వమైన కృష్ణుడు నిత్యానందుడిలా లేదా గౌరాంగుడిలా కళ్ళనీళ్ళతో గడపగడపకీ తిరిగాడు. అయ్యా, చెప్పవలసిన వినవలసిన అవసరం ఏదీ లేదు. మీరు మీ కళ్ళతోనే చూస్తారు. మీరు ఆనందిస్తారు. ఇతరులు మహదానందం పొందేటట్లు చేస్తారు.

యమునా నది ఎదురు ప్రవాహమంటే ఎత్తుకి ప్రవహిస్తోందనా? తేజస్సు, లేక, జీవశక్తి సంరక్షణ కల్పనగా యోగులచేత యమునా నదీ ప్రతికూల ప్రవాహం అని గుహ్యంగా వివరింపబడింది. కేవలం భావ వ్యక్తీకరణలకి (ఊహాగానాలకి) ప్రేమశరీరులైన విశేషజ్ఞులు తపించరు, సంతృప్తిపడరు. విరుద్ధ పద్ధతిని (యమునా నదీ ప్రతికూల ప్రవాహాన్ని) యథాతథంగా చూడాలని వారు కోరుకుంటారు. శ్రీకృష్ణుని మురళీరవళిని చెవులారా వినే అదృష్టం, యమునా నదీ ప్రతికూల ప్రవాహాన్ని గుర్తించే అదృష్టం నాకు కలుగుతుందా? నాకోసం ఎప్పుడు ఆ పవిత్రదినం ఉదయిస్తుంది? అతడొక్కడే చెప్పగలడు. అతని మీద ఏరకమైన అధికారమూ నాకులేదు. ఓహో! అటువంటి రోజు రావాలని దీవించండి. అయ్యా, పిచ్చివాడిలా వ్రాస్తున్నాననీ, పిచ్చి ప్రేలాపనలు చేస్తున్నాననీ నాకు తెలుసు. కాని, మరుక్షణం నా మనస్సు శూన్యమవుతున్నది. శ్రీకృష్ణుడు సంకల్పిస్తే మిమ్మల్ని దర్శించగల అదృష్టం నాకుంటే, అప్పుడు మాత్రమే చెప్పవలసిన దంతా గుమ్మరించి నా అతిభారమైన హృదయాన్ని తేలిక పరచుకుంటాను. అప్పటి వరకు, నన్ను నేను సంభాళించుకొని, సంతృప్తిపడాలి. కాని ఎవరు చెప్పగలరు? సరైన ప్రసూతి సమయం ఎవరూ జోస్యం చెప్పలేనట్లుగా ఈ భౌతిక శరీరం ఎప్పుడు దాని అదృశ్య ప్రాణంతో వేరై పోతుందో యదార్థంగా ఎవ్వరూ చెప్పలేరు. పుట్టుకా, చావులు సమానము. ఇది తెలియక,

చావుకి భయపడుతూ రోజూ ఏడుసార్లు చస్తున్నాము. కొంత నిదానంగా విషయాన్ని చూస్తే పుట్టుకలో మనంపొందే అంత ఆనందం చావులోనూ ప్రకటించాలి. అవతరణ అంతర్ధానం ఒకటే. ఏ మాత్రమూ వాటిలో తేడాలేదు. గత అనుభవం మాత్రమే మనల్ని మోసగిస్తుంది. అందుచేత మిమ్మల్ని కలుసుకునే మహదానందం పొందేలోపున నా ప్రాణం నా శరీరం నుండి వీడిపోతే - ఏమీ నష్టం రాదు. మనం మళ్ళీ కలుస్తాము, మళ్ళీ ఆడుకొంటాం. ఈ మన సంబంధం ఒకరోజుది కాదు. యుగయుగాలుగా ఇది ఇలా నడుస్తున్నది. నా ప్రణామాల్ని స్వీకరించండి.

మీ

హర

# 8వ పత్రము

అయ్యా, (నరసింగబాబూ)

మీరు పాముల నాడించే నేర్పరివారే కాక గొప్ప కోడెత్రాచు ఉన్న అదృష్టం కూడా మీకున్నది. ఎట్లా ఆడాలో, ఇతరుల నెట్లా ఆడించాలో మీకు బాగా తెలుసు. ఆ కళలో నేర్పరిని కాకపోవటంతో పాములు అరుదైన హిమాలయాల లోయల్లో రోజులు గడుపుతున్నాను. భయం లేకుండా రోజులు గడపటానికి నాకా విద్యని ఉపదేశించగలరా? కొంచెం ఆ నేర్పు సంపాదించాలని ఎంతో మనసుగా ఉంది. కాని, ఆ బుస నన్ను దూరంగా తరుముతోంది. ఒకటి రెండు గాయాలు నా ఒంటిమీద అయినాయి, ఆ గుర్తులింకా ఉన్నాయి. అప్పుడప్పుడు విచారిస్తుంటాను కూడా. మీరు మోహ పురుషులు. శాంతిగా కాలం గడుపుతున్నారు. శ్రీకృష్ణుడి దయ మీ మీద అపారం. మీ వాళ్ళలో ఒకణ్ణి కనుక అతడు నన్నంతగా ప్రేమిస్తాడు. భార్యని మించి బిడ్డపై ప్రేమని చూపాలి, బిడ్డపై తండ్రి ప్రేమ తల్లి జాగ్రత్తలను దోహదం చేయాలి. విషయాన్ని బయట పెట్టాను. ఒక్కొక్కప్పుడు మాట్లాడ బోయేటప్పుడు ప్రతిమాటని తూచితూచి వాడాలి, ఎందుకంటే ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు? ఒణుకుతూ నా రోజులు గడుపుతున్నాను. నా దేశాన్ని (భయ) భీతితో వదిలాను. మహారాజుతో యాచకుడి పరిచయం యాచకుడి చావుకి దారితీస్తుంది. దానితో ఉపశమనం పొందుతాడు. ఇది నన్ను భయపెట్టింది. కాని ఆ మహారాజు నన్ను రక్షించటానికి ఎప్పుడూ సిద్ధంగా ఉన్నాడు కనుక విడువలేదు. ఇప్పుడు మీ శరణు జొచ్చాను. నా భయ నివృత్తికి ఏం చేయాలో అది చేయండి. అయ్యా, వారు మనం అనుకునే మామూలు మహారాజులు కారు. ఇంటికి మహారాజ్ఞి బయట

మహారాజ్ఞి, స్వర్గానికి, నరకానికి వైకుంఠానికి, గోలోకానికి, బృందావనికి రేరాజ్ఞి. ఇప్పుడు చెప్పండి ఎక్కడదాక్కోను? శివుడే ఇల్లూ వాకిలీ విడిచి స్మశానంలో దాక్కున్నాడు. అయినా, ఆ మహారాజ్ఞినించి తప్పించుకోవటం అసాధ్యం అని తెలుసుకున్నాడు. మానవ మాత్రుల సంగతి ఎంత? కాని, అయ్యా, మీరొక్కరే ఆ మహారాజ్ఞినించి మీవారిని ఆపగలరు. ధైర్యంలో లోటు లేదు. ఈ పరిస్థితిలో మీరే తగినవారు. ఆపాదమస్తకం వణికిపోతూ వాళ్ళ చరణాలవద్ద శరణుజొచ్చాను. కాని ఇంకా వణుకుతున్నాను. ప్రకృతి బలీయమైంది. ఆమె ఆజ్ఞసర్వత్రా ప్రత్యక్షమౌతోంది. ఆమె మహాశక్తి. ప్రజల అదృష్టం ఆమె చేతుల్లో ఉంది. కొందరిని ఈ రోజు నశింపచేస్తోంది. మిగిలిన వారిని రేపు నశింపజేయటానికి అట్టిపెట్తోంది. కొందఱిని అణగద్రొక్కి మఱికొందఱిని ఉద్ధరిస్తోంది. ఒక్క శ్రీకృష్ణుడు తప్ప మిగతా అందరూ ఆమె సేవలో ఉన్నారు. నిజం చెప్పాలంటే, అయ్యా, ఆమె అంటే భయంతో శ్రీకృష్ణుణ్ణి ఆశ్రయించాను. ఏం జరుగుతుందో తెలియదు. ఈ దయలేని పాలకుల చేతుల్లో ఏరకంగానూ పడకుండా ఉండాలని శ్రీకృష్ణుడికి నా ప్రార్థన. ఇంతవరకు నేను ఈ మహత్తర మనోహర పాలకుల సంతోషాకృతుల్నే చూచాను కనుక, ఆ సంతోషాకృతుల్ని ఆసాంతం అలాగే చూస్తూ ఉండాలని నా ప్రగాఢ కాంక్ష. వారి దయని కోరు కుంటున్నాను. ఇంకేమీ వద్దు. మీరు దయదలిస్తే కృష్ణుడు కూడా దయదలుస్తాడు.

మీ
హర

# 9వ పత్రము

నాన్నా అనూ,

నీ ఉత్తరం చూడగానే ఎంతో బాధ కలిగింది. ఇలా నాకు వ్రాయటం వృథా. ఏమైనా ఆ మధుర నామాన్ని ఆస్వాదిస్తూ ఇతరులకి మేలు చేసే పనిలో నిన్ను నీవు నియోగించుకుని, శ్రీహరి ప్రేమలో మత్తిలి ఉండు. సహజంగానే శ్రీకృష్ణుడు నీ మీద దయతో ఉంటాడు. శ్రీకృష్ణుణ్ణి నీ స్వంతం చేసుకొనే ఏకైకమార్గం అలా చేసుకోవాలనే నీ బలీయమైన ఆకాంక్ష. ఏ విలువైన వాటికీ బదులుగా అతణ్ణి పొందలేము. పూజలు, నియమాలు, తపస్సులూ, లేక అధ్యయనాలు అతణ్ణి పొందటానికి సమర్థమైనవికావు. అందుచేత నీవు నీ ప్రయత్నంలో దృఢంగా ఉండేటట్లు చూసుకో. శ్రీకృష్ణుడికి అన్ని వస్తువులూ సమానమే. ప్రపంచం నీ స్వంతమని భావించు. అది శ్రీకృష్ణుడిది. శ్రీకృష్ణుడు నీకు ప్రియుడు కనుక, అతనికి

సంబంధించిన వస్తువులు తప్పని సరిగా నీకు ప్రియమైనవి కావాలి. కేవలం దాని కోసమే జగత్తువైపు ఆకర్షితుడవు కాకు. శ్రీకృష్ణుడినే ప్రేమించు. అప్పుడు ద్వేషానికి లేక అసహ్యానికీ నీ హృదయంలో స్థానం ఉండదు. ఒక వస్తువు ఇంకొకరికి చెందినదని తెలుసుకొన్నప్పుడు, నీ స్వంతమని ఎప్పుడూ తలంచవు. పశులకాపరి కుర్రవాళ్ళు తమ మందలతో పచ్చిక బీళ్ళల్లో జేరినప్పుడు ప్రతివాడూ తన కాపలాలో ఉన్న ఈ పశుల మందని తనదని అంటాడు. ఒకడు అంటాడు "నా ఆవుని వెనక్కి తోలుకురా". "నా ఆవు జబ్బున పడింది" "నా ఆవు దూడని ఈనింది" అని అంటారు. కాని, తాత్కాలికంగా తనవని అన్నా, తన మందలోని పశువులు నిజంగా తనవికావని అతనికి తెలుసు, కనుక, సంతోషంగానీ, దుఃఖంగానీ పొందడు. అలాగే తన హృదయంలో ప్రతి వస్తువూ శ్రీకృష్ణుడిదని గ్రహించగానే ప్రతి వస్తువు తనదని అన్నా, ఏ వస్తువుమీదా అతనికి ఆకర్షణ ఉండదు. ఇది సన్యాసం, లేక, పరిపూర్ణమైన ఆత్మనిగ్రహం. ఇటువంటి ఆలోచనలు ముక్తికి దారితీస్తాయి. అలా యోచించేవాడు ముక్తుడు. ఇలా జీవించటానికి ప్రయత్నించు. ఇలా జీవించి, ఇతరులకి మేలు చేయటంలో నిమగ్నుడవైతే, అహంకారం నీ మనస్సులో ఎప్పుడూ జొరదు. అహంకారం లేకపోవటంతో ఆత్మోత్కర్షనించి నీవు విముక్తడవవుతావు. గర్వరహితుడివై, స్వార్థ రహితుడివై, నిత్యానందుడి దయను పొందుతావు, అప్పుడు కృష్ణ చైతన్యుడి దయను పొందటం నీ చేతుల్లో ఉంటుంది. అప్పుడు పూర్తిగా నిశ్చలంగా ఉంటావు. అప్పుడు నీవు మహదానందం పొందటమేకాక, ఇతరుల్ని కూడా ఆనందంలో తేలిపోయేటట్లు చేస్తావు. ఇతరుల్ని ఆనందంలో ముంచేస్తావు కూడాను.

నీ
హర

# 10వ పత్రము

అయ్యా (నృసింహబాబు)

శుభాకాంక్షలతో అమృతపూర్ణమైన మీ లేఖ నన్ను ఆనందోద్విగ్నుణ్ణి చేసింది. దేనితో మీ ఉత్తరము వ్రాశారో తెలియదు, అది నన్నింత సమ్మోహితుణ్ణి చేసింది. గత పుణ్యకర్మల రాసులు మీవంటిరత్నం వద్దకు చేర్చాయి. కృష్ణుడు అనంతదయాపూర్ణుడు. అతని దయ అవధులు లేనిది. అద్వితీయమైంది. పతితుల యెడ మరింత కరుణాళువు. అందుకే నన్నింతగా ప్రేమిస్తాడు. మేఘాలకోసం

ఎదురుచూసేలోపే రమణీయమైన కరుణని వర్షిస్తాడు. కాని, ఆశ్చర్యమేమిటంటే మనం అంతకరుణా పూర్ణుణ్ణి మనదృష్టినించి పోగొట్టుకుంటాం. ఛీ! నా బ్రతుకు. అయ్యా! శ్రీకృష్ణుడు క్రొత్త జీవితాన్ని మీకు ప్రసాదించాడు. క్రమంగా సుఖ శాంతుల్ని ప్రసాదిస్తాడు. నిశ్చింతగా ఉండండి, కాని నా మీద దయజూపిస్తూవుండండి. నిస్సహాయులపై దయచూపితే కృష్ణుడు సంతోషిస్తాడు. అయ్యా, నాకు వ్రాయటంలో మీరు నన్నెలా తలుస్తున్నారో నేను బొత్తిగా పట్టించుకోను. బండరాయిలా కఠోర నియమాలతో జీవితాన్ని గడిపితే సుఖంగా ఉంటాననుకున్నాను, కాని అటువంటిదేమీ జరగలేదు. మామూలు మనిషి సేవలో నన్ను నేను నియోగించుకొని, దానితో శ్రీకృష్ణుణ్ణి పోగొట్టుకున్నాను. నావంటి బుద్ధిహీనుడు ఇంకొకడుంటాడా ఈ భూమి మీద? అప్పుడప్పుడు బ్రతుకు భరించరానిదిలా అనిపిస్తుంది. ప్రతిదీ శ్రీకృష్ణుని యిచ్ఛమీద ఆధారపడి ఉంది. అతడు దోవ చూపించాడు. అతడే మళ్ళీ దానిని చీకటి చేశాడు. అతని యిచ్ఛ ప్రకారమే అన్ని విషయాలూ నియంత్రింపబడ్డాయి. నియంత్రింప బడతాయి. మన మందకొడి ఆలోచనలు ఎందుకూ పనికిరావని తెలుసు, కాని ఊరికే కూర్చోలేము. అప్పుడప్పుడు ఎంతో విసుగుకుంటాం, ఆ కరుణా స్రవంతి మీదే క్రోధవీక్షణాలు బరపుతాము. ఓహ్? నాశేష జీవితము పూర్తిగా శ్రీకృష్ణునిపై ఆధారపడి జీవించేలా దీవించండి.ఈ లౌకిక గతిలో కొడుకులూ, కూతుళ్ళూ తప్పుల చిహ్నాలు తప్ప మరేమీ కావు. భ్రమ జనితమైన విషయాలతో సుఖించుదామనుకొనే వారు మరింత భ్రమలో పడ్తారు. కాని, సంస్కారులైన బుద్ధి మంతులు, అపజయ చిహ్నాన్ని దృష్టిలో పెట్టుకుని, (తొలి అపజయాన్ని ఊహించుకుంటూ) రెండోసారి భ్రమలో పడకుండా వారి పనిని వారు చేసుకు పోతారు. ఆ మాయ నన్ను క్రమ్మి నా ప్రాణానికి ప్రాణమైన శ్రీకృష్ణుడు పూర్తిగా మనస్సులోనుంచి జారిపోయేటట్లు చేసింది. ఏమైనా అతడు దయామయుడు కనుక నా దృష్టి పథం నుంచి తొలగలేదు, కాని నిలవటం లేదు. నా మీద ఎంతో యిష్టం చూపుతూ ఉంటాడు. ఇప్పుడు నాకు మీరున్నారు చూడటానికి, అప్పుడప్పుడను కుంటూ ఉంటాను. నేను నిశ్చింతగా ఉండవచ్చునని, మళ్ళీ భ్రమలో పడకూడదని. హృదయంలో ఆ ఊహతోనే మీ ఆశ్రయం జొచ్చాను. మీ శరణాగతుణ్ణి రక్షించమని నా ఏకైక ప్రార్థన, తప్పిపోయిన వాణ్ణి యింకా తప్పుదోవ పట్టించకండి, త్రాగిన వాణ్ణి యింకా త్రాగించకండి. దురహంకారంతో ఊగిపోతూ నడుస్తున్నాను. లోతు నీళ్ళలోకి నన్ను త్రోస్తే మీరు మళ్ళీ నన్ను పొందలేరు. నన్ను ముంచటమో తేల్చటమో మీచేతిలోనే ఉన్నది. మీ యిష్ట ప్రకారం చేయండి. అనంతమైన జీవశక్తిని

తృణీకరిస్తూ ఆమెతో ఆటలాడటానికి వెళ్ళాను. ఇప్పుడు నా తప్పులకి ఫలితము అనుభవించే సమయం వచ్చింది. అనాయాసంగా యీ సర్వజగత్తుని కబళిస్తున్న ఆశక్తిని మనం సామాన్య అబలగా భావిస్తాము. వాళ్ళెవరో, వాళ్ళపనేమిటో ఒక్క నిమిషం ఆగి ఆలోచించము. వాళ్ళంతా చైతన్యమూర్తులు. మనం తడబడుతుంటే ఎంతో సంతోషపడతారు. మన బంధాన్ని దృఢతరం చేయటానికి ఎప్పుడూ వాళ్ళు సిద్ధమే. "బిగించబడటం" తెలియకుండా దూరం నించి ఎప్పుడైనా సంభవించవచ్చు. క్రొత్తరకమైన సంకెళ్ళని కల్పించటంలో వాళ్ళెప్పుడూ నిమగ్నులై ఉంటారు. వాళ్ళ పెంపుడు జంతువులమైన మనం గొణక్కుండా, మన చేతులూ, మెడా ముందుకు జాపుతాము, మన శరీరాలచుట్టూ మరిన్ని బంధాలు మృదువుగా తగిలించి మనల్ని వాళ్ళు చైతన్యం లేని నిర్జీవ ప్రతిమలుగా మారుస్తారు. వాళ్ళు కరుణామూర్తులూ, అంతే కర్కశులున్నూ, వాళ్ళ లీలలు ఎవరికి తెలుసు! వాళ్ళ దయ పొందటమే ముఖ్య ఆశయంగా అన్ని జీవులూ ప్రభవించాయి. కాని, ఎదిగి, బలంపుంజుకోగానే వాళ్ళ కర్తవ్యాన్ని మరచిపోయి వాళ్ళతో సమానమనో లేక అధికులమనో తలపోసి, వాళ్ళతో ఆటలాడటం మొదలు పెట్టారు. అనతికాలంలోనే వాళ్ళ తప్పు వాళ్ళు తెలుసు కొంటారు. పూర్తిగా ఓడి వాళ్ళ బందీలుగా పూర్తిగా నిస్సహాయులమని తమ్ముతాము తెలుసుకొంటారు. దిక్కులేని బరువులు మోసే పశువులలాగా కళ్ళనీళ్ళతో బరువులు మోస్తూ అప్పుడప్పుడు కొరడా దెబ్బలు తింటుంటారు. అందుకని పాముల వంటి వాళ్ళతో ఆటలాడటం మంచిది కాదు. ఎవరైనా అలా చేయటానికి ధైర్యం చేస్తే పూర్తిగా వాళ్ళని సమ్మోహ పరచగల కళలో ముందర ఆరితేరాలి. దురదృష్టవశాత్తూ, 'అ' 'ఆ'లు నేర్చుకోకుండా వాళ్ళ సేవకి పరుగెత్తుతారు. తరువాత పర్యవసానంగా వ్యథతో, తన్నులతో, గుద్దులతో రోజులు గడపవలసి వస్తుంది. మన ఐచ్ఛికమైన అభివృద్ధి అంటానికి వీలులేకపోగా మన ప్రయత్నంలో మనకిదక్కేది తన్నులే. పోగా, దీనిలో అందమేమిటంటే - ఆ తన్నులు ఎముకలు విరగగొట్టేవయితే, ఆ ప్రయత్నంలో ఏదో ఒకరోజున అసహ్యం కలిగిస్తాయి. కాని మెత్తని పాదాలతో తన్నులు కనుక మనోహరంగా ఉండి వాటిమీద మక్కువ కలుగజేస్తాయి. ప్రతివాడి జీవితంలోనూ యిది స్పష్టంగా నిర్దేశింపబడింది. ఈ ఏకైక లక్షణాన్ని కలిగినవారు అదృష్టవంతులు. పెద్ద ముసుగుగా శ్రీకృష్ణుడు కళ్ళబడ కుండా అడ్డిన తెర ఈ గుణమే. ఎవరైనా అతనిని చేరటానికి ప్రయత్నిస్తే దృష్టిని పడకుండా కాపాడుతున్న వాళ్ళ చేతుల్లో పడక తప్పదు. రెండువైపులా పదునున్న అంపాలు వాళ్ళు. వాళ్ళని దయార్ద్రుల్ని చెయ్యటమూ, లేక వాళ్ళ క్రోధాన్ని రేకెత్తించటమూ రెండూ సమానంగా భయానకాలే.

సంస్కారవంతుడైన, అభిమానం గల, నిజంగా తెలివైనవాడు మాత్రమే వాళ్ళ చేతు ల్నించి తప్పించుకొంటాడు. ఎందుకంటే వాళ్ళ పథకాన్ని రూపొందించు కోవటంలో వాళ్ళు బహు జాగరూకలు. "కళంకాలూ, అపకీర్తుల మయమైన సరస్సులో మీరు తలవెంట్రుకలు తడవకుండా స్నానం చేయవచ్చు" అని అటువంటి వాళ్ళలో ఒకడన్నాడు.

బలప్రయోగం కాని, పొగడ్తకాని పనికిరావు. ఒక మధ్యస్థ పథకం అవసరం. దయచేసి ఆ మార్గం నాకు చూపండి. బహుశా దీనిని దృష్టిలో పెట్టుకుని, ఒకపాటలో నీలకంఠ అన్నాడు. "ఓ జగన్మాతా! నా కళ్ళని కప్పిన తెరని ఒక్కసారి తొలగించు, నీ దయతో అపార పారావారమైన ఈ మాయా ప్రపంచాన్ని దాటుతాను."

ఎన్నో కోరికలు నెరవేరాలని నీ శరణుజొచ్చాను. దయ దలచండి. పనిలో ఉన్నానని మీరు ప్రతిరోజూ బిచ్చగాడితో అనకండి, అతని జోలె ఒక్కరోజైనా నింపండి. నిజంగా మీ వద్ద ఇచ్చేందుకేమీ లేకపోతే ఒక శిఫారసు ఉత్తరాన్నివ్వండి, అది గృహిణుల ముందుంచి నా బిచ్చం నేను గ్రహిస్తాను. వాళ్ళు దయతో చూస్తే ఇంకా పొందలేనిది ఏమీ లేదు. వాళ్ళు ఇచ్ఛాపూర్ణలు, ఆనందమూర్తులు వాళ్ళదయని అర్థిస్తున్నాను. ఈ పిచ్చివాడి మాటల్ని మీరు పట్టించుకోకండి.

మీ
హర

## 11వ పత్రము

అయ్యా,

నిజమే, మీ లేఖ వస్తూనే ఉన్నది, కాని వచ్చేంత వరకూ ఆగలేక, "గౌరవించమని ప్రాధేయపడటం, ప్రేమించమని ఏడవటం" అన్నట్టుగా మళ్ళీ మిమ్మల్ని సమీపి స్తున్నాను. గౌరవనీయుల నుండి గౌరవాన్ని ఆశిస్తాను. నిజంగా పూజనీయులైన వారికి పూజనీయత అంటే ఏమిటో తెలుస్తుంది. అందుకే అత్యంత నీచుల దగ్గర నుంచి అత్యంత ఉన్నతుల వరకూ గల స్త్రీల పాదాలవద్ద నా జీవితాన్ని ఆత్మని సమర్పించుకున్నాను. వాళ్ళదయను ప్రేరేపించగల నేమో ఇప్పుడు చూడనీయండి అవును, వాళ్ళముందు మీ సిఫారసులతో కనిపిస్తాను. అది వాళ్ళకి జాలి కలిగిస్తుందేమో చూస్తాను. సృష్టిలో స్త్రీ వర్గ మంతా మూలమైన రూపరహిత జడపదార్థమనబడే అఖండ అనంతశక్తి యొక్క ఒక్కొక్క తీరుకు ప్రాతినిధ్యం వహిస్తుంది. "పొట్టేలు కొమ్ములు వంకరలు తిరిగి ఉన్నా పోట్లాడేటప్పుడు సూటిగా ఉంటాయి" అని నానుడి. అలాగే అందరు స్త్రీలు స్వాభావికంగా ఒకటే. "అందరు

స్త్రీలు ఒకటే, కాని వాళ్ళ ముఖాలు వేరు" ఏ అర్థంలో తీసుకున్నా ఇది పూర్తిగా సత్యం. ఆంగ్ల రచయిత వాడిన భావమూ సత్యమే. నిస్సందేహంగా భూమి మీద స్త్రీజాతి అగాధమైన మూలశక్తికి ప్రాతినిధ్యం వహిస్తోంది. హిందూ పురాణాల ప్రకారం, శివుడు తనని కాశీనుంచి బహిష్కరిస్తే రెండవ కాశీ నిర్మించాలని వ్యాసుడు ఆశించి, తన పవిత్రజలాలతో దానిని చుట్టివెళ్ళమని గంగని ప్రార్థించవలసి వచ్చింది. గంగ అతని ముందు ప్రత్యక్షమై, "వ్యాసా! అపోహలో పడ్డావు. పార్వతి ఆగ్రహానికి గురై ఆవిడకి వ్యతిరేకంగా నన్ను ప్రార్థిస్తున్నావు. పార్వతికీ నాకూ భేదం లేకపోవటమే కాదు, జగత్తులోని స్త్రీజాతి యావత్తూ ఏ రూపంలో ఉన్నా అంతా నాతో సమానమే" అని తెలియజేసింది. అందుకని స్త్రీలు ఎవరనే సమస్య మానవ మేధస్సుకి అతీతమైంది. వాళ్ళని అల్లంతదూరం నుంచే పరామర్శించటం ఒక్కటి మాత్రమే వాళ్ళని కప్పిన మాయని అధిగమించే కీలకం. అంతిమ ముక్తికి రహదారి అనుమతి పత్రం వాళ్ళ చేతుల్లో ఉంది. ఎప్పటికీ అది అంధకారమయం చేసి, అధఃపతన మార్గాన్ని సుగమం, సునాయాసం చేయటం వాళ్ళ అధికార పరిధిలోనే ఉన్నది. ఇంత విపరీతశక్తుల్ని శాసించేవారికి నిరుపాధికంగా సర్వసమర్పణమవటం తప్పని సరి. వారి సంతోషవీక్షణ మనోహరమైంది, సత్ఫలితాలిచ్చేదీను. వారి వైర ప్రవృత్తి అగోచరం, అతిభయంకరం. అటువంటి దృష్టినాపై బడకూడదని కోరుకుంటాను. పాలిచ్చి నా ప్రాణాన్ని నిల్పిన ఆ స్థనాలు మళ్ళీ తమవైపు ఆకర్షించుకుని, నిర్వాణానికి పంపటానికి సిద్ధంగా ఉన్నాయి. ఎంత అప్రతిహతమైన (నిరోధించవీలుకాని) శక్తులు! శరణు! శరణు! అయ్యా, మీరు నిజంగా ప్రశంసనీయులు. సుందర సర్పాల్ని అత్యంత నైపుణ్యంతో సంభాళించి జనాన్ని సమ్మోహ పరుస్తున్నారు. ఏమైనా, అది నా దురదృష్టం. ఆకళలో నేను బొత్తిగా చేతగానివాణ్ణి. తమరు దయచేసి నన్నా కళలో ప్రవేశపెట్టే నానా ప్రకారాలైన ఈ భయంకర బహుముఖ జీవుల్తో కొంత వినోదిద్దామనే నా బలీయమైన కోరికను ఒక్కసారైనా పూర్తిగా తీర్చుకోగలనేమో, కాని అటువంటి ఆనందానుభూతి నాకు ప్రాప్తించదేమోనని భయంగా ఉంది. అ, ఆలు రానివాళ్ళకి శంఖు ప్రకరణం వివరించటం కష్టమైన కార్యం. కాని, నిజంగా గొప్పవారికి, ఏదీ అసాధ్యంకాదు. మీరు తలిస్తే ఏదైనా చేయగలరు. ఈ లేఖ మీ కొక్కరికే కాదు. అది మీ యిరువురి విభిన్న అర్ధగోళాల సంయోగానికి వ్రాయబడింది. అటువంటి ద్వంద్వ సంయోగమే నన్ను శాసించి రక్షించగలదు. కనుక అటువంటి సంయోగ మనోహర దృశ్యాన్ని కల్పించటానికి, చూచి ఆనందించటానికి అంత యిష్టపడతాను. మీ యిరువురికీ నా శుభాకాంక్షలు. మనోహరులు, ప్రౌఢలూ అయిన దేవతా స్త్రీలు వాళ్ళ ఘనతను ప్రదర్శిస్తుంటే చూడట నాకు ఎంతో యిష్టం. మీ

హర

# 12వ పత్రము

అయ్యా!

మీరు ఆరోగ్యంగా ఉండక పోవటానికి మరొక కారణం పూర్తిగా వేరే దృష్టితో పరిశీలించాలి. పెద్దైన ఎదిగిన పిల్ల భర్త ఆధీనంలో కాక పుట్టినింట్లో ఉంటే పూర్ణారోగ్యవంతురాలిగా ఉంటుందని ఎలా ఆశించగలం? గుండెదడ, మూర్ఛ, బలహీనత, ఉదాసీనత ఆవిడ అనారోగ్యానికి ప్రధాన కారణాలవుతాయా? అచ్చంగా అటువంటి పరిస్థితులే భగవంతుని సృష్టిలోనూ ప్రత్యక్షంగా చూస్తాము. మొదటి దశ అవ్యక్తం. మధ్యదీ ప్రధానమైనదీ అయిన దశ శక్తి, కర్మల దశ. మూడవదీ, చివరిదీ ఉత్తమ దశ. వారి అవ్యక్త స్థితినుంచి ఉత్తమ దశ మార్గంలో మానవులు సరిగా పురోగతి పొందకపోతే తాము త్రోవ తప్పినట్లుగా తప్పకుండా గ్రహిస్తారు. పసితనాన్నుంచి యౌవనం వరకు గల జీవితభాగం పెద్దగా లెక్కలోకి రాదు. పూర్తిగా వదిలివేయవచ్చు. యౌవనారంభంలో మానవుడు మొదటిదైన అవ్యక్తదశలో ప్రవేశిస్తాడు. అనేక కామ్య కర్మలని చేస్తాడు. అప్పుడు అవ్యక్త నిర్వాణ స్థితుల మధ్యంతర దశ, ఒక శక్తిదశ - ప్రకృతి స్థితి పొందుతాడు. నిర్వాణం పొందాలన్నది వాంఛనీయమైనప్పుడు క్రమంగా వృద్ధుడవుతాడు. ఇదే న్యాయం, ఆరాధనా పద్ధతులలోను కనిపిస్తుంది. ప్రాథమిక లేక మొదటి దశ శక్తి ఆరాధనతో కూడి ఉంటుంది. రెండవదీ మధ్యదీ అయిన దశ శివసూర్యాదుల ఆరాధనతోను, చివరి దశకు చేరుతూ ఆ సాధకుడు వైష్ణవుడవుతాడు. తల్లి సంరక్షణలో తప్పటడుగులు వేసే స్థితి దాటింది. జగన్నాథుడైన శ్రీకృష్ణుని ఆశ్రయం పొందవలసిన సమయమాసన్న మైంది. మీ పూర్వ పుణ్య విశేషఫలంగా బృందావనం వచ్చారు. అపవిత్ర వాతావరణాన్ని తాము పూర్తిగా శుద్ధిచేసుకుని, శ్రీకృష్ణ మధుర నామాన్ని చేయటం మొదలు పెట్టండి, క్రొత్త సుఖమయ జీవితాన్ని శాశ్వతంగా పొందినట్లు గ్రహిస్తారు. ప్రాథమిక దశలో ఉన్నవారికి అనువైన మాంస భోజనానికి, యజ్ఞ యాగాదులకోసమని ప్రత్యక్షంగా జంతువుల్ని వధించటం ద్వారా శరీరాన్ని, మనస్సునీ కలుషితం చేసుకునేందుకు ఇది సమయం కాదు. తేలికైన సాత్త్వికాహారంతో శరీరాన్ని పోషించుకుని, శ్రీకృష్ణ నామంలో మగ్నమయ్యే సమయ మిది. ఒక్క నెలరోజుల స్వల్ప వ్యవధిలో స్వాస్థ్యం, చిత్తస్థైర్యం కలుగుతాయి. నిర్మలమైన ఆనందం కలుగుతుంది. శరీరారోగ్యం ఆహారం మీద ఆధారపడి ఉంటుంది. కనుక మంచి పోషకాహారం ఆరోగ్యాన్నివ్వక తప్పదు. మట్టితో చేసినవి మట్టి వలెనే ఉంటాయి.

బంగారంతో చేసినవి బంగారంలాగానే ఉంటాయి. మట్టి బంగారం కాదు, అలాగే బంగారం మట్టికాదు. అలాగే అశుభ్రమైన పుష్టిలేని తిండి శరీరానికి అనారోగ్య లక్షణాన్ని కలిగిస్తుంది. అయ్యా! నేను మహా పాపాత్ముణ్ణి. శ్రీకృష్ణ నామ మాహాత్మ్యాన్ని నేనేమి అర్థం చేసుకుంటాను? కాని పురాణాల నుంచి, మహాత్ముల నుంచి విన్నది ఏమిటంటే శ్రీకృష్ణనామం పరమౌషధం. ఇతర ఔషధాలు ఈ రక్త మాంసములతో కూడిన శరీర వ్యాధుల్ని నివారిస్తాయి. కాని ప్రభునామం ఆధ్యాత్మిక రుగ్మతల్ని నిర్మూలించటంలో శక్తివంతమే కాక, భక్తుణ్ణి పునీతుణ్ణి చేస్తుంది. శ్రేష్ఠతమ శాంతి ధామమైన బృందావనానికి అతణ్ణి గొంపోతుంది. ముక్తి సాధనకి ఇంతశక్తి వంతమైన ఉపాయం మరొకటి లేదు. కేవలం అతని నామాన్ని చేద్దామనే ఆకాంక్షే శారీరక రుగ్మతల్ని తొలగించి మనిషిని పునీతుణ్ణి చేస్తుంది. ఇప్పుడది ప్రయత్నించటం మంచిదికాదా! అట్టి నామాన్ని మర్చిపోవటం బాగుంటుందా? శివుడు అహోరాత్రాలు ఆ నామాన్ని స్మరించటం కోసం ఇల్లు విడిచి మారేడు చెట్టుక్రింద కూర్చున్నాడు. సాంసారిక పరిసర ఆకర్షణల్ని త్యజించటం ముక్తికి మార్గమని, ఆముక్తి సాధనలోను ఈ వర్తమాన జీవితంలో ప్రశాంతతకీ మారేడు చెట్టు ఒక మెట్టు అని నిరూపిస్తోంది. మీరు అన్ని సమయాల్లోనే ప్రభునామంలో నిమగ్నులు కావచ్చని మనవి చేస్తాను. ప్రతిదీ సుముఖంగా మారు తుందని మీరు గ్రహిస్తారు. పిచ్చి ఆవేశంలో వ్రాశాను. ఏమనుకోకండి, నన్ను క్షమించండి.

మీ

హర

## 13వ పత్రము

జతీన్‌బాబూ!

మొదటి నుంచి చివరివరకూ మీ ఉత్తరం ఒకసారి చదివే సరికి సిగ్గుపడ్డాను. నావంటి నికృష్ట వ్యక్తి నుంచి మంచి సలహా అడగటంలో తాటాకుల గుడిసెలోనో లేక ఒక చెట్టుక్రింద నీడలోనో నివసించే పేద వాడిని రాజ్యం అడిగినట్లయింది. నా నిజమైన స్థితి నాకే తెలుసు. నావంటి మోసగాడు మరొక డుండడు. తెలిసీ, ఒక తప్పుచేసేవాళ్ళు శ్రీకృష్ణుడి నుంచి క్షమాబిక్ష పొందవచ్చు. కాని నావంటి నాస్తికుడు, ప్రభునామం ముసుగు క్రిందో లేక మతం ముసుగు క్రిందో పాపాలు చేసేవాడు విముక్తి నాశించగలడా? నాలో చెలరేగుతున్న ఆలోచనలునన్ను కంపింప చేస్తున్నాయి. ఇతరులకి వెల్లడించటానికి ఏమాత్రం సాధ్యం కాదు.

"నావంటి పాపిగాని, దోషిగాని లేదు. పాపం నుంచి, వ్యసనాన్నుంచి దూరంగా ఉండటమన్న ఆలోచనే నన్ను సిగ్గుపడేటట్టు చేస్తోంది. పురుషోత్తమా? ఇక నేనేం చెప్పగలను?"

ఇదీ నా పరిస్థితి. నా తప్పుల్ని ప్రభువుముందు విప్పి చెప్పుకోవటానికి నాకు ధైర్యం లేదు. " లాభదృష్టితో సాదువేషంతో గడపగడపకీ తిరుగుతాను". ఇది సరిగ్గా నాకు సరిపోతుంది. అది ముఖ్యంగా వారు నాయెడ విశేషకృపతో ఉండటంవల్ల, నా పట్ల వారి ప్రేమవల్ల నన్ను వారిలో ఒకడిగా అనుకొనేటట్లు చేయటం వల్ల. అందుకే నాతప్పులు వారికి నా సుగుణాలుగా కనిపిస్తాయి. వాటిని ఉత్ప్రేక్షించటానికి సిగ్గు పడటం లేదు. నల్లచేమ గ్రూనంత నల్లగా ఉన్న పిల్లవాడి తల్లిదండ్రులు ఆ నల్లని రంగులో అందమైన నిగనిగ చూస్తారని అంటారు. ప్రేమికుడి కళ్ళు మరోదృష్టితో చూస్తాయి. తాను ప్రేమించే ఈజిప్టు స్త్రీ ముఖంలో కూడా దేవకాంత అందం ప్రేమికుడు చూస్తాడట వారు నన్నెందుకు గాఢంగా ప్రేమిస్తారో ఇది వివరిస్తుంది. అయినా ఏసుగుణాలూ నాలోలేవు. అయ్యా మీ గత కర్మల్ని విస్మృతిలో పాతిపెట్టండి. వాటిని గురించి విచారించకండి. శ్రీకృష్ణ నామోపదేశం పొందిన రోజు పాపులు గత పాపాల్ని పోగొట్టుకొని క్రొత్త జీవితాన్ని ప్రారంభిస్తారు. మీరు కూడా క్రొత్త జీవితాన్ని పొందారు. మీ గత కర్మల్ని త్రవ్వుకొంటూ మీ మనశ్శాంతిని పాడుచేసుకో నక్కరలేదు. ప్రశాంతంగా ప్రభునామం చేస్తూపొండి. అన్ని కష్టాలూ పోతాయి. గాఢ ప్రశాంతి ఆ స్థానంలో నెలకొంటుంది. అశాంతిగా ఉండకండి. శ్రీకృష్ణ నామాన్నిమించిన ఆకర్షణలేదు. సాంసారిక దుఃఖాల్ని పోగొట్టుకోవటానికి అది మాత్రమే పరమౌషధం. ప్రభు నామోప కరణం ద్వారా నిర్వికల్పానందం, శాంతి ఈ జన్మకీ వచ్చే జన్మకీ గూడా సంపాదించుకోవచ్చు. దీన్ని పోగొట్టుకోకండి. భగవన్నామం చేసేటప్పుడు సమయము స్థలము స్థితి గురించిన ప్రశ్నలే మీ మనస్సులో జొరనీయకండి. ఆసనశుద్ధి, భూశుద్ధి ప్రసక్తే లేదు. నామం చేసినప్పుడు యదార్థమైన లాభం ఆనందం అది కలిగిస్తున్నట్లు గ్రహిస్తారు. మానవుల దుఃఖాల్ని చూచి చలించి ఆ కృపాళువు శ్రీ గౌరాంగరూపంలో అవతరించాడు, ప్రభునామ స్మరణకి అధమాధముని నుండి అతి ఉత్తముడి వరకు ప్రతివారిని ప్రభావితం చేసి భూతలాన్ని స్వర్గంగా మార్చాడు. అలా అతడు అన్ని అవతారాలలోనూ అతి ముఖ్యుడుగా కనిపిస్తాడు.

ప్రస్తుతం మీ ఆరోగ్య పరిస్థితివిని చాలా విచారపడ్డాను. ఏమైనా మీరు కంగారు పడవద్దు. ఇంకా సమయమున్నది. మీ శిథిల గృహాన్ని నవ్యంగా నిర్మించుకునే ప్రయత్నం ఇప్పటికీ చేయవచ్చు. అదింకా నివాసయోగ్యమే. కొంచెం ఖర్చు పెట్టితే అది బాగుపడుతుంది. జాగ్రత్తగా ఉంటే మీరు ఇప్పటికీ ప్రశాంతంగా ఉండగలరు.

శరీరాన్ని సక్రమంగా ఉంచే ప్రాథమిక సూత్రం బ్రహ్మచర్యం. శక్తిలేక వీర్యమే ప్రాణం. శరీర సంరక్షణలో ఇది అతిముఖ్యం. ఈ ప్రాణశక్తిని సంరక్షించటమే బ్రహ్మచారి ముఖ్యకర్తవ్యం. ఇది మనస్సులో పెట్టుకోండి. ఈవిషయం గురించి ఇతర వివరాలు "అటలు" నుంచి మీరు పొందవచ్చు. రోజూ 10 లేక 12 యాలక్కాయలు కొన్ని రోజుల పాటు తినండి. మీకు చాలా లాభం కలుగుతుంది. ఏమాత్రం చిన్న సహాయం ఇతరులకి చేసినా జీవితంలో ఒక మంచిపని చేశానని తెలుసుకుంటారు. మాటల తోను చేతలతోను ఇతరులకి సహాయం చేయటానికి ప్రయత్నించండి. మీ ఆహారం గురించి చాలా నిర్దిష్టంగా ఉండండి. ఎప్పుడూ అశుభ్రమైన ఆహారం తినకండి. మీ సతీమణిని జాగ్రత్తగా చూసుకోండి. ఆమెకి తగిన గౌరవం ఇవ్వండి. అటువంటి భార్యలు కులదేవతలనీ, సకల శుభాలకీ ముఖ్యాధారాలనీ గ్రహించండి. భూమండలం మీద ఉన్న అందరిస్త్రీలకీ ఉచిత గౌరవాన్ని ఇవ్వండి. ఆడకుక్కలూ ఆడపిల్లులూ కూడా ఈ విశ్వశక్తిలో అంతర్భాగమేనని గుర్తించాలి. వాటిని అవమాన పరచకండి. జీవశక్తిని ప్రసాదించటానికిగాని, ఉపసంహరించటానికి గాని స్త్రీలే సమర్థులు. మీరు సమయమున్నప్పుడు ప్రశాంతంగా అటల్‌తో, నియోగితో ఇంకా మిగిలిన వారితోనూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరపండి, ఆనందిస్తారు. ఎంతకాలం "హత్రస్"లో ఉంటారు? నా మీద దయాదృష్టి నిలపండి. మీ అందరి మీద నా ఆశలూ అభిలాషలూ కేంద్రీకరింపబడ్డాయి. నాకు శక్తి సామర్థ్యాలు లేవు. "రాధ' 'అటలు', మిగిలివారు నా ఆశలకీ ఆశయాలకీ కేంద్రాలు. వారి నుంచి మీరు చాలా తెలుసుకుంటారు. మీ ఆధ్యాత్మిక మార్గమేదైనా, భగవన్నామం చేయాలనిపిస్తే రాధాకృష్ణుల మధుర నామాన్ని ఎంచుకోండి. నిజానికి వారంతా ఒక్కటే. ఆకారంలోనే తేడా. ఏమాత్రం అనుమానం పెట్టుకోకండి. అతి నికృష్టమైన నన్ను చూడాలని అంత ఆతురత ఎందుకు? కృష్ణుడు అలా సంకల్పిస్తే మనం ఒక రోజు కలుస్తాము. నా నమస్కారాల్ని పూజనీయురాలైన మీ సతీమణికి తెలిపి, నా మీద దయతోను, వాత్సల్యంతోను ఉండమని చెప్పండి. ఆమె వాత్సల్యం నేను గర్వించదగింది కాగలదు. నాదని అనటానికి నాకేమీలేదు, అప్పుడప్పుడు బృందావనం దర్శించండి, మీకు ప్రశాంతి లభిస్తుంది. శ్రీకృష్ణుడి దయవల్ల మేము క్షేమంగా ఉన్నాము. మా గురించి ఏమాత్రం ఆతురతవద్దు. అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తుండండి.

మీ

హర

అటల్- అటల్‌బిహారీ నాంది.

నియోగి - నియోగిబాబు,

రాధ - రాధావల్లభ్‌శీల్

# 14వ పత్రము

నా రాధా!

నీ ఉత్తరం పండ్ల పార్శిలు అందినాయి. నాకోసం అంత ఆతురత ఎందుకు? మా రోజులు దాదాపు తీరినట్లే. మరి ఇంకెందుకు? ప్రతి పండూ ప్రేమతో ముంచినట్లుగా ఉంది, నిన్ను స్పష్టంగా చిత్రీకరిస్తోంది. ప్రేమతో ప్రతి వస్తువునీ తాకి నేను నీ గాఢ పరిష్వంగానందం పొందాను. ఆ మధుర ఫలాల్ని అత్యంత సంతోషంతో మేము తిన్నాము. ప్రియా! నాకోసం అంత ఆతురత ఎందుకు? ఆతురతకి కారణమేలేదు. మరీ మరీ చెప్తున్నాను కంగారు పడవద్దని, నేను కోరేదల్లా నన్ను పూర్తిగా మర్చిపోవద్దని, అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తుండమనీను. నా జీవిత సర్వస్వానివి నీవు. నా మతానికి నీవు పతాకానివి. నిన్ను గురించి ఆలోచించి నప్పుడు వైకుంఠాని కంటె ఈ దుఃఖమయ ప్రపంచమే ఆనందదాయకమని అనిపించి, దాన్ని విడిచి పోవాలనే కోరిక నశిస్తుంది. ఈ ప్రపంచం విడిచి పోవటమనే ఆలోచన కొంత బాధకలిగిస్తోంది. ఒకప్పుడు దానితో నా బంధాన్ని త్రెంచివేయమని గట్టిగా ప్రార్థించాను. ఈ రోజు నీకోసం ఈ లోకంలో లేదూ, ఇంతకంటే, నికృష్టమైన లోకంలో కొద్దిరోజుల పాటు ఉండాలనిపిస్తోంది. ఆశ్చర్యపోతున్నాను, నీ శక్తి అద్భుతం, జయదేవుడు వ్రాశాడు.

"మాయ లౌకిక మోహాలకి బద్ధుణ్ణి చేయటానికి ఎలా వల పన్నుతుందో అలాగే కంసారి శ్రీకృష్ణుడు తనపై రాధ ప్రేమ మిగిలిన గోపికల ప్రేమని అధిగమించి, తనని మోహబద్ధుణ్ణి చేయజాలిన దని తెలుసుకుని, మిగిలిన వారిని వదలి ఆమెకి అంకితమయ్యాడు".

ఇప్పుడు నేనర్థం చేసుకున్న దేమిటంటే ప్రేమ మాత్రమే శ్రీకృష్ణుణ్ణి గోలోకం నుంచి రప్పించ జాలినదని, ప్రేమ వశుడై హరి గోలోకం విడిచి బృందావనంలో అవతరించాడు. నారాయణుడు వైకుంఠాన్ని, అర్థాంగి లక్ష్మిని విడిచి భూమి మీద పుట్టాడు. శ్రీకృష్ణుడి విషయంలోనే ప్రేమ అలా శక్తివంతంగా పనిచేస్తే ఇక మానవ మాత్రులపట్ల దాని శక్తిని గురించి చెప్పవలసిన పనేలేదు. నీ ప్రేమకి వశుడినై ప్రియతమమైన శ్రీకృష్ణుణ్ణే దృష్టి పథం నుంచి పోగొట్టుకున్నాను. నా అహోరాత్రాలు నీ ఆలోచనలతోనే గడుస్తున్నాయి. అతడిని గురించి ఆలోచించటానికి నాకు

రాధా, నాప్రాణమా! అతని మాటలు విని ఆశ్చర్యపోలేదు. వ్యాకుల పడ్డాను. అతడు శివానందుడి కొడుకు ప్రేమదాసు వంటివాడు, బైటికి ఏమాత్రం అట్టహాసం లేకుండా ప్రతిదీ గుట్టుచప్పుడు కాకుండా చేద్దామనుకుంటాడు. రాధిక స్వభావాన్ని గురించి ఆశ్చర్యపోకు. కోడెత్రాచు విషం ముసలి త్రాచు విషం కన్నా చాలా ప్రమాదకరం. పిల్లవాడి ప్రయత్నాలు ముసలి వారి ప్రయత్నాలకంటె బలీయమైనవి. విద్యార్థి ఉత్సాహం ఉపాధ్యాయుడి ఉత్సాహం కన్నా ఎక్కువగా ఉంటుంది. ప్రతి తరగతిలోనూ ప్రథమఘట్టం ఒక మాదిరిగానే ఉంటుంది. శ్రీకృష్ణ సమాగమానికి పూర్వం రాధ చూపిన ఉత్సాహం, ఆతురత, ప్రభువిరహంలో కూడా మొత్తానికి ఉన్నాయి. రాధిక అతని ఆరాధనామయ జీవితంలో ప్రథమ దశలో ప్రవేశించింది. శ్రీకృష్ణ ప్రేమ బీజాలు పెరిగి క్రమంగా అనంతప్రేమగా వృద్ధి పొందుతాయి. అటువంటి రోజెప్పుడువస్తుంది? మనలో ఎవరైనా అటువంటి గాఢ భక్తి లక్షణాల్ని కనబరిస్తే మనమంతా సంతోషిస్తాం. ఒక వ్యక్తి కొంతఖర్చుతో ఒక దేవుడిదో దేవతదో విగ్రహాన్ని ప్రతిష్ఠిస్తాడు. వేలమంది చూచి ఆనందిస్తారు. శ్రీ శ్రీ అద్వైతుడు శ్రీగౌరాంగుడిని భూమిమీద అవతరింప జేశాడు. లక్షలమంది తమ పాపభారాల్ని అతణ్ణి చూడటంతోనే నశింపజేసుకున్నారు. ప్రతిదీ ప్రేమ ప్రవాహంలో కొట్టుకు పోయింది. అలాగే మనలో ఎవరైనా ఆ ప్రేమ వెల్లువలలో తేలియాడుతూ ఉంటే మనమంతా ప్రేమసాగరంలో ఉన్నట్లు తెలుసుకుంటాం. ఆ రోజు ఎంత దూరంలో ఉన్నదో చెప్పలేము. మనం చూస్తామా? ఈ శరీరం ఏక్షణంలోనైనా రాలిపోయేందుకు సిద్ధంగా ఉంది. ఇప్పుడుంది, మరుక్షణం ఉండకపోవచ్చు. అందుకని, ఆ రోజు త్వరగా రావాలని నా ప్రార్థన. ఆశ నన్ను ప్రాణంతో ఉంచింది. కృష్ణుడు ఉదారుడు. మనపై దయజూపుతాడు. 'అటలు' మొదలైన వారిలాగా నీవూ సమానంగా ఆనందిస్తున్నావు కదా? లేదా! బహుశా పిల్లలు అప్పుడప్పుడు ఇబ్బంది పెట్టుండవచ్చు. అదికూడా ఒక ఆనందమే. ఆనందించు. దోషమనే వృక్షానికి ఫలాలు వాళ్ళు. ఇది నిజమైన "ఢిల్లీ మిఠాయి" ఈ వినోదం కూడా ఆనందించవలసిందే అనటం సబబు. లేకపోతే ఆనందమో విచారమో పూర్తికాదు, భయపడకు. 'అటల్'లాగా నీవానందిస్తున్నావు, ఆనందిస్తావుకూడ.

నీ

హర

# 15వ పత్రము

నృసింహబాబుగారికి

అయ్యా, ఈ రోజు మీ 22వ తారీఖు లేఖ అందింది. లేఖలు వస్తాయని గాని, వ్రాస్తాననిగాని నా కాశ లేకపోయింది. ఇప్పటికీ అటువంటి ఆశ పెట్టుకొన గలనని చెప్పలేను. కృష్ణుడి సంకల్పం నెరవేరుతుంది. అయ్యా భయంకర కుంభవృష్టి గురించి అనుమానమేమైనా ఉన్నవాళ్ళు ఒకసారి కాశ్మీరు వచ్చి, వాళ్ళంతట వాళ్ళు ఊహాతీతమైన "వికృత నారాయణ" స్వరూపాలు చూడటం మంచిది. కాశ్మీరు యింకా 16 అడుగుల నీళ్ళలో ఉన్నది. శ్రావణ నవమి రోజున కాశ్మీరంతా 40 అడుగుల లోతు నీళ్ళలో ఉన్నది. కాశ్మీరులో ఇంకేమి మిగిలింది? లయకారకుడైన దేవుడు దానిని తన నిలయంగా చేసుకొన్నాడు. ఇప్పుడూ విస్తారమైన జలమయరూపంలో ఆనందంగా విలయతాండవం చేస్తున్నాడు. రెండువందల గ్రామాలు కొట్టుకు పోయాయి. ఒక్క ప్రాణి కూడా మిగల్లేదు. పట్టణంలో దాదాపు 4వేల భవనాలు నేలమట్టమయినాయి, గుర్తుగా ఒక్క అవశేషం మిగల్లేదు. ప్రజలు కొండశిఖరాల మీద, రోడ్ల ప్రక్కనున్న చెట్లమీద దీనంగా రోజులు గడుపుతున్నారు. అటువంటి భయంకర దృశ్యం ఎవ్వరూ చూచి ఎరగరు. పెద్ద భవనాలు వరసగా కూలుతున్నాయి. ఇంద్రుడు ప్రతి పిడుగుపాటుతోను ఒక రాక్షసుణ్ణి అంతం చేస్తున్నాడా అన్న ఆలోచనను ఈ భయంకర దృశ్యం స్ఫూర్తింపచేస్తున్నది. దీనిని మించి అందరి ముఖాలలోను పస్తులు గోచరిస్తున్నాయి. బియ్యం రూపాయికి మూడుశేర్లు అమ్ముతున్నారు. ఈ సరుకు కూడా కరువే అయింది. విశాలమై సుసంపన్నమైన లంకా రాజ్యం వానరుల చేత పూర్తిగా నాశనం చేయబడింది. కాశ్మీరు మాచేతుల్లో ఆ అదృష్టమే పంచుకుంది. ఇటువంటి హృదయ విదారక దృశ్యం చూడనివారు దాని ప్రబల స్వరూపాన్ని ఎప్పటికీ ఊహించుకోలేరు. చూచినవారు ఎప్పటికీ మర్చి పోలేరు. ఈ ఉపద్రవం గురించి విన్నమాత్రంతోనే మీరు భయగ్రస్తులవుతారు. మూడు నాలుగు అంతస్థుల మేడలపై నుండి మేమిప్పుడు పడవలు నడుపు తున్నాము. ఇటువంటి భయంకర పరిస్థితిని ఇంతకుముందు ఎవరూ చూచి ఉండరు. ఇక చూడబోరు. తంతి తపాలా సౌకర్యాలు పూర్తిగా ఆగిపోయాయి. నిన్నటి నుంచి పడవ మీద పని మొదలైంది. ఒక వెయ్యి చదరపు మైళ్ళు ఇంకా నీళ్ళలోనే ఉంది. ఈ దురదృష్ట ప్రాణిగురించి ఆందోళన పడకండి. అనివార్యమైన ఆ సంకల్పం నెరవేరు తుంది. కృష్ణుడు అవ్యాజ కరుణా పూర్ణుడు. అతని సంకల్పానుసారం అన్నీ జరుగు తాయి.నేను ఆయన వాణ్ణి. ఆయన దయవల్ల చావుకి భయపడటం నేర్చుకోలేదు.

అయ్యో, భర్త అనురాగం చూరగొన్న తర్వాత భార్య తన తల్లిదండ్రుల్ని మర్చిపోక తప్పదని ఎక్కడా చెప్పబడలేదు. అయితే తల్లిదండ్రుల సంరక్షణలో బ్రతుక నక్కర లేదని మాత్రం చెప్పబడింది. దీని అర్ధం గ్రహించలేని భార్య, భర్తకు ప్రాణప్రియ అవటంలో కూడా విఫలమవుతుంది. పెండ్లైన తర్వాత తల్లిదండ్రులపట్ల గాఢమైన మక్కువ చూపితే ఆ పిల్లని ప్రజలు తప్పుపడతారు. భర్తకి ఆగ్రహం వస్తుంది. ఆమె తన తల్లిదండ్రుల్ని తనవారిగానూ, తన భర్తని తన ప్రధానాశ్రయంగాను గౌరవించాలి. శాస్త్రాలు యిలా చెప్పాయి.

"సకల దేవతల్ని ఆరాధించు. కాని అంతకుమించి - సంబంధము పెంచకు కృష్ణునిపట్ల గాఢమగుభక్తి కలిగేటట్లు నిన్ను ఉత్తేజ పరచమని ప్రతిదేవతను ప్రార్ధించు. వ్రజకాంతలు కాత్యాయనిని భక్తితో ప్రార్ధించారు. ఆ జగన్మాత సంతృప్తురాలై, శ్రీకృష్ణుడు వారినాథుడుగా వారి ప్రార్ధనను మన్నించింది. పెండ్లైన పిల్ల తన తల్లిదండ్రుల్ని శత్రువులుగా భావించ నవసరమేమీ లేదు. అలా చేసిన వాళ్ళు పాషండులుగా పరిగణింపబడతారు. వారికి అన్యమార్గము లేదు. ఒకపిల్లకు పెండ్లైతే ఏమైనా మార్పు ఆమెలో వస్తుందా? ఆమెరంగు, అందము, తీరు తెన్నులు, పేరు ఏమీ మార్పు చెందవు. వచ్చే మార్పులు ప్రకటితమయ్యేవి కావు. అంటే - హృదయానికి, మనస్సుకీ, ప్రాణానికీ సంబంధించినవి. పెండ్లైన తర్వాత ఆ పిల్ల ఇంకో రెండు చేతులుగాని అదనంగా మరొక కన్నుగాని పొందదు. మతనమ్మకాల ప్రకారం కూడా ప్రతిదీ గతంలో లాగే ఉంటుంది, ప్రకటన వ్యక్తం కాని, వ్యక్తీకరించలేని " గోత్ర" మన బడేది మాత్రం మార్పు చెందుతుంది. నిజానికి మార్పు మనఃస్థితిలోను ఆత్మలోను ఉంటుంది. మీ ప్రస్తుత సాధన, పూజా విధానం అలాగే కొనసాగనివ్వండి, అయితే, మీ హృదయం దేవదేవుడికై తహతహలాడాలి. మీ మాతాపితల (కాళికా శివుల) ఆదరమేకాదు, ప్రభు కృపకీపాత్రులవుతారు. భక్తి ప్రపత్తులు గల భార్యలు మాత్రమే అటువంటి అనురాగాన్ని అర్ధం చేసుకోగలరు. వాళ్ళు మాత్రమే అనుభవించగలరు. ఇతరులకి అవి పూర్తిగా అగ్రాహ్యం. భర్త అనురాగాన్ని ఎప్పుడూ పొందని స్త్రీలు, పొందిన వారిని హేళన చేయటం అప్పుడప్పుడు చూస్తుంటాము. వారి ఎత్తిపొడుపుల్ని వీరు పెడచెవిని పెట్టారు. పతివ్రత మాత్రమే తన సుఖాన్ని తాను తెలుసుకుంటుంది. అందుకే దివాన్ రామకృష్ణ చెప్పారు. పరమ హంస అంటారు. "ఎవని కళ్ళు కాళీమాత నామామృతాస్వాదనాన్ని ప్రభావంతో మత్తెక్కి ఉంటాయో, అతడు హేళన మాటలు ఎందుకు పట్టించు కోవాలి?" ప్రేమికులు ఇతరులేమంటారో పట్టించుకోరు. వాళ్ళ ఆనందంలో వాళ్ళు మునిగి ఉంటారు. అలాగే మీరు మీ అంతరంగిక ప్రవృత్తి తప్ప ఏమీ మార్చుకోనవసరం లేదు.

మీరు మీ ఆత్మతో అనుసంధానము పొందగలగాలి గాని, ఇతరులతో కాదు. పనికిమాలిన దురుసు వారికి మీ సాధనమార్గాన్ని తెలియ చేయకండి. ఒక పాటలో యిలా విన్నాను. ''తన ప్రియురాల్ని తప్ప మరొకర్ని ప్రియుడు కన్నెత్తి చూడకూడదు. అలా కాకపోతే ఆ గాఢ ప్రేమ నిలవదు'' అంటే - ఇతర మార్గాలలో ఉన్నవారితో తన హృదయాన్ని విప్పకూడదు. అలా చేస్తే రెంటినీ పోగొట్టుకొనే ప్రమాదం ఉంది.

మీ

హర

## 16వ పత్రము

అయ్యా,

మీ అనారోగ్య విషయం తెలిసి నేనెంత బాధపడ్డానో హృదయాంతరాల్లో ఉండే ఆ పరాత్పరునికే ఎరుక. ఏమైనా సంకోచించ నవసరంలేదు. కృష్ణుణ్ణి తన జగన్నాటక మాడనీయండి. ఏమాత్రం కంగారుపడవద్దు. నిశ్చింతగా ఉండండి. భూమిలో నాటిన విత్తనాలు మొలకెత్తి ఎదిగి, ఫలపుష్పాల్తో వృక్షాలై తాము ఆనందంగా ఉండి ఎదుటి వాళ్ళని ఆనందింప జేస్తాయి. మరికొన్ని ఎదిగి ఎండిపోతాయి. అలాగే మన గత కర్మ బీజాల పర్యవసానం ఈ మన శరీరాలు, 'కష్టాలు' 'సుఖాలు' అనే ఫలాల్నిస్తాయి. కనుక తమవంటి వివేకులు ఇంతగా విచారించరు. అటువంటివి రానీయండి, పోనీయండి వాటిని పట్టించుకోకుండా కాలంగడపండి. ఆ యాటముగిసే వరకు ఎక్కడికి వెళ్ళటానికీ ఎవరూ స్వతంత్రులు కారు. ప్రయత్నించినా వెళ్ళలేరు. ఆకలి దప్పులు శరీరానికి సహజం. అలాగే వృద్ధాప్యం, వ్యాధులు తప్పవు. ఇవిలేకుండా శరీరం, మనజాలదు. మామూలుగా జీవిత గమనంలో తటస్థించే మార్పుల కనుగుణంగా శరీరంకూడా అనేక మార్పులకు లోనవుతూ ఉంటుంది. ఈ ధర్మం సహజమైంది మారనిదీనూ కనుక బాధనుగాని, దుఃఖాన్నిగాని వ్యక్తం చేయటం, ఈ విషయంలో తగదు. ఏరకంగానూ నిస్పృహ చెందవద్దు.

మీ

హర



# 17వ పత్రము

అయ్యా,

మీ ఉత్తరం అందగానే దుర్యోధనుడి స్థితిలో పడ్డాను. సంతోషమూ, దుఃఖమూ ఒక్కసారే వస్తాయి. ఉత్తరం చివరికి వచ్చేసరికి, ఎందుకో తెలియదు, కళ్ళనీళ్ళు వస్తాయి. నేను కఠోర హృదయుణ్ణి. పచ్చి దుర్మార్గుణ్ణి అని ప్రతివాడికీ తెలుసు. కాని నిస్సందేహంగా మీ శక్తి చాలగొప్పది. దూరం వర్గం పెరుగుతున్న కొద్దీ గురుత్వాకర్షణ కేంద్రం మరింత శక్తితో ఆకర్షించేవిధంగా ఎంతో దూరం నుంచి నన్నాకర్షిస్తున్నారు. మీ శక్తి, సామర్థ్యాలు అద్భుతం. సుడిగాలిలో ఎండు టాకులా కొట్టుకుపోతున్నాను. నన్ను నేను అదుపులో పెట్టుకోలేను. ఇదంతా ఎప్పుడంత మౌతుందో తెలియదు. మీ ఆటలోని కిటుకులు మీకే ఎఱుక. నిజం! పాము బుస నన్ను భయపెట్తోంది. కానీ, దురదృష్టం కొద్దీ ఇప్పుడు సమయం మించి పోయింది. అయినా అదృష్టమేమిటంటే కృష్ణునికి ఇంకా నా మీద దయ ఉంది. పాము విషం మనుషుల్ని చంపుతుంది, ప్రాణం పోస్తుందికూడా. పాముకి ఈ విరుద్ధ లక్షణాలున్నాయి. నన్ను చుట్టి బంధించిన సర్పం ఇప్పుడు ఉదాత్తంగా నా మార్గం సుగమం చేయటానికి ప్రక్కకి పోయింది. జాగ్రదావస్థకి వచ్చాను. దానికి స్వయంగా సర్వసమర్పణ మయ్యాను. అందుకే స్త్రీ రూపములోనున్న, ఆడ పిల్లులూ కుక్కలూ కూడా నాకు ప్రీతికరమైనవే. స్త్రీలు ఏ రూపంలో ఉన్నా నాకు అంత ఆకర్షణీయంగా కనిపిస్తారు. చెట్లలోనూ, ఆకుల్లోనూ వారిని చూస్తూ సంతోషంతో ఉప్పొంగి పోతాను. అసంగత ప్రేలాపనకి మన్నించండి. వీడు పూర్తిగా పిచ్చివాడు. దూరంగా పోకుండా బురదలో కూరుకుపోకుండా అమృత మనుకుని కాలకూట విషాన్ని దోసెళ్ళతో త్రాగకుండా చూడండి. మ్రింగిందింకా హరించుకోలేదు. ఇంకే కొద్దిమాత్రం త్రాగినా నా ప్రాణం తీస్తుంది. మీకు నా హృదయాన్ని బహిర్గతం చేశాను. నన్ను క్షమించమని అర్థిస్తున్నాను. విషం ప్రాణం తీస్తుంది. ప్రాణం పోస్తుంది కూడా. శక్తి కూడా అలాగే నశింపజేస్తుంది, పోషిస్తుంది. జగద్వ్యాప్తమైన ఆ మహాశక్తిని అనేకులు అనేక దృక్కోణాల్లో దర్శించి గౌరవిస్తారు. ఈ సర్వవ్యాప్తమైన శక్తికి ప్రతినిధులైనవారిని మాయారూపాల్లో నాకు దర్శనం యివ్వవద్దని హృదయ పూర్వకంగా ప్రార్థిస్తున్నాను. ఎందుకంటే భావాతీతమైన మనోహర రాధారూపంలో వారిని దర్శించాలని నా కోరిక. తీవ్రమైన కోరిక పాతుకుపోయి, పరిపక్వమైతే గాఢ ప్రేమగా మారుతుంది. అటువంటి ప్రేమ రూపమే రాధ. ఇక్కడ కామ వాసనేలేదు. ఇందుకే శ్రీకృష్ణుడు రాధతో కూడి ఉన్నప్పుడు మదనమోహనుడనిపించు కొన్నాడు. రాధ లేకపోతే మదనుడయ్యేవాడు. రాధకి సంకేతంగా పురాణాల్లోని రామచిలుక జంటతో అంటోంది.

"రాధ సమక్షంలో అతడు మదనమోహనుడు. లేకపోతే అతడు భువనమోహనుడై కూడా మదన మోహితుడు". ప్రేమమూర్తి అయిన ఆమెను శరణుజొచ్చాను. ఆమె నాపై దయజూపితే అదృష్టవంతుడిని. ఆమె కృపా పాత్రుడి నయ్యేటట్లు దీవించు. అగ్నిలాగే దూరంగా ఉంటే ఉపకారేగాని, దగ్గరయితే మాత్రం కాల్చక మానదు. తపస్సులూ సాధనలూ లెక్కకిరావు. అల్లంత దూరాన్నుంచి స్త్రీల చలాకీతనం చూడటంలో ఆనందం ఉంది. ఎవడైనా దగ్గరికి వెళ్తే దగ్ధమై స్థాణువులా నిర్జీవుడై పోతాడు. అక్కడ అభేద్యమైన, నిగూఢమైన రహస్యమున్నది. పేరు పొందిన వీరులే ఈ అభేద్యమైన వ్యూహాన్ని ఛేదించలేక వారి ఓటమి నంగీకరించారు. ఈ జగద్వ్యాప్తమైన శక్తి భార్యలో ఉన్నా బిడ్డలో ఉన్నా లక్ష్యం లేకుండా అగౌరవ పరచకూడదు. అయ్యా, పాముతో గాని, పులితోగాని చెలగాటం ఆడేటప్పుడు, దాని కళ్ళ కదలికని జాగ్రత్తగా కనిపెట్టొండాలి. ఏమాత్రం అశ్రద్ధైనా వినాశనానికి దారితీయక తప్పదు. ఎంతో జాగ్రత్త అవసరం. దీన్నే "కత్తిమీదసాము" అంటారు. ఆ శక్తి ప్రతినిధులు ఎప్పటికైనా నా మీద దయచూపిస్తారేమో తెలియదు. ఈ ప్రపంచాన్ని సృష్టించి పోషించి లయింపజేస్తారు. ఈ గుణాలన్నీ వారిలో మిళితమై ఉన్నాయి. మీరు సమర్థులని తెలిసి మిమ్మల్ని ఆశ్రయించాను. దూరం చేయకండి దయజూపండి. ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకోలేక పొరబాటున విషయాలని కలిపే స్తున్నాను. "నాకు రెండు కార్యాలున్నాయి" ఈవ్‌ని తప్పుమార్గం పట్టించటానికి ఆమె కేశాలంకరణకి అందమైన పొడుగాటి పాముగా మారిన శాటన్ లాగా నేను కూడా ఈ ప్రస్తుత కలియుగానికి నమ్మినబంటుని గనుక ప్రస్తుత వేషంలో మానవరూపంలో మానవుల్ని మోసగిస్తూ తప్పుదోవపట్టిస్తున్నాను. నా అంతర్బహిర్తత్త్వాలు వేరు కనుక నన్ను కనుక్కోవటానికి కొంత యిబ్బంది పడ్డారు. మీరు ఆనందంగా ఉన్నారని విని చాలా ఆనందించాను. అలా ఎప్పుడూ వినాలని ఆశిస్తాను.

మీ
హర

## 18వ పత్రము

ప్రియమైన క్షీరోధ్,

నన్ను గురించి అనవసరంగా ఆలోచించేబదులు ఏమి కోరితే దానిని ప్రసాదించగల అమూల్యరత్నాల వంటి వారి ధ్యానంలో రాత్రింబవళ్లు నిమగ్నుడ వయితే మంచిది. ఆనందం పొందుతావు. బైటికి కనిపించే ప్రేమ నీచకామాన్ని

సూచిస్తుంది. ఆంతర్యంలోని అనురాగంనిజమైన ప్రేమగా పక్వమౌతుంది. అనురాగ తరంగాన్ని అంతర్ముఖం చేయటానికి ప్రయత్నించు. విలాసాలు విలువలేనివి. నీ ప్రేమ లక్ష్యం కూడా నిన్నర్థం చేసుకోకూడదు. నీ హృదయంలోని అనురాగాలు పెల్లుబికి బైటికి రాకూడదు. నీయిష్టం వచ్చినట్లు కనబడు. అంతరంగంలో ఉవ్వెత్తుగా పొంగే ఆలోచనలు పైకి చెబితే పిచ్చివాడి ప్రేలాపనలుగా భావించబడతాయి. ఒట్టి మాటలు మనిషిని కదలించి ఆర్ద్రుణ్ని చేయలేవు. హృదయంలో నుంచి వెలువబడిన మాటలు హృదయాన్ని స్పర్శిస్తాయి. పిచ్చివాడిలా ఏదో అర్థం లేకుండా వాగాను. కొంచెం ఆలోచించు. నీ ప్రేమ నిధిని హృదయ పెన్నిధానంగా గౌరవించు. ఎవ్వరినీ తెలుసుకోనీకు. కాళ్ళదగ్గర అధముడివలె పడటం, లేకపోతే ఎదురుగా ఏడుస్తూండటం ప్రేమలక్షణం కాదు. ప్రేమని మనస్సులోనూ, హృదయంలోనూ పోషించాలి. చూపుల్లో కాదు. ప్రేమించు, తిరిగి ప్రేమించటం నేర్చు. సన్నిహితంగా ఉంటే అటువంటి ప్రేమ అసాధ్యం. అందుకే ప్రేమించేదాన్ని అల్లంతదూరంలో ఉంచాలి. అవిరళమైన తహతహతో కూడిన చింతన, ఉత్కంఠ తుచ్ఛకామాన్ని భస్మం చేసినప్పుడు - మిగిలేది నిర్మలమైన అనురాగం. అది భావాతీతమైన ప్రేమగా మారుతుంది. మనస్సులో పెట్టుకొని నీ భార్యకి చెప్పు. నేను బాగానే ఉన్నాను. నా గురించి ఆందోళన పడవద్దని ప్రార్థన.

మీ

హర

## 18ఎ. వ పత్రము

నృసింహబాబుకి -

అయ్యా,

ఒక చిన్న ప్రార్థన, మీరు దయచేసి ఉపనయన మహోత్సవానికి వచ్చి అనుగ్రహించండి. నా మిత్రులు శుక, శారీలు (ఇద్దరు మిత్రులు) బృందావనం నుంచి అమ్మా వస్తారు. మహోత్కృష్ట మైన కోమలహృదయ అయిన ఆమె ముఖంపై చిరునవ్వులు మీకు కనిపించకపోతే, ఒకటి రెండు చిరునవ్వులు ఎరువు తీసుకుని ఆమె ముఖంపై అతికించండి. అయ్యా ఇతరుల హృదయాలను ఆనందింప జేయాలని నా జీవితమంతా ప్రయత్నిస్తున్నాను. ప్రతిసారీ ఏదోఒక రూపంలో, నా యజమానుల కనుగుణంగా నాస్వభావాన్ని మారుస్తాను, వారి వశుణ్ణి కావటంతో

అనేకరూపాల్లో నేను కనిపించేటట్లు చేశారు. ప్రతి వస్తువు అనుగ్రహించగలిగే వారి శక్తి అనంతం. ఏదీ వారికసాధ్యం కాదు. తరచు మనల్ని సమ్మోహితుల్ని చేసి, మన ముఖాలకి సిరాను పూసి కోతుల్లాకనిపించేటట్లు చేసి ఆట పట్టించి నవ్వుతారు. దానికి తల ఒగ్గని వారిని తిరస్కరిస్తారు. అలా ఆ రెండుమార్గాలూ ప్రమాదకరమైనవే, తప్పించుకోవటానికి మిగిలిన ఏకైక మార్గమేమిటంటే, జగత్కిలాడియైన జగ్గు లాగా నటించటమే. వాళ్ళశక్తి అనంతం. ఎదురు తిరిగి ఒక్క మాట అనటానికీ వాళ్ళయిష్టానికి వ్యతిరేకంగా ఒక్క అడుగు వేయటానికీ నేను పూర్తిగా అశక్తుణ్ణి. వాళ్ళు ఎలాపలికిస్తే అలా అంటాను, ఎలా చేయిస్తే అలా చేస్తాను, ఎక్కడికి తీసుకువెళ్తే అక్కడికివెళ్తాను. ప్రతి కదలికకీ కీలకం వాళ్ళ చేతుల్లో ఉన్నది. వాళ్ళ గర్వానికీ, మొండితనానికీ ఇదే కారణం. అయ్యా అశక్తుణ్ణి కనుక కిమ్ అనకుండా తల ఒగ్గాను. నా ఈ చేతకానితనం వంటిస్థితిని చాలామంది అనుభవిస్తున్నారు. ఒకళ్ళు చెప్పుకుంటారు, మరొకళ్ళు మౌనంగా కుమిలిపోతారు. ఇద్దరి పద్ధతీ ఒకటే. వాళ్ళు చాలా గొప్పవాళ్ళు, చాలు ఇంకేమీ సంగతులు లేవు.

మీ
హర

# 19వ పత్రము

అయ్యా!

మీరు జంటగా నిల్చి విజయదశమీ శుభాకాంక్షల్ని నన్ను చెప్పనీయండి. అటువంటి రికార్డ్ కీపర్ మీకు ఉండగా ఉత్తరాలు వ్రాయటంలో ఇబ్బంది ఏమిటి? నాలాగా గుడ్డి గుఱ్ఱాన్నెక్కి హిమాలయాలు మీరు దాట నక్కర్లేదు. కనుక ఇబ్బంది ఎక్కడిది ? నాకూ మీలాగే ప్లీడరు సహాయం ఉంటే ఒక బారిస్టర్ పనిచేసి ఉండేవాడిని. అవునండీ ఈ సిద్ధ ఔషధాల్ని స్వీకరించండి. కాని, వీటివల్ల ఏదోలాభం సమకూరు తుందని భావించకండి. రోగాలన్నింటికీ తారకం శ్రీకృష్ణనామం. అది ఈ లోకంలో జీవుల భయంకర బాధల్ని కూడా నివారిస్తుంది. అది సర్వానికీ మూలం. కృష్ణుడు ప్రధాన కారణకారణుడు. ఏదైనా భూమి మీద అద్భుతం కనబడితే అక్కడ కృష్ణుడు నటిస్తున్నాడని తెలుసుకోండి. మానవశక్తి ప్రమేయం ఉన్నదని అపోహ పడకండి. మానవుడు శక్తిహీనుడు. కేవలం కీలుబొమ్మ. చేతితో సూత్రం పట్టుకొని కృష్ణుడు ఇష్టం వచ్చినట్టు ఆడిస్తాడు. మనసా వాచా కర్మణా అతని సేవకి కాలం వినియోగించండి. మీరు శాశ్వతంగా ఆనందంగాను హాయిగాను ఉంటారు.

మానవుణ్ణి మానవుడిగా చూడండి. కృష్ణుణ్ణి కృష్ణుడిగా దర్శించండి. ఎప్పుడూ మానవుణ్ణి కృష్ణుడిగా భావించకండి. శ్రీమతి రాధిక కృష్ణుణ్ణి వీక్షిస్తూ :

"ఎట్టి దివ్యసౌందర్యము నేను కంటి,
ఏమి భువనమోహన రూపమియ్యది, సఖి !
ప్రేమమూర్తుల నుత్తమ ప్రేమమూర్తి,
సృష్టి తత్తుల్యమనగ కించిత్తులేదు,
దాని మనసార వాంఛించు దాన నేను" అన్నది

అతణ్ణి అతనే పోలి ఉంటాడు. అలాగే కృష్ణుడికి సామ్యం కృష్ణుడే. సృష్టింపబడిన ఒక ప్రాణిని కృష్ణుడికి మారుగా పోల్చవద్దని ప్రార్థన. మీ మనశ్శరీరాలను శ్రీకృష్ణ చరణాల కర్పించి, ప్రేమతో తన్మయులై ఉండండి. ఎంత పరమసుఖ శాంతుల్ని పొందుతారో చూడండి. కృష్ణునికోసం మీరు ఉన్మత్తులై పరుగులెత్తితే అతడుకూడా మీకోసం ఉన్మత్తుడై పరుగులెత్తి వస్తాడు. రాధ కృష్ణుని కోసం, ప్రేమోద్విగ్నత విచక్షణల్ని అధిగమించి, దుఃఖోద్విగ్న అయినప్పుడు కృష్ణుని పరిస్థితిని చండీదాసకవి ఇలా వర్ణించాడు :

"నిల్చియున్నను, కూర్చున్న; నిద్రనైన,
స్వప్నమందైన బ్రతుకు సర్వమ్మురాధే;
ఆ కిశోరి దయాసార మతని 'ప్రేణ'
మాగళమ్మున రాధయే మాలయయ్యె."

ఇలా సాగుతుంది. కృష్ణుణ్ణి ఆర్ద్రుణ్ణి చేయాలంటే -మొదట ప్రేమాశ్రువుల్ని చిందించండి. మీయెడ ఉన్మత్తుణ్ణి చేయాలంటే అతనిపేరు చెప్పటంతోనే మీరు ప్రేమోన్మత్తులు కండి. అతని ప్రేమతో అమరులు కాదలుచుకుంటే ప్రియాతి ప్రియంగా ప్రేమించండి. పిచ్చికుక్కగాని, గుంటనక్కగాని కరచిన మనుషులు భూమిమీద, నీటిలోనూ ఆ జంతువునే చూచినట్లు ప్రతివస్తువులోనూ కృష్ణభక్తులు కృష్ణుణ్ణేచూస్తారు. అందుకే చైతన్య చరితామృతంలో ఇలా వ్రాయబడింది:

"ఏ చరాచరాల నీక్షించుచున్నను.
రూప మేమియన్న చూపులేదు.
ఎచట నెచట వారి యాక్షణవరలిన
యెడదనున్న సామియే యెసంగు.

యంతో అతణ్ణి నిరంతరం పిలుస్తుంటే మీ పట్ల కూడా అట్టి సమయం హంగా ఆసన్నమవుతుంది. నమస్కారం. ఇప్పుడు నన్ను మహిళల ువైపు పోనివ్వండి. ముష్టివాళ్ళు ఒకచోట బద్ధకంతో కాలం వృధా చేయలేరు. ్క ఆకలి ఒక్క మనిషి గడపదగ్గర తీరదు. నాతొందరపాట్లని క్షమించ ప్రార్ధన. ా ఉన్నాయి.

మీ

హర

## 20వ పత్రము

నా,

ా గోవిందుడి మధుర నామాన్ని మీపిల్లలు జపించటం ఆశ్చర్యంకాదు. ఒక లేక చెడ్డబిడ్డ - ఒక మంచి లేక చెడ్డ గర్భానికి ఫలితం. మా అమ్మ శ్రీకృష్ణ ి అంత ఘటికురాలు. కనుక ఆమె బిడ్డలు అట్లాఉంటారు. అందుకేమాత్రం ంలేదు. చైతన్య చరితామృతం చివరిఖండం, మూడవ అధ్యాయం తప్పక ి. నాన్నా, రాధా, ఆ ప్రేమ తరంగంలో మీరిద్దరూ ఓలలాడటం నన్ను వ్వండి. కామము, ప్రేమ ఒకే కోవకి చెందినవే. ఉన్నతేడా మొదటిది ము, రెండవది అప్రాకృతము. తుచ్ఛప్రవృత్తి గల కోరికలు 'కామము' ము కొంటాయి. శ్రీకృష్ణుణ్ణి జేర్చే కోరికలు ప్రేమ అనిపించుకొంటాయి. ు ఇనుము, ప్రేమ బంగారము. ఇనుము పరుసవేది సన్నికర్షతో బంగారంలా ంది. చైతన్య చరితామృతాన్ని శ్రద్ధగా రెండు మూడుసార్లు చదవండి. లౌకిక ు అన్నీ ఒకే కోవకి చెందినవి. ఆ కోరికలు శ్రీ కృష్ణునిపై లగ్నం అయితే, బంగారంలా ప్రేమగా మారుతాయి. మీయిద్దరూ కృష్ణ నామంలో తన్మయులై ని ఇతరులనుకూడా అట్లా చేయగలగాలనీ ప్రార్థిస్తాను. ఐహికమైన క్షణిక లు మిమ్మల్ని ఆకర్షించ నీయకండి. మీకు అవి బాధను కలిగిస్తాయి. ఇక్కడి స్తువులూ గారడీవాడి ఇంద్రజాలంలాగా ఎప్పుడూ మారుతుంటాయి. ఇప్పుడు పంలో ఉంటూ మరుక్షణంలో ఇంకొక రూపంలో ఉంటాయి. కనుక కృత్రిమ ు చూసి మోసపోకుండా జాగ్రత్త పడండి, కృష్ణుడొక్కడే నిత్యుడూ ుడూ, అందుకని అతన్ని ప్రేమించటం నేర్చుకోండి. అప్పుడు నష్టపోయామని చే అవకాశం ఉండదు. ఎందుకంటే అది ఎప్పుడూ పోయేదికాదు, ఒకలాగానే ంది. తింటున్నప్పుడు, తీరిగ్గా ఉన్నప్పుడూ కూడా అతణ్ణి గురించి

ఆలోచించండి. తీరిగ్గా ఉన్నప్పుడు అతని నామాన్ని జపించండి. ప్రేమలో ఓలలాడతారు. కృష్ణుడు అపార కరుణామయుడు, తప్పక మీమీద జాలి పడతాడు. ఆందోళన పడకండి.

నాన్నా రాధా, నిన్ను పొందటంలో నేను అదృష్టవంతుణ్ణని భావిస్తాను. మహాపాపాత్ముణ్ణి కనుక మీ పాప భారాన్ని నాతలపై మోయటానికి భయపడను, సందేహించను. నీకు తారసపడ్డ ప్రతివారికీ, వాళ్ళ పాపభారాల్ని నాతలపై వేసి, పాపాలనుంచి విముక్తులై, పరిశుద్ధులై, హృదయ పూర్వకంగా ప్రభునామాన్ని కీర్తించండని చెప్పు. నరకమంటే నాకు భయంలేదు. మిమ్మల్ని సుఖంగాను, ప్రేమతోనూ ఉండటం చూస్తే నరకంలోకూడా నేను సంతోషంగా కాలం గడపగలను. మనస్సు తేలిక చేసుకుని హరిప్రేమలో జీవించు. ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధి భౌతికమైన బాధల ఛాయలుగూడా మిమ్మల్ని అంటవు. పూర్తి వినయంతో నితాయిని ఆశ్రయించు. అతడు ఆప్యాయతతో నిన్ను చేతులలో తీసుకుని, అక్కున జేర్చుకుని, కృష్ణ ప్రేమ నీ హృదయంలో నాటుతాడు. అతడు అపూర్వ కరుణామూర్తి, కాని, నమ్రులు కాకపోతే - వజ్రం కన్న కఠినుడు. అందుకని, అహంకారాన్ని త్యజించి నిర్మలుడివికా. అహంకారం ప్రేమ పుష్పంలో సర్వాన్ని పాడుచేసే చీడ పురుగు. ప్రేమ కావాలంటే అహాన్ని త్యజించు. ఎవరిని కలుసుకోవటం తటస్థించినా ఇది చెప్పు.

మీ
హర

## 21వ పత్రము

రాధా, నాజీవమా !

నిజం, బృందావనంలోని గోపికలకంటె శ్రీకృష్ణుడికి ప్రియతములు ఎవరూలేరు. కనుక వారికంటె ఎవరూ గొప్ప వాళ్ళులేరు. బృందావనంలో వాళ్ళు నివసించే ప్రదేశంకంటె మహత్తర ప్రదేశము వేరేలేదు. కనుక ప్రశాంతమూ, ప్రమోదకరమూ అయిన స్థలం దానికంటె మరేదీలేదు. ఆ గోపికల కున్నంత ప్రేమ పొందితేగాని ఎవరూ ప్రేమ సామ్రాజ్యమైన ఆ బృందావనంలో ప్రవేశించలేరు. అక్కడ బండ, ఎండ మ్రోడులకు (జీవులకు) తావులేదు. ఈ ప్రేమ సామ్రాజ్యంలోని క్రీడ - ప్రేమ క్రీడ; సమావేశాలు - ప్రేమ సమావేశాలు; ప్రేమతప్ప మరేమీలేదు. ఈ దివ్య ప్రేమోపదేశం పొందాలంటే బృందావనంలోని గోపికలను అనుసరించాలి. నమ్రతతో

వాళ్ళని అనుసరించి, వాళ్ళ సేవచేస్తుంటే అతిదయాళువులైన వాళ్ళు మనల్ని ఆ దివ్యప్రేమ నిలయంలోకి పిలుస్తారు, అప్పుడు అహంకరిగిపోతుంది, ప్రేమనిల్చిపోతుంది. జ్ఞానానికీ వివేకానికీ అక్కడతావులేదు. అక్కడ అవి తెలియవు, పైగా వాటికక్కడ విలువలేదు. ఒక అందమైన పసికందుని చేతుల్లోకి తీసుకుని లాలిస్తే అది సంతోషిస్తుంది. కాని, బాగా చదువుకున్న ఒక వేదాంతి అలా వ్యావహారిక జ్ఞానం ఏమిటో బాగా అర్థంచేసుకున్నా, ప్రేమ, అనుభవం లేకుండా ఆ బిడ్డను లాలించటానికి ప్రయత్నిస్తే అంత సంతోషంగా వారి అక్కునవుండదు. పాండిత్యమూ, జ్ఞానమూ సుందర బృందావనంలో చోటుచేసుకోలేవు. ఆనందం వాంఛిస్తున్న ప్రియసతితో చక్కగా మనోహరంగా సంభాషణ సాగించక, క్లిష్టమైన అర్థంకాని విషయాలమీద ఉపన్యాసాలు ఆవిడముందు చదివితే తనని తనుహాస్యాస్పదం చేసుకుంటాడు. అలాగే బృందావనంలో జ్ఞానం గురించిన సంభాషణ హాస్యాస్పదం. ప్రేమ మినహా దేనికీ అక్కడ స్థానం లేదు. అందుకని, ప్రేమమయుడైన ఆ ప్రభునామం శాయశక్తులా ప్రేమతో చెయ్యమంటున్నాను. నీ కోరికలు ఈడేరతాయికూడాను.

మీ

హర

# 22వ పత్రము

నాన్నా అనుకూల్,

నిన్ను నాన్నా అని సంబోధిస్తున్నాను కనుక నీవు బాధపడుతున్నావు, నన్ను మర్చిపో, సుఖపడతావు. నేను నిస్సహాయుణ్ణి కనుక నీవంత కష్టపడుతున్నావు. నా పాపాలకి ప్రాయశ్చిత్తం మాత్రం చేసికోగలను. ఈ జగత్తులో శాశ్వతమైంది ఏమీలేదు. సుఖమూ దుఃఖమూ వస్తాయి, పోతాయి. కనుక ఇవి నిన్ను మోహింప జేయగూడదు. మోహింపబడ్డావా ఇంకా విచారపడతావు. ఈ అశాశ్వత ప్రలోభాలకి అలవాటు పడ్డవాళ్ళు వాటిని విడువవలసి వచ్చినప్పుడు తీవ్రంగా బాధపడతారు. కనుక దేనికోసమూ ఎక్కువ విచారించకు. అన్నీ ఒక నియమానుసారం వస్తాయి, పోతాయి. ఏదీ ఆన్యాయాన్ని అధిగమించలేదు. అవన్నీ దయామయుడైన శ్రీ కృష్ణుని ఇచ్ఛ ప్రకారం జరుగుతాయి. కనుక భయానికి కారణం ఎక్కడుంది? ఎవరిగురించీ దీర్ఘంగా యోచించకు, ఏ వస్తువుపైన వ్యామోహపడకు. ఎవరినైనా గాఢంగా ప్రేమించ దలచినా, ఘనంగా గౌరవించదలచినా ఆ ప్రేమాదరాల్ని శ్రీకృష్ణుడిపైనా, అతని

నామంపైనా ఉంచు, ఎప్పటికీ ఆనందంగా ఉంటావు. మానవుణ్ణి మానవుడిగా ప్రేమించటం నేర్చుకో. అతిగా ప్రేమించి మోసపోకు. ప్రస్తుతం ఉన్న దానితో తృప్తిగావుండు. భవిష్యత్తును గురించి యోచిస్తూ బాధపడకు.

మీ

హర

# 23వ పత్రము

అయ్యా !

ఈరోజు మీరు నన్ను పట్టుకున్నారు. తేలికపడ్డాను. ఇంతకు మునుపు పట్టుబడి పోతానేమోననే భయంతో అశాంతిగా ఉండేవాణ్ణి. దాగుడు మూతలాట ఆడవలసివచ్చింది. ఇప్పుడు హాయిగా ఊపిరి పీల్చుకోవచ్చు; ధైర్యంగా తిరగవచ్చు. మీ ఉత్తరం చదవగానే ఈ రోజు, ఒక పాతపాట జ్ఞాపకం వచ్చింది.

"గురూ ! చీకటిగా ఉండటంతో మిమ్మల్ని గుర్తించ లేదు, మీరు ఆ చేత్తో ఈ చేత్తో చెరొక వంకాయ పట్టుకుని ఎగుర్తున్నారు. వాలం ఎత్తుకుని ప్రతిగుంటలోనూ నీళ్ళు త్రాగుతున్నారు."

ఏమైనా ఈరోజు నన్ను పట్టేశారు. ఇంకేమాత్రం నన్ను స్వార్థానికి ఎత్తి వేయకండి. ఉచిత స్థానంలో నన్ను ఉంచండి. అయ్యా సేవకుణ్ణి గనుక అలాగేచూడండి. ఆదరించండి. ఇదే నేకోరేది. అర్థించేది. బృందావనం నుంచి తిరిగిరాగానే మీ విషయం మాత్రమే ఉన్న లేఖను చదివి ఎక్కువ ఆనందించ లేక పోయాను. కనుక మీ దగ్గరికి రాలేదు. తప్పుచేశాను, క్షమించి నన్నానందింప జేయండి. "మహాత్ములు క్షమా మూర్తులు" కనుక అందుకు ప్రార్థిస్తాను. మీయిష్టంవచ్చినట్లు చేయండి. మా ప్రియమైన శ్యామతల్లిని చూసి ఎంతో సంతోషించారని విని చాలా ఆనందించాను కాని, నా విషయం తెలియగానే ఆమెమీద ఉన్న గౌరవాదరాలు మాయమవు తాయేమోనని కూడా భయపడుతున్నాను. మా అమ్మ పరువుతీయటానికి పుట్టాను. నాకేం జరుగుతుందో తెలియదు. ఎలా ఎన్నుకున్నారో పిలవటాకి (అమ్మా అని) మా అమ్మ నిజంగా అటువంటిదే. ఆమె ప్రేమమయి, దయామయి, అనురాగమయి. ఆమె పూర్తిగా మూర్తీభవించిన మంచిదనం. ఆమెను 'అమ్మా' అని పిలవగలిగి నందుకు నేను అదృష్టవంతుణ్ణిగా భావిస్తున్నాను. నా అదృష్టానికి గర్విస్తున్నాను. అంత ప్రగాఢ బంధం లేకపోతే కృష్ణుడు ప్రసన్నుడవుతాడా? కృష్ణుడు అంత గాఢానురాగం ఉన్న వాళ్ళకే వశమౌతాడు. కృష్ణుడే తన్నెలా ప్రేమించాలో నేర్పుతాడు. లేకపోతే అతణ్ణి ప్రేమించేవాళ్ళు సామాన్యులు కారు. వాళ్ళు ఎక్కడ మహదానందం

శాశ్వతంగా ఉంటుందో ఆ గోలోకానికి చెందిన వాళ్ళు, మధుర మనోహరమూర్తి అయిన శ్రీకృష్ణుని నిరంతర సహచరులు. శ్రీకృష్ణుని నాటక రంగంలో ముఖ్యపాత్రలు స్త్రీలు, వాళ్ళతో ఎక్కువగా, మనోనుగుణంగానూ ఉల్లాసంగానూ ఉంటాడు. వాళ్ళనుంచి వేరయ్యాడా, అతడు స్థాణుడు, మందగోడు, రూపరహితుడైన పరబ్రహ్మ. అటువంటి వస్తువుయొక్క అస్తి-నాస్తులు సమానమే. అందుకని స్త్రీ జగత్తుకి యదార్థమైన గౌరవాన్నిస్తే ఒకరోజు కాకపోతే మరొకరోజు కృష్ణునిదయ తప్పక ప్రాప్తిస్తుంది. స్త్రీల పట్ల విరుద్ధ భావాన్ని ఊహించిన వాడెవ్వడూ విజయసాధనలో సఫలీకృతుడుకాలేదు. అయ్యా, రామచంద్రుడి వానరసైన్యం లంకాద్వారాన్ని ఆక్రమించుకున్న రోజున, ఇంద్రజిత్తు భార్య ప్రమీల లంకలోనికి ప్రవేశించలేక, నాథుని జేర లేక, సరాసరి రామచంద్రుడి దగ్గరికివచ్చి, ఆయన్ని నిగ్గదీసింది. రామచంద్రుడు పూర్తిగా నిరుత్తరుడై, మృదువచనాలతో శాంతింపజేసి, తనసైన్యాన్ని ఈ మోహశక్తి త్రోవకి అడ్డంగా నిల్వవద్దని శాసించాడు. ఇది ఇలావుంటే మానవుల గురించి మాట్లాడ నవసరమేలేదు. ఇది స్థూలమైన భౌతికశక్తికి సంబంధించినది. గోలోకాన్ని బృందావనాన్ని పాలించే ఉత్తమ ప్రకృతుల గురించి ఎవరేంచెప్పగలరు? వారిచే ఆదరింపబడ్డ వారికి కొంత తెలిసి ఉండవచ్చు. శ్రీకృష్ణుని సమస్త కార్యాల్లోనూ నిరంతరం అతణ్ణి నడిపిస్తున్న మూర్తీభవించిన అతని ఇచ్ఛాశక్తి అయిన ఆశక్తి స్వభావాన్ని ఎవరు పూర్తిగా అర్థం చేసుకోగలరు? అన్ని రూపాలలోను ఉన్న స్త్రీమూర్తుల్ని నిత్యమూ గౌరవించటం క్షేమం. ఎందుకంటే ఏరూపం ఏ కఠోర కసాయిని, ఏ పొంచియున్న పెద్దపులిని బైట పెట్టుందో! ఒక పాత సామెతవుంది. "ఎరగని నదిలో ఈదితే ఏ మొసలి మ్రింగేస్తుందో!" అని కనుక అపారపారావారం గురించి ఏమీ తెలియనప్పుడు దూరంనుంచి ఆ నీళ్ళని ముట్టుకొని, నమస్కారం పెట్టండి. ఇలా నడుచుకొంటే - జీవితం ప్రశాంతంగా భయాందోళనలు లేకుండా సాగిపోతుంది. వాళ్ళ ఆట వాళ్ళకే తెలుసు. వ్యామోహంలో మునిగిన వ్యర్థులేమర్థం చేసుకుంటారు? వాళ్ళసంగ తేమిటో గ్రహించుకోక వివిధరీతుల్లో ఈ మహాసముద్రాన్ని కలచివేస్తారు. అమృతం గర్భంలోధరించిన, చంద్రుని ప్రసవించిన ఈ సముద్రం ప్రాణాంతకమైన కాలకూటాన్ని గూడా కలిగి ఉన్నదని వాళ్ళకి తెలియదు. ఏమైనా నాకు సంబంధించిన విషయాల్ని గురించి మాట్లాడటం నిరుపయోగం. ప్రశాంతంగానూ సుఖంగానూ ఉన్నారని విని సంతోషిస్తాను. మీరిద్దరూ ఒకసారి ప్రక్క ప్రక్కనే నాలుగు కాళ్ళమీద నిలుచున్నట్లు నిలుచుండి నన్ను శుభాకాంక్షల్ని తెలుపనీయండి. భార్యాభర్తలు కలిసి ఉండగా వారిని చూడటంకంటె మించిన ఇష్టం నాకు మరేదీలేదు. అందుకే ఈ ప్రార్థన.

మీ

హర

# 24వ పత్రము

అయ్యా,

ఈ ఏకాంతాన్ని మించిన ఆనందనిలయం మరేదీ లేదన్నది సత్యం. నిరంతరం మంచుతో కప్పబడిన ఈ పర్వత ప్రాంతపు మెట్ట ప్రదేశాల్లో భగవానుడి నిరంతర విహారాన్ని అనేకచోట్ల దర్శిస్తున్నాను. ఆశ్చర్యంలో మునిగిపోతున్నాను. కాని, అయ్యా ఒక భావప్రకటన యేమనగా "ఓ ఏకాంతమా! నీ ముఖంలో మునులు దర్శించిన ఆకర్షణలు ఎక్కడ మరుగున బడ్డాయి? ఇవి పిచ్చివాడి వాగుళ్ళలాగా లేవూ? ఇప్పుడు 'హరి' అని, ఆనందంలో మునగండి. అప్పుడు ఎంత ఆనందం ఒంటరిగా అనుభవిస్తారో? ఎంతని త్రాగి ఆ ఆనంద సముద్రాన్ని ఖాళీచేస్తారు? ఇతరుల్ని మీ వెంట తీసుకువెళ్తే తృప్తితీరా త్రాగటమేగాక, తర్వాత త్రాగటానికి కుండలనిండా ఇంటికి తెచ్చుకోవచ్చుగదా! అందుకే మీకు తారసపడ్డ ఎవరినైనా ఏ మాత్రం అనుమానంగాని, ఆటంకంగాని లేకుండా ప్రేమ వార్ధికి తీసుకువెళ్ళండి. ఎంత ఎక్కువమంది ఉంటే అంత సంతోషం. అంతేకదా! శివుడు ఏకాంతంగా ఉంటాడనుకుంటారు. కాని, ఆయనకళ్ళు ప్రేమ వార్ధిమీద పడితే ఇతరులెవరూ లేనప్పుడు భూతప్రేత పిశాచగణాల్తో తన "ఢమరు" వాయిస్తూ సంతోషంతో పిచ్చివాడై పోతాడు. ఏకాంతంగా త్రాగితే ఆనందంలేదు. త్రాగినమైకంలో అనేక మారులు మీరు తూలి బజారులోపడితే తప్ప మజా ఏముంది? వేలమంది ఆనందిస్తారు. తప్పట్లుకొడతారు. ఆడతారు. ఆదృశ్యం ఆనందకరం. రాత్రిపూట 'గప్‌చిప్' గా త్రాగితే ఆనందం ఏముంది? మందుత్రాగితే ఎంతో అదీ అంతే. ఇందుకే నిత్యానందుడి రూపంలో మన ప్రభువు అమృతోపమానమయిన ఔషధం ఇవ్వటానికి ప్రతి హృదయంలోను ప్రేమవర్షిస్తూ ఆ ప్రభావంలో ప్రపంచం తూలిపోయేటట్లు చేసి, గడపగడపకీ తిరిగాడు. ఎందుకు ఇంకా దాగి ఉండటానికి ప్రయత్నిస్తారు? మత్తు పదార్థాన్ని సేవించారు. మిగిలిందల్లా బహిరంగంగా తూలటం దొర్లటం. నామాటలకి తలాతోకాలేదు. వాటిని పట్టించుకోకండి. ఒళ్ళు తెలియని వానిప్రేలాపనలుగా వానిని పట్టించుకోకండి. మీరు నాటిన చెట్టుకి మధుర ఫలాల్ని కాసేటట్లు చూడటం ఇప్పుడు మీ కర్తవ్యం. వాటిని ఎవరైనా రుచి చూడటం తటస్థిస్తే ఎంతో ఆనందిస్తారు కదా! అందుకని నాగురించి ఆలోచించకండి అయితే నన్ను మర్చిపోకండి.

మీ

హర

# 25వ పత్రము

బాబూ కృష్ణదాస్ శీల్

తమ్ముడూ కృష్ణా! నీ ఉత్తరం చదివి ఎంతసేపు ఏడ్చానో ఆ గుప్తనిధి ఆ ఆప్తమిత్రుడే చూశాడు. ఆ దయామయుడైన హరికృపని దర్శించటం ఇది మొదటిసారికాదు. ఆ సర్వశక్తివంతుడి అపార కృపా నిదర్శనాలను అనేకం తరచు చూశాను, ఇప్పటికీ చూస్తున్నాను. కాని, ఎంతటి పాపాత్ముడినంటే భ్రమతో గుడ్డివాడినై వివేకహీనుడినై అతని ప్రేమను పరిపూర్ణంగా పొందలేకపోయాను. కష్టాల్లో మునిగి, ఎండమావులచేత ఆకర్షింపబడి ఉద్విగ్నాకాంక్షతో నాకాలాన్ని వృధా చేసుకుంటు న్నాను. సావధానంగా నీ ఉత్తరం పరిశీలించటంతో అత్యంత వ్యాకులుడనై, అగాధమైన, అపారమైన భ్రామికమైన జీవనదుఃఖసముద్రాన్ని సూటిగా దాటించగలిగిన ఏకైక కర్ణధారికి నాహృదయం నివేదిద్దామనుకొన్నాను. కాని, ఆశించిన సంతోషాన్నుంచి నా గత పాపాలు, దూరంచేసి అపార నిరాశా సముద్రంలో ముంచి వేశాయి. నా హృదయం అంధకారంలో భూగర్భంలా భూస్థాపితమైంది. భయంకరమైన పెద్ద పులులకీ విషసర్పాలకీ నిలయమైన కొండ గుహలాగా ఈర్ష్యాద్వేషాలకి యిది నిలయం. నా కష్టాలెప్పుడూ భరించలేనివే. గాఢ నిరాశామయమైన క్రూరవాతావరణం నాకు విపరీతాలే కలిగిస్తుంది. నామనస్సు నిజస్థితి నా మనస్సుకే తెలుసు. ఇంకా ఈ దురదృష్టవంతుడి హృదయకుహరంలో కూర్చుని, దుర్భర బాధని అనుభవిస్తున్న ఆ ఆనంద స్వరూపుడైన భగవానుడికే తెలుసు, తమ్ముడూ, ఇంత కఠినాత్ముడి హృదయంలో అంత మృదుత్వం మూర్తీభవించిన అతడుంటాడా? కాని అతడు ఎంత దయామయుడంటే అటువంటి హృదయాల్లో బలవంతంగా నైనా జొరబడాలని కోరుకుంటాడు. కాని, అటువంటి కఠినావాసంలో అతని ఉనికి ఊహించటం నాకు మహాబాధాకరంగా ఉంది. నిర్మలాతినిర్మలుడిని ఈ అపవిత్ర హృదయంలో ఉంచటమనే ఊహతో శరీరమంతా బాధతో జలదరిస్తోంది. ప్రియమైన కృష్ణా! నిజం చెప్పాలంటే నా అదృష్టం నీ చేతుల్లోఉంది. నీవే నా ఆశవి, ఆకాంక్షవి. నమ్రుడివై వినమ్రుడివై రోజురోజుకీ ఆ మృదుపాదాల్ని నీ హృదయంలో నిలుపుకో, అప్పుడు అదృష్టహీనుడైన నీయీ అన్నని జ్ఞాపకంపెట్టుకుని నాగురించి అతనితోచెప్పు. ఇది చాలు, నాకు పుణ్యం పెట్టుబడి పెట్టటానికి, అప్పుడు అర్హమైన దేహాన్ని పొంది, నిస్సందేహంగా వ్రజభూమిలో నివసించటానికి అర్హుడినవుతాను. ఏమైనా నీయీ అన్నని మర్చిపోకు, అతడు మహాపాపాత్ముడు కావచ్చు, కాని తమ్ముడిగా నీ కర్తవ్యాన్ని

మర్చిపోగూడదు. సొంతమంటూ నాకే ఆధారాలులేవు నీవొక్కడివే నా ప్రధానావకాశానివి. అలా నమ్మి ఒక పెద్ద బంధు సమూహాన్ని కూడబెట్టటానికి భయపడను. కొందరికి తండ్రిని, భ్రాతని కొందరికి, కొడుకుని కొందరికి, మరికొందరికి సోదరిని. ఇలా నాబంధువర్గం అతి విశాలమైంది. మహాపాప ప్రాయశ్చిత్తానికి పెద్ద బంధువర్గాన్ని సంపాదించుకుంటారు. అయినా నేనేం. చేయగలను? అతి పేదవాడిని. స్వార్థంతో మీవంటి స్థితిమంతులతో సంబంధాలు కల్పించు కొంటున్నాను. ధనికులుగా మహా ధనికులుగా రోజురోజుకీ మీరు ఎదగవచ్చు. నేను బీదవాడిగా అతి బీదవాడిగా రోజురోజుకీ దిగజారవచ్చు. నేను ఏమాత్రం కష్టంగాని, నష్టంగాని పొందను. నేను కోరేదల్లా మీరు సంతోషంగా ఉండటం చూడాలని, అది చూచి నేను ఆనందంగా ఉండాలని. కృష్ణుడి సంకల్పమేమిటో కృష్ణుడికే తెలుసు, అతనికి అప్తుడివి కనుక నీకు కూడా తెలుసు, అతడు నాకూ ప్రభువే. కాని, నా హృదయం కఠినమూ అపవిత్రమూ కనుక నేను అతణ్ణి పోగొట్టు కొన్నాను. ప్రపంచంలోని బాధాతప్తులు, పాపాత్ములు అందరూ అతనికి అతిప్రియులు. వారిపట్ల అతనెంతో శ్రద్ధవహిస్తాడు. ఇది మనసులో పెట్టుకొని పతితుల పట్ల నిర్లక్ష్య భావం చూపకు, పాపాత్ములూ, పవిత్రులూ ఇద్దరూ కృష్ణుని వారే. రాజాజ్ఞతో శిరచ్ఛేదము, లేక ఉరితీసే తలారి రాజోద్యోగికాడూ? మంత్రిఎంతో తలారీ అంతే. ఒక ప్రత్యేకమైన పనిలో నియుక్తుడైనవాడు ఆపనిచేస్తాడు. అతని ఆజ్ఞను నిర్వర్తిస్తాడు. కనుక ఎందుకు పతితులపట్ల నిర్లక్ష్యం? దయతో కరిగిపోతే, ప్రేమతో, చిరునవ్వుతో అతణ్ణి అక్కున జేర్చుకో, దానికి కృష్ణుడు నీమీద కోపిస్తాడా! బహుశా కొంతమంది ఇదివిని నిర్ఘాంతపోతారు. వారు అటువంటి పని అధర్మాన్ని ప్రోత్సహించేదిగా భావించవచ్చు. కాని, తమ్ముడూ ప్రశ్నని జాగ్రత్తగా పరిశీలిస్తే, అంతర్లీనమైన సత్యం నీకు గోచరిస్తుంది. తమ్ముడూ, సర్వమానవులు ఎవనికి చెందిన వారో అతనివే సర్పాలూనూ. మరి పాములంటే ద్వేషించటమెందుకు? నీకు తారసపడే ప్రతివాడికి గట్టిగా చెప్పు. ప్రభు నామం చేయమని గట్టిగా చెప్పు ఏ మాత్రం అవధులు లేకుండా అందరిపట్ల ప్రేమచూపించు. నీ శత్రువుల పట్ల ప్రేమ దృక్కులతో చూడటం నేర్చుకో, పిలుపువచ్చి ఏ క్షణం ఈ జగత్తు విడిచిపోవాలో ఎవరికితెలుసు? ఒక్క నామం మాత్రమే మిగిలి ఉంటుంది. రెండురోజుల పూజకోసం విగ్రహనిర్మాణం విశిష్టమా కాదా అనేది పెద్ద విశేషం కాదు. కాని, చిరకాలం పర్ధిల్లవలసిన విగ్రహం ప్రతిష్ఠించవలసిన ఆ విగ్రహపీఠం గట్టిగా తయారుచేయటం యుక్తంకాదూ? దుష్కర్మల పాపకర్మల ఫలాలతో రెండురోజులుండే ఈ భౌతిక శరీరాన్ని పోషించటం

కంటె శాశ్వతమైన ప్రభునామాన్ని వివిధ భూషణాలతో అలంకరించటం మేలు కాదూ? ఇతరుల సేవకోసం నీ జీవితం వినియోగించు. నీ దృష్టిలో ఉన్న పాపాత్ములకోసం నిర్విరామంగా దుఃఖించు. ప్రేమమూర్తి, పాపులపాలిటి ఏకైక శరణ్యమూ అయిన, నా నితాయిముందు వాళ్ళతరపున వాదించు, నిరంతరం ప్రేమాధినాథుని ప్రేమకోసం ప్రార్థించు. ఆనందమయమైన ఈ విశ్వాన్ని దర్శించ దల్చుకొంటే ఆనంద వృక్షంక్రిందకూర్చుని దానివైపుచూడు. నిత్యానందుడి పాదాలు నీ ఆశ్రయంగా చేసుకో, పరిపూర్ణమైన వినయంతో అలాచేయి. అప్పుడు కృష్ణప్రేమలో మునకలెత్తుతావు. ప్రేమ పూర్ణమైన దృష్టితో ప్రతివస్తువునీ సంతోషమయంగానూ, ఆనందమయంగానూ చూస్తావు. కృతార్థుడివవుతావు. నీ ధుఃఖాలన్నీ నివృత్తి అవుతాయి. ధుఃఖాలనుంచి విముక్తి పొందటానికి కృష్ణునిశరణు పొందటం అవసరం, ఎందుకంటే, అరణ్యం బడబాగ్నిలో దగ్ధమైపోతుంటే, ఆర్పేటందుకు ఆకారుచిచ్చుని మ్రింగింది అతడే తమ్ముడూ. రోజురోజుకీ సమయం ఎగిరిపోతోంది. ఎవరికి తెలుసు మనకీ ప్రపంచంలో ఇంకెన్ని రోజులున్నాయో! అయినా ఆశ్రయం పొందదలచుకుంటే సమయముంది. కాని, నాగతి అలా లేదు. నిర్విరామంగా ప్రయత్నించు. తప్పక సఫలీకృతుడవవుతావు. వ్రాస్తున్నప్పుడు వేరే ఆలోచనలతో కలవరపడుతున్నాను. కనుక ఉన్మత్తుణ్ణి కావటంకంటె ప్రయత్నించి విరమించటం మంచిది. నా పొందికలేని మాటలకి నవ్వకు. హృదయాన్నుంచి పెల్లుబికి వర్షించే మాటలు గ్రంథస్థరీతుల్లో ఉండవు. మనస్సు మనస్సుతో మాట్లాడుతుంది. కనుక మనస్సునుంచి కొన్ని మాటలు తెలియకుండా వెలువడ్డాయి. సంకోచించకుండా వ్రాశాను, నీకు వ్రాస్తున్నాను కనుక, తమ్ముడూ కృష్ణా! ఇది కూడా తెలుసుకో - ప్రేమసామాగ్రికి ఏకైక యజమానులు ప్రేమైకమూర్తులైన స్త్రీ జనమే. కనుక కృష్ణ ప్రేమలో ఉన్నతుడివి కావాలంటే భార్యలు కానివ్వు, కూతుళ్ళు కానివ్వు, తల్లులు కానివ్వు స్త్రీ జనాశ్రయం పొందక తప్పదు. నీ భార్యని సఖిగాగాని, గృహ సంబంధ విషయాల్లో సహాయకారిగాగాని, భావించి మోసపోకు. స్త్రీలు కృష్ణ ప్రేమ దాతలు. నీకు కూతుళ్లు కనుక కూతుళ్ళని తేలికగా చూడకు. స్త్రీలంతా ఒకటే. శెలవుల్లో రావటానికి ప్రయత్నిస్తాను. నాప్రాణం అంతవరకూ నిలిస్తే కలవవచ్చు. లేకపోతే మీక్షేమంకోసం ప్రార్థిస్తూ ఈ ప్రపంచం వీడిపోతాను. దీనికి విచారించకు. నీటి బుడగలు అనేకం సముద్రజలంమీద కనిపిస్తాయి, మరుక్షణం మాయమవుతాయి, నేనూ వాటిలో ఒకటి.

నీ

హర

# 26వ పత్రము

ప్రియమైన అమ్మా, (నియోగి బాబుగారి భార్య)

ఇతరుల పిల్లలనుకూడా తన పిల్లల్లాగ ప్రేమించటం ప్రతివారి కర్తవ్యం. ఈ రకంగా ప్రాపంచిక పరిధుల్ని అతిక్రమిస్తుంటే కృష్ణుణ్ణి ప్రేమించటం నేర్చుకొంటారు. స్వార్థాన్ని త్యజించకపోతే ఇతరులపై ప్రేమ, ఇతరులపై ప్రేమలేకపోతే కృష్ణ ప్రేమ అసాధ్యం. ఇందుకే శ్రీకృష్ణ చైతన్యుడు సనాతన గోస్వామికి ప్రభునామానురక్తి, భూతదయ, వైష్ణవసేవ బోధించాడు. ఈ మూడింటిలో ఏది చేయటానికైనా స్వార్థత్యాగం అవసరం. క్రమంగా స్వార్థ రహితులౌతూ తనవాడైన శ్రీకృష్ణుణ్ణి చేరువగా తెచ్చుకోవచ్చు. కృష్ణుణ్ణి పొందట మంటే సర్వప్రపంచాన్నీ పొందటమన్నమాట. ఈ విశ్వమంతా అప్పుడు నీదవుతుంది. ఎవరినైతే ఇప్పుడు కృష్ణుణ్ణి జేరటానికి నీవు మరచిపోవాలో వారే నీవు కృష్ణుణ్ణి నీవాణ్ణి చేసుకొన్న తర్వాత నీవాళ్ళవుతారు. అజ్ఞానం వల్ల స్వార్థత్యాగం మొదట్లో బాధాకరంగా కనిపిస్తుంది. స్వార్థ రహితులైన తర్వాత ఎవరినైతే మర్చిపోవలసి వచ్చిందో వాళ్ళని నీచేతుల్లో ఉన్నట్లు గ్రహిస్తావు. రెండురోజుల స్వార్థంకోసం మాయా ప్రభావంతో శాశ్వత లాభాన్ని బలిచేసుకోకూడదు. ఎవరైనా శాశ్వత సుఖాన్ని కాంక్షిస్తే అతడు కళ్ళుమూసుకొని స్వార్థ త్యాగాన్ని అభ్యసించాలి. ఎంతవరకైతే స్వార్థం ఉంటుందో అంతవరకూ శ్రీ హరిసేవలో ప్రవేశించలేడు. అమ్మా, కృష్ణ ప్రేమలో మునిగిపో, నీవలా ఉండటంచూసి నేనానందిస్తాను. ఆరాధనా కార్యక్రమాలను చేపట్టటం, పూజా పునస్కారాల్లో ప్రవేశించటం, నాకు ప్రస్తుతం సాధ్యంకాదు. అవకాశం దొరికినపుడు బద్ధకంతో సమయం వృధాచేశాను. ఇప్పుడు నాకవకాశంలేదు. నా ఆశలూ ఆకాంక్షలూ అన్నీ నీమీదే ఉన్నాయి. అన్నయ్య బాగున్నాడని ఏమాత్రం ఆతురత చెందనక్కరలేదని 'నాని'తో చెప్పు. చాలాకాలంగా సోనాముఖి వార్తలు ఏవీ తెలియటం లేదు. ఏమైనా, అంతా కులాసా అనుకొంటాను. కొంతకాలంక్రితం ఎప్పుడు నీవు వస్తావో అని ఆతురతతో వ్రాసిన ఉత్తరం ఇంటినుంచి వచ్చింది. కృష్ణుడు వాంఛిస్తే కోరికలు తీరతాయి. నాగురించి ఆతురత పడవద్దు, నన్ను జ్ఞాపకంఉంచుకో అమ్మా.

నీ

కొడుకు

# 27వ పత్రము

నాన్నా రాధా,

నీ క్రిందటి ఉత్తరంలో 'నాని' కొంచెం బాగుందని విని సంతోషించాను. అలాగే ఆరోగ్యం అంత బాగాలేదని విచారించాను. బాగా వేడిచేసింది. ఆందోళన కవలసిన అవసరం లేదు. ప్రతిదీ మంచిగా మారుతుంది. కామితం ఫించాలంటే, వాంఛితార్థ సాధనలో ప్రధానమైన నీ శరీరంపట్ల ప్రత్యేక శ్రద్ధతీసుకో. రం ఆరోగ్యంగా ఉన్నపుడు ధ్యానంలో మహదానందం లభిస్తుంది, కాని అనారోగ్య రంతో అది సాధ్యం కాదు. ఇందుకే సాధువులు వాంఛితార్థ సాధన చిరకాలం కసాగించేందుకు వీలుగా తీవ్ర ఏకాగ్రత నభ్యసించి, తమ శరీరాన్ని ఆరోగ్యవంతంగా ండేటట్లు చూసుకొన్నారు. హఠ రాజయోగాలను ఈ ప్రయోజనానికిగాను భ్యసించారు. అలా అన్ని సాధనలకి శరీరం మూలం. నీ ఆరోగ్యంపట్ల ప్రత్యేక ద్దచూపించు. ఆహారం ఎప్పుడూ మితంగా తీసుకో, విహారాలపట్ల జాగ్రత్తగా ఉండు. తిక శరీరం ఇప్పుడు క్షీణదశకి పురోగమిస్తోంది. క్రమేపీ వెనుకకి మరల్చగలిగితే ంకా కొంతకాలం ఉంటుంది. అసలే మహా వేగంతో ఉరుకులెత్తుతున్న ప్రవాహంలో ంకా వేగంగా పోవాలని ప్రయత్నించటం సబబుకాదు. కనుక నీ ఆరోగ్యం పట్ల ప్పు అతిజాగ్రత్త తీసుకోలేవని అంటాను, 'అటలు'ని తరచు చూడటం మంచిది. ప్పుడప్పుడు తీరిగ్గా వెళ్తూండు, మితంగా పౌష్టికాహారాన్ని తీసుకో, ఉత్తేజకరమైన ామసికాహారాన్ని తీసుకోకు. పాలు, నేయి మొదలైనవి దేవతలకి ఆహారం. టువంటి ఆహారంపట్ల ప్రత్యేక శ్రద్ధవహించు. కాయగూరలు, పండ్లు తరచుగా సుకోవటంలో శరీరానికి స్వాస్థ్యం చేకూరుతుంది, వ్యాధి నిరోధకశక్తి చేకూరుతుంది. పి మనస్సులో ఉంచుకో..

మీ

హర



# 28వ పత్రము

బాబూ రాధా,

నీలేఖ అందింది. నీవు అంత ఆతురతగా ఉన్నావని ఎంతో విచారించాను. ఆతురతకి అవసరమేలేదు. కృష్ణుడు సర్వత్రా ఉన్నాడు అతడులేని స్థలంలేదు. ప్రతిచోటా అతనిదయ ప్రత్యక్షంగా ఉంది. కనుక భయమెందుకు? అనవసరపు ఆలోచనలతో నీ హృదయాన్ని నా గురించి కష్టపెట్టుకోకు. కృష్ణచింతనలో ఎల్లప్పుడూ కాలంగడుపు. అతడు అనంత కరుణాళువు. మానవులపట్ల ఆతురత పడటం నిరుపయోగం. చెట్టు మొదట్లో నీరుపోస్తే కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పువ్వులు, పండ్లు, చెట్టంతా ఎట్లానీరు పెట్టబడినట్లవుతుందో అట్లాగే ప్రధానశరణ్యమూ విశ్వానికి ఆదికారణమూ అయిన కృష్ణుణ్ణి చింతిస్తే ప్రతివారి పట్ల శ్రద్ధతీసుకున్నట్లే. కనుక విశ్వానికి ఆశ్రయస్థానమైన కృష్ణధ్యానంలో అహర్నిశలూ గడుపు. నీ హృదయాన్ని అతని పాదాలవద్ద గుమ్మరించి సుఖంగా ఉండు. మానవుణ్ణి మానవుడిగా ప్రేమించు. మానవుడు మోసగాడు. ఎందుకంటే ఏసమయంలోనైనా చెప్పాపెట్టకుండా శెలవుతీసుకోవచ్చు. హృదయపూర్వకంగా నీవు ప్రేమిస్తున్నవాడు నిన్ను రేపు విడిచిపోవచ్చు. సృష్టింపబడిన జీవులు అతని ఆజ్ఞకు లోబడి ఉంటాయి. పొమ్మన్నప్పుడు ఎవ్వడూ ఉండలేడు. అతని అనుజ్ఞలేకుండా ఎవడూ పోనూలేడు. కృష్ణుడి సంకల్పం సర్వస్వతంత్రమైంది. మానవుడూ, మిగిలిన సర్వసృష్టీ అతని ఆజ్ఞలో ఉంటాయి. ఇందుకే మానవుడిని మానవుడిగానే ప్రేమించమంటాను.

మీ
హర

# 29వ పత్రము

చెల్లీ, నానీ (నియోగి బాబుగారి కుమార్తె)

ఈసారి ప్రతివాళ్ళ దగ్గరనుంచీ ఉత్తరాలు వచ్చాయి, కాని, నీకొక్కదానికే సమాధానం వ్రాస్తున్నాను. నిన్ను నేనెంత ప్రేమిస్తున్నానో, దీన్నిబట్టి నీవర్థం చేసుకుంటావు. అంటీ పట్టనట్టు ప్రేమించటం నాకు తెలిసినట్లు మరెవ్వరికీ తెలియదు. బహుశా నేను ప్రేమించేవిధానం విని నవ్వుతావు. చెల్లీ, అదల్లావుంచు. నీ దస్తూరీ ముత్యాలకోవలాగా చక్కగా ఉంది. నీ దస్తూరీతో అప్పుడప్పుడు నాకు

బీదవాణ్ణి. ప్రతి ఇంటి ముందూ దయాదాక్షిణ్యాలకోసం అలమటిస్తూ యాచించే బిచ్చగాణ్ణి. నా కృష్ణుడు అతి దయాళువు. అతనిదయ నిరుపమానం, అనంతం. ఇప్పుడు నన్నతడు దయతో మీ గుమ్మం దగ్గరకు తెచ్చాడు. మీ కృప ఎంతగొప్పది! నా వంటి పాపాత్మునికోసం, నికృష్టుని కోసం మీరు ఎంత కష్టపడుతున్నారు! దానిని ఎలా (ఋణం) తీర్చుకోవాలో నాకు తెలియదు. నాకు విశ్వాసమూలేదు, ప్రేమాలేదు. ఎడారి లాంటి నా హృదయం మీకు సమర్పించినా అది మీ కెందుకు స్వీకరిస్తారు? నన్నెపుడూ ఋణగ్రస్తుడిగానే ఉంచుతారా? అలాగే కానీయండి. నేనుకూడా హృదయ పూర్వకంగా మీ పాదాల దగ్గర అదేప్రార్థిస్తాను. అయ్యో! నామాటలు కొన్ని చోట్ల అర్థంకాలేదని వ్రాశారు. ఇది పూర్తిగా నిజం. పిచ్చివాడి మాటలు అసంగతాలు, కనుక అర్థం కావు. అప్పుడప్పుడు నా మాటలు నాకే అర్థంకాక మౌనంగా నాలోనేనే నవ్వుకొంటుంటాను. ఏలీల జరుగుతోందో వాడికే తెలుసు. చాలా సందర్భాల్లో ఒక పరిష్కారంకోసం చేసిన ప్రయత్నాలు నా విలువను పోగొట్టుకొనేటట్లు చేశాయి. కులమూ, వంశమూ, మర్యాదా ఏనాడో పోగొట్టుకొన్నాను. దీనిమీద మరోసారి హద్దుమీరటం నిస్సందేహంగా అత్యానంద దాయకమూ, అతి దుఃఖహేతువూను. "విషమూ, అమృతమూ కలిసి పోయాయి." అతిమధురం! అతి మధురం! అయ్యో అటువంటి సుఖ దుఃఖాలలో నేను ఎప్పుడూ మునిగి ఉండేటట్లు, ఇతరులనీ అట్లాముంచి ఉంచేటట్లు, దయచేసి నాకు దాన్ని అనుగ్రహించండి. సకల సౌందర్య రాసులైన స్త్రీమూర్తులు మాత్రమే ఈ ప్రాంతానికి దోవజూపగలరు. ఒక వేళ వాళ్ళ నతిక్రమించి పోదామని ప్రయత్నించామా సుందర రాధా కుండాన్ని (రాధారాణీ పునీతంచేసిన చెరువు) చూపించేబదులు నరకకూపానికి వారు తీసుకుపోతారు.

అపమార్గంలో ఉండి ఎవరమో ఏమో తెలుసుకో కుండా మురికికూపాన్ని రాధా కుండంగా, నికృష్టమైన విపత్తుల్ని మనోహరమైన ఆనందాలుగాను, అపోహపడి జారపడతాము. ఈ రాజ్యానికి స్వతహాగా మనకి దోవతెలియదు. మనకి దోవజూపగలిగిన వాళ్ళని న్యూనతపరచి మన నాశనాన్ని మనమే తెచ్చుకుంటున్నాము. తెలియకుండానే ఈ ప్రేమ మూర్తుల్ని విషపయోధులుగా మార్చి, స్వయంకృతమైన ఆ విషాగ్నిలో భస్మమయి పోయేటట్లు చేసుకొంటున్నాము. అయ్యో, అమూల్య మణులకి, రత్నాలకి ఆలవాలము, చంద్రుడికీ అమృతానికీ జన్మస్థానము అయిన ఈ సముద్రం బ్రహ్మాండాన్నే దహించి వేయగల సెగలుకక్కే హాలాహలానికికూడా స్థావరమని మీ రెరుగుదురు. శ్రీమన్నారాయణుని అనుగ్రహం పొందకుండా ఎవ్వరూ అమృతాన్ని గాని, లక్ష్మినిగాని పొందలేరు. ఉదాసీనులైన శివునివంటి వారికి విషం,

విషమేదక్కుతుంది. సుఖదుఃఖాల కాలవాలమైన సముద్రాన్ని నారాయణుని అనుగ్రహ వరాలను పొందిన వారే క్రమంగా తరించగలరు. ఇతరులు మునిగి పోతారు. నేను అగాధంలోకి పడిపోయి బ్రతికి బయటపడటానికి గిలగిలా తన్నుకొంటున్నాను. మీరు నన్ను పైకిలాగితే రక్షింపబడతాను, లేకపోతే అడ్డుదోవలో శీఘ్రంగా నరకానికిపోతాను. లాభనష్టాలు రెండూ ఉన్నట్లయితే వివేకులు లాభం సంగతి ఎత్తరు సరికదా అటువంటి చోటుగురించే ఆలోచించరు. "వివేకుల మార్గమే ఋజుమార్గము" అని శాస్త్రాలు చెబుతాయి. ఇట్టి సముద్రాన్ని సమీపించనేకూడదు. అయితే ఒక వేళ అక్కడికి వెళ్ళవలసి వస్తే అతిజాగ్రత్తగా పడవ అతి ప్రావీణ్యంగా నడుపుకుంటూపోతాము. అనుభవజ్ఞులైన నావికుల్ని గౌరవించాలి. వాళ్ళసహాయంతో సుఖ సంతోషాలని ప్రసాదించే స్వామి సన్నిధానం జేరటానికి వీలుండవచ్చును. లేకపోతే ఈదుతున్నప్పుడు ఉప్పునీళ్ళు కడుపులోకి పోయి కడుపు ఉబ్బుతుంది. నాకడుపు పగిలేలా ఉంది. అయినా తగిన జాగ్రత్త తీసుకోలేక పోతున్నాను. మీరు సమర్థులైన వైద్యులని మిమ్మల్ని ఆశ్రయించాను. ఇప్పుడు దయజూపండి. మీపడవ పటిష్టంగా ఉంది. మీ మార్గదర్శకుడు నిపుణుడు. మీరు తగుజాగ్రత్తతో మీ పడవలోకి జేరారు. ఇప్పుడు మీ కేమీ భయంలేదు. నాకు రెండూ బాగుండలేదు. నాపడవ చిల్లిది, కర్ణధారి మూర్ఖుడు. వాడి అనుభవం ఒకవైపుకే పరిమితం. కళ్ళు నెత్తిన పెట్టుకొని లోపలికి ప్రవేశించాను. మునిగిపోతుందేమోనని ప్రతిక్షణం భయపడు తున్నాను. ఈ హతాత్పరిణామం రాకుండా ఉండటానికి ప్రయత్నిస్తున్నాను. ఆలోచనలవల్ల ప్రయోజనం లేక పోయినా, మునిగిపోయే వాడికి గడ్డిపోచేగతి అనిపిస్తుంది. నాస్థితీ అలాగే ఉంది. ప్రేమ మూర్తులు ప్రేమతో చూస్తారో మునిగిపోతున్న నన్ను చూసి హేళన చేస్తారో నాకు తెలియదు. అదివారికే తెలుసు, నాగతి రెండోదే అనిభావిస్తున్నాను. అయ్యో అలా నవ్వుతూ తుళ్ళుతూ ఎవరూ అలా చంపలేరు. మృదుహృదయులూ, అలాగే కఠినాత్ములున్నూ. శాస్త్రాలు చెప్తాయి, "వజ్రం కంటే కఠినులు, కుసుమంకన్నా కోమలమైన వారు" అని. ఈ మాటల్ని వాళ్ళకి అన్వయిస్తే సరిగ్గా సరిపోతాయి. అంత అద్భుతమైన ధృఢమైన శక్తి మరొకటి లేదు. ఎలుకని చంపి చేతిని పాడుచేసుకోవటం ధీరత్వం కాదని వాళ్ళకి మనవి చేస్తున్నాను. అయ్యో వాళ్ళని గురించి ఆలోచిస్తే అన్నీ మర్చిపోతాను, ఏమి వింటానో ఏమి అంటానో జ్ఞాపకం ఉండదు. ఈ భయంకర సుడిగుండాలను తల్చుకున్నప్పుడు భయంతో కొయ్యబారిపోతాను. విపరీతమైన భయం మృత్యుదేవతనే శరణు జొచ్చేటట్లు చేస్తుంది. వాళ్ళు నన్నేం చేస్తారో చూడనివ్వండి. అయ్యో ఈ ప్రసంగమే

నన్ను అప్పుడే పిచ్చివాణ్ణి చేసేసింది. మరివేరే దిక్కుకు ఒక్క అడుగుకూడా వేయాలనిపించటం లేదు. అప్పటికీ ఆకలి వంట యింటికి దారితీస్తోంది. నామనస్సుకి అనుగుణంగా నాచేతిక్కి, చేతికి అనుగుణంగా మనస్సుకీ పని కల్పించాను. నాకోరికలు మనం కలిసే వరకూ తీరవు, నన్నువదలవు. "క్షణికమైన చపలసుఖాల కోసం లోభుల్ని ధూర్తుల్ని సేవించి మోసపోయాను". సరిగ్గా అది నాస్థితి. ప్రస్తుతం సెలవు తీసుకోనీండి. నాకలం ముందుకు ఏ మాత్రం సాగటం లేదు. దయజూపండి.

మీ దాసుడు

హర

# 31 వ పత్రము

నాన్నా రాధా,

నీ ఉత్తరం అందింది. కాను (శ్రీకృష్ణుడి) ఆప్తమైత్రిని పొందటానికి ఎంతో తెలివి అవసరం. మనస్సు బాగా వ్యాకులమైనప్పుడు మానావమానాలు నశిస్తాయి. అనిజ్ఞాపకం పెట్టుకో, ప్రశాంతత నెలకొంటే కాను ప్రేమ లభిస్తుంది. లేకపోతే అతి దుఃఖాన్ని కలిగిస్తుంది. ప్రేమికుల సమాగమనానికి ముందుదశ తాపంగా ఉత్కంఠ స్థితిలో ఉంటుంది, భరించలేని స్థితిలో ఉంటుంది. ఉద్రేకపడి ప్రయోజనం లేదు. శాంతంగా ఉండాలి. మహర్షులు చెప్పారు. "శాంతంలోగాని, క్షోభలోగాని హరి ఒక వజ్రం ముక్క. కూర్చినవాడికే అది ఎరుక" కనుక నాన్నా తొందరపడి ప్రయోజనం లేదు. ప్రియసతి తన ప్రియ పతిని గురించి తదేకంగా ఆలోచిస్తుంది కాని, ఆ యాలోచన తన పెద్దవాళ్ళని ఎదిరించేంత మొండి తనం కలిగిస్తుందా? హేళనలకి లెక్కచేయని స్థితికివస్తుందా? తాను బయట పడి పోతానేమో ననే భయం. తన ఆతురతని కప్పిపుచ్చుకొనేటట్లు చేస్తుంది. కనుక రహస్యంగా దాచివుంచాలి. బాగా మూతపెడితే తొందరగా ఉడుకుతుంది. దీన్ని రోజూ చూస్తావు, మరి ఎందుకు దాచి ఉంచవు? మాగబెట్టినప్పుడు పచ్చివస్తువులు పండ బారతాయి, తీయనవుతాయి. కనుక దాచిఉంచు.

నీ

హర

# 32 వ పత్రము

రాధా, నాప్రాణం,

నీ మధులిప్తమైన లేఖ ఆనందంతో నాప్రాణాన్ని, ఆత్మని ముంచి వేసింది. ఇక్కడొకమాట, నికృష్టమైన పాపాత్ముడిలాగా నిన్ను నీవు భావించు కోకు. శ్రీకృష్ణనామాన్ని చేసే వాళ్ళని సమీపించటానికి పాపం భయపడుతుంది. ఒక్కసారి కృష్ణనామం చేస్తే విష్ణుచక్రం అన్ని వైపుల నుంచీ అతణ్ణి కాపాడుతుంది. కృష్ణుడు స్వయంగా ఏ హానీ కలగకుండా చూస్తాడు. ఇప్పుడు చెప్పు. పాపం నిన్నెలా అంటుతుంది? దానికి ప్రాణభీతి లేదూ? అటువంటి అనుమానాలు పెట్టుకొని కృష్ణుడికి బాధ కలిగించకు. బ్రతకటానికి ఇష్టం లేదని భార్య మాటిమాటికి అంటుంటే ఆమెని అతిగా ప్రేమించే భర్త ఎంత నరకబాధ పడతాడో ఊహించు అలాగే నీవంటి కృష్ణుని ప్రియ భక్తులు పాపాత్ములమని దుఃఖిస్తే కృష్ణుడు విపరీతంగా బాధపడతాడు. కనుక ఈ విధంగా పవర్తించకు.

నీ
హర

# 33 వ పత్రము

నా రాధా,

నీ ఉత్తరం చూసి ఎంతో ఆనందించాను. కృష్ణుడు నీకు అభ్యున్నతిని చేకూరుస్తాడు. నిన్ను చూడాలని నాహృదయం ఆరాటపడుతోంది. ఆ సుదినం ఎప్పుడు వస్తుందో తెలియదు. పిల్లలంతా బాగున్నారని వినిసంతోషించాను. కృష్ణుడు వాళ్ళని ఆనందంగా ఉంచుగాక! నీ అభినివేశ ప్రయత్నాలతో నాలాంటి మహా పాపాత్ముడు ఇప్పుడు శ్రీకృష్ణ చరణాల వద్ద ఆశ్రయం ఆశిస్తున్నాడు. నీవు కృష్ణుడి ఆత్మవి. నీ శరీరం అతనిది. నిన్ను పొందిన నేను ధన్యుణ్ణి. నామనస్సుని కలచివేసే భావానికి రూపం ఇవ్వటం అసాధ్యం, అదీగాక నాకా శక్తీ లేదు, కనుక మౌనంగా ఉంటాను.

ప్రభునామంపట్ల విశ్వాసం ప్రగాఢమయినప్పుడు, నామం రూపుదాల్చిన కృష్ణుడు అనే అభిప్రాయం ధృవపడినప్పుడు, జనన మరణాలని కలిగించే భవరోగం నివారణమౌతుంది, ఇక శారీరక వ్యాధుల్ని గురించి చెప్పేదేముంది? ఏకాంతంలో ఈనామ సంకీర్తన బిగ్గరగా చేస్తే, కండ్ల నుండి ప్రేమాశ్రువులు అప్రయత్నంగా

ంవహిస్తాయి. అనురాగం ప్రేమ కలిసి ఉంటాయి. అనురాగం స్థూలంగా కామం ంనబడుతుంది. ప్రగాఢమయి, పరిణతి చెందితే ప్రేమగా మారుతుంది. ఇనుము ంగారం రెండూ లోహాలే, కాని వాటి విలువలోనూ రంగులోనూ ఎంతో తేడా ంది. కామానికీ ప్రేమకీ ఇదే సంబంధం. ఒకటి ఇనుము మరొకటి బంగారం. ేమకి పోలిక ప్రేమే. ప్రేమ ఫలం ప్రేమే. ప్రేమరుచి ప్రేమరుచి మాత్రమే. ఏ ోకంలోనూ దాన్ని వ్యక్తీకరించ గలిగిన భాషలేదు. పోల్చదగిన వస్తువులేదు. త్రాగితే ంమృతత్వాన్ని కలిగించే, దేవతలు దేన్ని త్రాగి అమరులయ్యారో, గ్రంథాల్లో దేని ాధుర్యాన్ని గూర్చి ప్రముఖంగా వర్ణించబడిందో ఆ అమృతాన్ని ప్రేమతో పోలిస్తే ంది సార హీనమైన నీరు వంటిదే. కనుక ప్రేమకి ప్రేమేసాటి. ప్రేమమూర్తి అయిన ారిని బంధించ గలిగిన ప్రేమకి పోలిక ఉంటుందా? ప్రేమభాండారమైన కృష్ణుడే ేమతో పోల్చతగడు. ఈ ప్రేమాస్వాదనకు విశ్వాత్ముడైన కృష్ణుడు గౌరాంగుని ాపంలో గడపగడపకీ ఊరూరా కళ్ళ నీళ్ళతో తిరిగాడు. హరినికూడా ఉన్మత్తుణ్ణి ంయగలిగేది ప్రేమ అనిపించుకొంటుంది. ఒక రచయిత ప్రేమని ఈ మాటల్లో ్యక్తీకరించాలని ప్రయత్నించాడు "ప్రేమ కృష్ణుణ్ణి నృత్యం చేయిస్తుంది. అతని ిక్తుల్ని కూడాను. దానంతట అదే నృత్యం చేస్తుంది. మూడూ కలిసి ఒకేచోట ంటాయి" అని, కనుక ప్రేమకి ప్రేమేసాటి అంటాను. కృష్ణుడు నీ కట్టి ప్రేమ ంసాదించుగాక! నేను దానిని చూసి ఆనందిస్తాను. ఈ అమూల్యానిధి నామ పయోధి ంధనం ద్వారానే లభిస్తుంది. ఇది ఇంకెక్కడా దొరకదు. ఈ కలియుగంలో ుక్తిమార్గం కేవలం హరినామమే నని ముమ్మారు ఈ సందేశాన్నివ్వటం ద్వారా గవత్ శాయశక్తులా పలుమార్లు ఎలుగెత్తి చాటాడు. నామార్ణవాన్ని ఎడతెరపి లేకుండా ంధించు. ఒకరత్నాన్ని తప్పక పొందుతావు, తప్పదు. పొందటంతో నీవేకాదు, నీ ుందు వెనుకల వారిని గూడ సంతోషపరుస్తావు. శరీరంగురించి పట్టించుకోకు. ృఢంగా ఉన్నా లేక పోయినా ఏదో ఒకరోజు గతిస్తుంది. అమృతం సహాయంతో ాడా దేవతలు భౌతిక వ్యాధుల నుంచి తప్పించుకోలేక పోయారు. రోగాలు శరీరానికి హజం. వాటి కెందుకు భయపడటం? కృష్ణుడి శరీరం కృష్ణుడి కర్పించు. అతడేం సుకుంటాడో చేసుకోనీ. రజస్తమో గుణాల్ని ఉద్రేకపరిచే ఆహారం తీసుకోకు. అంటే నర్థం ఈ ప్రపంచానికి సంబంధించిన ఏ ఆహారం తీసుకోవద్దని కాదు. మిఠాయిలూ ిటువంటివి, నీ కిష్టమయినవి తీసుకో. కానీ, అతిగా తినటం అభ్యంతరకరం. ిలాగే మరీ తక్కువగా తినటమూ అభ్యంతరకరమే. తినటం త్రాగటం హరించటమూ పరిమితం చేసుకో. వాటిని హద్దు దాటనీకు. వాటిని హద్దుల్లో

పెట్టే మంచి ఫలితాలు పొందుతావు. ఏ విషయం మీదా ఎక్కువ ధ్యాస పెట్టుకోకు, ఒకపని చేయటానికి భయపడితే ఆ విషయం ఆలోచించటానికి కూడా భయపడు. నీవు నిజంగా చేసినదానిని దాచటానికి ప్రయత్నించకు. మనస్సును బాధపెట్టే విషయాలకి నీవు దూరంగా ఉండాలి. బహిర్గతం చేయలేని విషయాల్ని విసర్జించాలి. ఏమైనా మిగిలినవారు కూడా నీలాగే ఉంటే ఎవరూ ఈ లోకాన్ని విడిచి స్వర్గానికి పోవాలను కోరు.

మీ
హర

# 34వ పత్రము

అత్యంత ప్రియమైన అమ్మా! (రాధికా బాబు భార్య)

అమ్మా! ప్రకృతిగురించి నీకు చెప్పటానికి నాకేమి తెలుసు? దాని విలువ, శక్తులలో అణువంత కూడా ఎవరూ వర్ణించ సమర్థులు కారు, ఇక అతిశయోక్తుల ప్రసక్తి ఏముంది? నిన్ను నేను ప్రేమిస్తున్నానంటే - ప్రేమించటం ఇష్టం కనుక, కాని నీ విలువల్ని గ్రహించి కాదు. నిన్ను తెలుసుకొనగల వారెవరూ లేరు. ఎవరన్నా ఉంటే అతడు కృష్ణుడు. ఆ ప్రకృతి ఎవరిదో అతనికే దాని శక్తి తెలుసు. బ్రహ్మాండంలో సృష్టింపబడిన ప్రతిదానికీ నీవు ఆధారమని నేను చూస్తున్నాను. నీవు సృజించి పోషించకపోతే ఏదీ ఉండజాలదు. అందుకే నీ శరణు జొచ్చాను. దేనికైనా విశ్వంలో నిజంగా ఉనికి ఉంటే, అది శక్తిమాత్రమే అమ్మా! నేను పురుషుణ్ణి అనే ఊహతో ఎంత పొగడుకొన్నా వాస్తవానికి నేను ప్రకృతిని మాత్రమే, మరింకేమీ కాజాలను. అమ్మా! బంగారం, వెండి, వజ్రం, కెంపు మొదలైనవి అన్నీ మట్టే. అలాగే నీవు, నేను, కుక్క, పిల్లి, చెట్టు, ఆకు, పురుగు, ఈగ, ఏవైతే కనిపిస్తున్నాయో అవి అన్నీ ప్రకృతిమాత్రమే, మరేమీకాదు. ఈ విశాల ప్రకృతితో (స్త్రీ ప్రకృతితో) ఆత్మగా తనని తాను సృజించుకున్న ఏకైక పురుషుడైన కృష్ణుడు (పురుష ప్రకృతి) నిత్యం అఖండ లీలలో ఉంటాడు. ఈ లీలకి ఆదిలేదు. అంతంలేదు శాశ్వతమైనది. ఇది మహా రాస. ఏకైక చైతన్య మూర్తియైన పురుషుడు లేక కృష్ణుడు ప్రకృతితో ఏదో రీతిగా క్రీడిస్తున్నాడు. ఈ లీల ఆగదు. అంతంలేనిది. బ్రహ్మ శివుడూ కూడా ఈ లీలా రహస్యం ఛేదించటానికి ఆలోచనా సముద్రంలో మునిగారు. కృష్ణుడు తప్ప వేరొకడెవడూ దాన్ని ఛేదించలేడు. శ్రీ కృష్ణుడికి, మహాప్రకృతి అయిన రాధికకీ తప్ప మరెవ్వరికీ దిగ్భ్రమ కలిగించే ఈ లీల పరమార్థం తెలియదు. మిగతా అందరికీ అది

అబోధ్యమే. ఏమైనా అమ్మా! అన్యథా భావించకు. నీ ఖేల నీకూ, నీవెవరికి తెలియ పరుస్తావో వారికీ మాత్రమే అవగత మవుతుంది. ఇతరుల కది అభేద్యం.

నీ కుమారుడు

హర

# 35 వ పత్రము

తమ్ముడూ అటల్ ! (అటల్ బిహారీ నాంది)

మా అమ్మ స్వస్థత చెందిందన్న సమాచారంతో నీవు వ్రాసిన ఉత్తరంచూచి నేను పొందిన ఆనందం హృదయాంతర్వర్తియైన ఆ భగవానుడికి మాత్రమే తెలుసు. ఆనందింపజేసే ఏశక్తి నీ ఉత్తరానికున్నదో తెలియదు. లేకపోతే నామనసెందుకంత ఉద్వేగడుతుంది? ఆనందస్రోతస్వినిని విశ్వాసంతో కొలిచేవాడూ ఆనందమే అవుతాడు. కనుక, సుఖంగాను, సంతోషంగాను ఉంటాడు. నామీద ఒక కన్ను వేసి ఉంచు. ఎల్లప్పుడూ నన్ను నీదగ్గర ఉండనీయవు కనుక నన్ను నీ హృదయంనుండి తొలగించకు. తమ్ముడూ ఎప్పటిదో పాత సంభాషణ మనస్సులో పెట్టుకున్నందుకు సంతోషం. కాని దాని గురించి అంతద్వేషమెందుకు? నా అటల్? యమునా నది సహజంగా క్రిందికీ అగాధసముద్రం వైపుకీ ప్రవహిస్తుంది. దానిని ఆపలేము. ప్రబలమైన సముద్రాకర్షణను చిన్న ప్రవాహం ఆపగలదా? అలా ఆకర్షితమై, ఎక్కడ పుట్టిందో ఆ అపార అగాధ వారిధిలో కలిసిపోతుంది. ఈ సమ్మేళనం ఏమాత్రం గోచరించదు. ఎవరు యమునానదీ సహజ ప్రవాహాన్ని ఆపగల సమర్థులు! ఇందుకు రెండు మార్గాలున్నాయి. ఒకటి- సముద్రాన్ని చలించకుండా సముద్రం ఆటూ పోటులను ఆప గలిగితే ఆ సముద్రాన్నుంచి ప్రభవించే నదుల ఆటుపోటులు ఆగిపోతాయి. నదులు నిశ్చలంగా ఉంటాయి. కాని తమ్ముడూ, సూర్యకిరణాలు సముద్రజలాన్ని ఆవిరి రూపంలో గ్రహిస్తాయి. ఆవిరి మేఘాల రూపంలోకి మారుతుంది. అలా సముద్రాన్ని తగ్గిస్తాయి. మళ్ళీ మేఘాలు వర్షాలుగామారి నదుల్ని నింపుతాయి, ప్రవహింపజేస్తాయి. ప్రకృతిసిద్ధంగా సముద్రం తగ్గిపోవటాన్ని ఆపటం అతి కష్టమేకాదు, అసలు అసాధ్యం. ఇందుకే మొదటి పద్ధతి ప్రకారం నదీ ప్రవాహాన్ని ఆపటం కూడా అసాధ్యమే. రెండవపద్ధతి నిజంగా సహజనదీ ప్రవాహాన్ని ఆపటం కాదు. అది చాలు. ఏమైనా సముద్రాన్నుంచి నదులు వాటి జలం తీసుకోకుండా ఉంటే మళ్ళీ సముద్రంలో నదులు కలవటం ఆపవచ్చు. దీన్నే ప్రవాహాన్ని ఎదురు

త్రిప్పటం అంటారు. మురళీధరుని మురళీరవళి సహాయంతో తప్ప ఇది సాధ్యం కాదు. శ్రీకృష్ణుని మురళీరవం వింటే యమున సరాసరి పుట్టుక స్థానానికి (ఎదురు) ప్రవహిస్తుంది. అటువంటి ప్రవాహమే దాన్ని పతనాన్నుంచి తప్పిస్తుంది. ఇది సహజం, కనుక ఇది అన్ని జీవులకీ వర్తిస్తుంది. అపార సముద్రం వంటి ప్రకృతి ఆజ్ఞతో ఉద్భవించాయి కనుక సహజంగా అవి దానివైపు పురోగమిస్తాయి, దానిలో లయిస్తాయి. ఏదీ దాన్ని ఆపలేదు. ఎప్పుడూ ప్రకృతికి విశ్రాంతి ఉండదు. అది దాని సహజలక్షణం, శక్తి. కనుక ఇందుకే తమ్ముడూ, జీవులు విశ్రాంతిగా ఎట్లా ఉంటాయి? ఓహో! ప్రకృతీ! ఘనురాలివి, నిజంగా ఘనురాలివి. నీ చిరునవ్వులు కన్నీళ్ళతో ఈ విశాల విశ్వంలో అందరి చిరునవ్వులు కన్నీళ్ళు తెలిసో, తెలియకో మిళితమై ఉన్నాయి. నీ శక్తి సామర్థ్యాలు అద్భుతం. తమ్ముడూ! అటల్! అపార సముద్ర ప్రబల హస్తాల నుంచి తప్పించుకోవటానికి ప్రకృతిని సైతం చేష్టలుడిగించి నిశ్చలం చేయగల శ్రీ కృష్ణుని వేణుగానం ఏకైక మార్గం. అందువల్ల సృష్టికి మూలకారణమైన ప్రకృతి పాదాల వద్ద మోకరిల్లి వేణుగానం వైపు మన చెవుల్ని ప్రయత్నించి మరల్చవద్దా? నిరంతరం రవళించే వేణువు, హృదయానందకరంగా నిరంతరం గోపికలు వింటున్న వేణువు ఆగిపోదు. ఆ గోపికలు తప్ప ఇంకెవరూ వినలేరు. జయదేవుడు ఆ రవళిని స్వయంగా వింటూ ఇలా వ్రాశాడు.

"నీ నామం చేస్తూ సందేశం నీ కందిస్తూ మురళి మార్దవంగా రవళిస్తోంది"

తమ్ముడూ! ఆ వేణుగానం ఆగదు. ఈ ప్రకృతికి సర్వసమర్పణమై ఆ గానం విను, ఆరోజు ప్రాప్తిస్తుందా? వ్రజలీలా విహారులైన మీరు ఇందుకు మనస్ఫూర్తిగా మొగ్గుతారా! తమ్ముడూ ఈ అపార సముద్రాన్ని కోరి కెలకకు. అగాధజలం ఏ కొంచెం కల్లోలం చెందినా పడవలు నలకల్లాగా అదృశ్యమవుతాయి. ఈ ప్రకృతి సముద్రం ఏ కొంచెం క్షోభించినా లక్షలాదిజీవులు నశిస్తాయి. కృష్ణుడు రక్షిస్తాడు మనల్ని. ప్రకృతీ! అనుగ్రహించు. ఆ భయంకర అగాధ సముద్రంలో మునిగే ఆట ఆడటానికి వెళ్ళనా? తమ్ముడూ భగవాన్! నీకు బాగా తెలుసు. ఇందుకే రామానంద్ గౌరాంగుడికి సమర్పణమయ్యాడు ఇలా అంటూ:

"మాయామయమైన నీఖేలలో ఎవరు మనోదారుఢ్యాన్ని నిలుపుకోగలరు? ప్రకృతి సముద్రంలో మనశ్శాంతిని నిలుపుకోవటం అతి కష్టం. ప్రకృతికి సమర్పణమవుతూ ప్రకృతి నాయకుడు, జగన్నాథుడూ అయిన కృష్ణుని దయని నిరంతరం అర్థిస్తూ ఉంటే అదృష్టవశాత్తూ గట్టి ఆలంబనం చిక్కవచ్చు. జంతువుగా, పక్షిగా, పురుగుగా,

ఈగగా, ఏ ఆకారంలోనైనా, ప్రకృతిరూపుదాల్చితే గౌరవదృష్టితో ఆమెని మనంచూడాలి. తమ్ముడూ భగవాన్! తమ్ముడూ బంధోపాధ్యాయా! ఈ రెండు విషయాలూ, అంటే ఈ అపార సముద్రంలో నిశ్చలంగా ఉండాలనే అలోచన, హాయిగా బ్రతుకుతున్నాననే ఆలోచన నేతితో తడిసిన ప్రత్తి ఉన్ని బట్టల్ని కప్పుకుని మండేమంటలో ఉండటమూ ఒకటే కాదూ! ఓ ప్రకృతీ! నిజంగా నీ శక్తి అమోఘం. దీన్ని గ్రహించే జయదేవుడన్నాడు, "కంసారిని ప్రాపంచిక వ్యామోహాలకి బంధించిన గొలుసు రాధ ప్రేమ. అతడు తన వక్షస్థలం మీద ఆమెని నిలుపుకొని వ్రజంలోని ఇతర సుందరుల్ని విడిచిపెట్టాడు."

గీత కూడా చెప్తోంది. "ప్రకృతిలో పురుషుడు వశించి ప్రకృతి జన్యగుణాల్ని అనుభవిస్తాడు." అప్పుడు ఇతరులెంత? పరబ్రహ్మే తెలిసి, ఆనందపూర్ణుడై ప్రకృతి సముద్రంలోకి జొచ్చి అలా ఈదులాడుతుంటే - మనమెంత? బూడిద! కనుక ఈ విశాల ప్రకృతిని ఎల్లప్పుడూ భయ భక్తుల్తో చూద్దాం. ప్రకృతి కృపతో అదృష్టవశాత్తూ ఒక రోజు అమహాప్రభువును పొందవచ్చు. ఆశక్తిని నాకూతురు, నాభార్య, నా సోదరి అనుకుని మోసపోకుండా ఉండాలని నా ప్రార్థన. ప్రకృతి ప్రతిరూపంలోనూ పూజనీయమైనదే. తమ్ముడూ భగవాన్! రాధారాణి కృపతో భక్తి ప్రేమ లక్షణాలు నీలో కనిపించాయని విని అపరిమితానందంలో ఓలలాడాను. ధన్యుడివి. మమ్మల్నికూడా అలా ధన్యుల్ని చేశావు. తమ్ముడూ భగవాన్! నాతల్లికి నా భక్తి పూర్వక నమస్కారాలు చెప్పు. ఆమె పాదాలపై దృష్టినుండి నన్ను చలింపచేయ వద్దని చెప్పు ఆపాదసీమే నాకు సురక్షిత శరణ్యం. అటువంటి గట్టి అండ మానావమానాలికి అతీతంగా నన్నుంచుతుందా? నా నమస్కారాలు అమ్మకి చెప్పి ఆమె పూర్తిగా కోలుకున్న సంగతి నాకు తెలిపి నన్ను సంతోషపెట్టు. బంధోపాధ్యాయ దంపతులారా! నా నమస్కారాల్ని దయతో అంగీకరించండి. మీరు మహాత్ములు. మీకు సాటి ఎవరూలేరు. నన్ను దయచేసి జ్ఞాపకముంచుకోండి. నేను అతి పేదవాణ్ణని నన్ను మర్చిపోకండి.

నవకుమార్‌కు నాప్రేమ నందించు, నా హృదయానురాగాన్ని శారికి అందించి ఆమెని చూడాలని ఉన్నదనిచెప్పు. ఏమైనా ప్రతిదీ కాలంమీద ఆధారపడిఉంది. సమయం వచ్చినప్పుడు కోరికలు తీరతాయి. దేనిమీద కోరిక పెట్టుకోకూడదు. కోరికలు సంకెళ్ళువేస్తాయి. కాని కృష్ణుని పై కోరికలు ముక్తినిస్తాయి. శారిని ఇంకా ఇంకా అభివృద్ధి సాధించేందుకు, నామీద ఒక దృష్టి ఉంచేందుకు ప్రోత్సహించండి.

తమ్ముడూ భగవాన్! ఈసారి నీ ఉత్తరం చెప్పలేనంత ఆనందంలో ముంచివేసింది. మళ్ళీ నా ప్రాణాన్ని ఆత్మని జీవింపజేసింది. నా అపవిత్ర శరీరాన్ని శుద్ధి చేసుకోవటానికి నీ పవిత్రదేహాన్ని కౌగిలించుకోవాలని నిరంతరం తపిస్తున్నాను. అదృష్టవశాత్తూ ఒక మేఘం గోచరించినా, దురదృష్టవశాత్తూ అది అతివేగంగా దూరంగాపోతోంది. తమ్ముడూ భగవాన్! ప్రేమించటానికి ప్రియురాళ్ళున్నవాళ్ళు ఇక్కడికీ అక్కడికీ ఎందుకు పరుగెత్తుతారు? అనేక నూతన విరుద్ధ తరంగాలు హృదయాన్ని క్షోభింప జేస్తున్నాయి. అనేక క్రొత్త ఆలోచనలతో నింపుతున్నాయి. తమ్ముడూ! చూడాలి చూపించాలి అనే కోరిక ఎందుకలా తీరకుండా ఉండిపోయింది? నీ మురళీధరుడు విరహబాధ అనుభవించటానికి అంత ఇష్టపడతాడా? అతను నా దగ్గర నిల్వడు, నన్నాతని దగ్గర నిల్వనీయడు. తమ్ముడూ నేను పాపాత్ముణ్ణి కావటంవల్లా అది? అయితే నీతో ఎలాకలిశాను? తమ్ముడూ నీ దురదృష్టపు అన్నని పరాయివాణ్ణిగా చూడవద్దని నీ నల్ల బంగారంతో చెప్పు. నన్ను తలిస్తే, నీ 'వంక' (వ్యత్యస్తపాదారవిందుడైన కృష్ణుడు) తో నన్ను అతని సేవకులలో ఒకడిగా ఎంచుకొనమని, నాజీవితాన్ని సఫలం చేయమనీ చెప్పు. నేను పూర్తిగా అనర్హుణ్ణి. మీరంతా నా ఆశలు. మీ సహాయ సహకారాలతో నా వాంఛిత మీడేర్చుకొంటాను. నా జీవితం సఫలమైందనుకొంటాను. తమ్ముడూ ఆరోజెప్పటికైనా వస్తుందా? నాకటువంటిరోజు వ్రాసిపెట్టి ఉందా? నా స్నేహితురాలు సుదేవి వగైరా ఎప్పుడూ నన్ను తలుస్తున్నారా? నీకు తెలుసు. తమ్ముడూ భగవాన్! రాధా కుండంలో ఒకసారి మునిగితే తప్పకుండా మార్పువస్తుంది. మామూలు మార్పుకాదు. అనంతమైన పూజలవల్ల సాధ్యం కానివి ఒక్కసారి రాధాకుండంలో మునిగితే సాధ్యమవుతాయి. తమ్ముడూ! నీ నాటకసూత్రధారి గాఢ నీల మేఘశ్యాముడు రాధా విరహ బాధను భరించలేక రాధా కుండంలో మునిగి కొంచెంసేపటికి పైకిరాగానే అతని నల్లని శరీరం బంగారు కాంతితో మెరిసిపోవటం నీకు జ్ఞాపకంలేదూ? ఇది శ్రీమతి ముందు విదేశవనితలా కనిపించేందుకు అనుకూలించింది. రాధా కుండంలో ఒక్కసారి మునిగేసరికి కృష్ణుడు తన నలుపు రంగు గౌరవర్ణంగా మార్చుకోగలిగినప్పుడు, నీ మనస్సు నిర్మలమై పవిత్రమైన ఆలోచనల్ని భావించటంలో వింత ఏమిటి? రాధా కుండ జలాన్ని కేవలం తాకగానే గౌరాంగ ప్రభువు ఆనందాతిశయంతో ఒళ్ళు మరిచిపోతే, దానిలో స్నానంచేయటం వలన నీవు అపరిమితానందం పొందటం ఏమీ వింతకాదు. రాధా కుండ స్ఫురణే మనస్సుని హృదయాన్ని ఉద్విగ్నం చేస్తుంది, శరీరాన్నిపులకాంకితం చేస్తుంది. దానిలోస్నాన ప్రభావం ఏమిటో ఎవరికితెలుసు?

తమ్ముడూ హరీ! నీవు ధన్యుడివి, రాధా కుండ విహారికి ఆప్తమిత్రుడివి. దురదృష్ట వంతుణ్ణి, రాధాకుండాన్ని నేనేమి అర్థం చేసుకొంటాను! రాధా కుండంలో స్నానం చేసినా నీ మనస్సు ప్రభునామస్మరణవైపు పురాణగ్రంథ పారాయణకి ఎందుకు మొగ్గదు? నీవే చెప్పగలవు. నన్నెందుకడుగుతున్నావు తమ్ముడూ! నేను పూర్తిగా మూఢుణ్ణి, దురహంకారంతో చంచలమనస్కుడిని. అటువంటి ప్రశ్న నావంటి మూఢుణ్ణి అడగటం సబబేనా? నీఖేల నీకే తెలుసు, నీ వాడికి తెలుసు. భక్తమాలలోని గోవింద చరితలో ఒకపాట ఉన్నది. దాని అర్థంనాకు తెలియదు. కేవలం అది చదివాను. అది ఇలా సాగుతుంది.

"ఓ మనసా! శరణ్యమైన నందతనయుడి పాదపద్మాన్ని సేవించటంలో మగ్నమైవుండు. శ్రవణం, కీర్తనం, అతని గుణస్మరణం, పాదసేవనం, శ్రీరాధా మాధవుని అర్చనం, శరీరాత్మల్ని అతనికి సమర్పించటం మొదలైనవి గోవిందదాసు కోరుకొనేవి".

బహుశా అందుకే నీ మనస్సు నామస్మరణకి పురాణ గ్రంథ పఠనానికి నియమితంకాదు. పసికందు పెరిగి పెద్దదైన తర్వాతకూడా కేవలం తల్లిపాలమీదే ఆధారపడగలదా? ఆధారపడుతుందా? ఆహారం మార్పుతో బుద్ధులు కూడా మారతాయి. బహుశా అదే మార్పు నీకూ వచ్చింది. తమ్ముడూ హరీ! అటల్! నా ప్రాణం! పూజశ్రీ బంధోపాధ్యాయా! శ్రీమతి మొదట వేణుగానం విన్నది. తర్వాత కృష్ణనామం విన్నది. తర్వాత అతని శృంగార మూర్తిని దర్శించింది. చివరికి అతణ్ణి స్పృశించి మహదానందం పొందింది. అతనినామం విన్నప్పుడు అతని వేణురవం కోసం తహతహ లాడిందా? అతని మనోహరాకృతి దర్శించిన తర్వాత కేవలం అతని నామమే ఆమెని సంతృప్తి పరచగలిగిందా? అతని స్పర్శసుఖం అనుభవించిన తర్వాత అతని మనోహరమూర్తి పై కేవలం ధ్యానంతోసంతృప్తి పడగలిగిందా? చరితామృతంలోను, వివర్త విలాసంలోనూ ఇలా చెప్పబడింది- 'గోపికలు యోగీశ్వరులు కారు, వారు నీ పాదపద్మ ధ్యానంతో సంతృప్తి చెందుతారా?" వారతణ్ణి స్పృశించి నప్పుడు కేవలం అతనిధ్యాసలో ఎందుకు సంతృప్తిపడి ఉండాలి? బహుశా నీపరిస్థితీ అదే అయుండవచ్చు. ధన్యుడివి, ముమ్మాటికి ధన్యుడివి. తమ్ముడూ! ఎప్పుడూ నేనొక ఇనుపముక్కలాగా ఉండకుండా అప్పుడప్పుడు ఆమార్గం చూపించి, నన్ను ముగ్ధుణ్ణి చెయ్యి. నామాన్ని నామంకోసం తీసుకోకు. అది అతని నామమని మనస్సులో పెట్టుకో. పురాణాలు చదవవలసివస్తే అతని గుణమాహాత్మ్య వర్ణనలున్నాయని మనస్సులో అత్యధిక గౌరవ భావంతో చదవటంలేదూ? హృదయానికి

అతిప్రియమైన మాటలు వినవలసివస్తే అవి ఏకాంతంలోవినాలి. ఇది గ్రహించు తమ్ముడూ. వివాహానికి ముందు తనకి నిశ్చయించబడిన భర్తపేరు చెప్పితేచాలు భార్యసంతోషపడుతుంది, పెండ్లి తర్వాత నూతన వధూవరులు కలిస్తే భార్య భర్తరూపం తలుస్తుంది, రహస్యంగా అతనిపేరు తలవటానికి అతని గొప్పదనాన్ని గురించి మాట్లాడటానికి ఎంతో ఆనందిస్తుంది. పరిచయం మొదట ప్రాప్తించగానే తన భర్తని గురించి ఇతరులు మాట్లాడుకొంటుంటే ఎవరూచూడకుండా వినటానికి మహదానంద పడుతుంది. పరిచయం గాఢమైన తర్వాతకూడా అది ఆమెకి అంతయిష్టంగా ఉంటుందా! ఉన్నప్పటికీ తనప్రేమ మూర్తికి సంబంధించిన విషయంకనుక ఉంటే ఉండవచ్చు. కాని క్రమంగా తగ్గిపోయి, చివరికి ప్రేమ ప్రగాఢంకాగానే పూర్తిగా మాయమవుతుంది అంటాను. ఇదంతాపోనీ ఎందుకు, పిచ్చివాడి ప్రేలాపనలకి హద్దుండదు. ఈ సముద్ర కెరటాల్ని లెక్కపెట్టడం అసాధ్యం. ప్రభువు ఆరోజు అనుగ్రహిస్తే మనమంతా ఆ సముద్రంలో మునిగి ఆనందం అనుభవిద్దాం. ఏమైనా ఈ మాత్రంచెప్తాను. దురదృష్ట వంతుడినని నన్ను విడిచిపెట్టకు. అప్పుడప్పుడు నన్ను తలుస్తూ ఉండు.

మీ

హర

## 36వ పత్రము

తమ్ముడూ హరీ!

(హరిదాస ముఖోపాధ్యాయ)

చాలాకాలం తర్వాత నన్నుగురించి ఆలోచించావు. నన్ను మనస్సులో పెట్టుకున్నావు, చాలు, ఇతరుల గురించి ఆలోచించటానికి నీకు తీరిక ఉన్నదా? "ఒక్క చంద్రుడే చీకటిని పారద్రోల తాడు" ఇలా వ్రాయటంలో నీ ఉద్దేశం ఏమిటి! నీవు యోగ్యుడివి కనుక, దయతోనో. బలవంతంగానో శ్రీకృష్ణుడు నిన్నంతదూరం నుంచే ఆకర్షించి వ్రజానికి కాపలా ఉంచాడు. ఇంతకుమించి అదృష్టం ఏమి ఉహించగలం? శత్రువు చేతుల్నించి తప్పించుకునే మార్గాలు - ఆ శత్రువు బలహీనుడైతే అతన్ని నాశనం చేయటం గాని, లేక తన వశం చేసుకోవటంగాని, అతను బలవంతుడైతే అతన్నుంచి పారిపోవటం. ఈ రెంటికి మించి మూడవమార్గం నేనూహించలేను. కనుక ఒక శత్రువునుంచి వచ్చే ఉపద్రవంనుంచి ఎవరైనా క్షేమంగా

ఉండదలిస్తే మనసా వాచా కర్మణా అతనితో సంబంధాలన్నీ త్రెంచివేసుకోవాలి. ఎవరైనా లాలసనుంచిగాని, క్రోధంనుంచిగాని, మరింకే శత్రువునుంచిగాని, తప్పించుకోదలిస్తే - ఆ పరిసరాలవంకకి కూడా దృష్టిసారించకూడదు. వ్యక్తి గత ప్రయత్నాలు ఇంతటితో అంతమవుతాయి. ఇంతకుమించి కరుణాళువైన కృష్ణుణ్ణి ఆశ్రయించటం అతన్ని శరణువేడటం అవసరం. కృష్ణుడి పేరు వింటూనే శత్రువులందరూ అల్లంతదూరం పారిపోతారు, ఎందుకంటే అతనంటే వాళ్ళందరికి హడలు. అందుకని, అజేయులైన ఈ శత్రువుల నుండి ఎవరైనా క్షేమంగా ఉండదలిస్తే - అతడు కృష్ణ నామంలో నిమగ్నం కావాలి. అతడన్ని భయాలనుండీ విముక్తుడవుతాడు. ఎంతోకాలం నుంచి పాతుకుపోయిన ఈ శత్రువులు (భయభ్రాంతులైతే) ఆయుధాలతో ముట్టడింపబడితే వెంటనే నీ శరణు కోరతారు. భగవన్నామ శక్తి సర్వాన్ని సమకూర్చ గల సమర్ధమైనది. భాగవతంలో దీనికి ఇలా చెప్పబడింది.

“ఓ రాజా? కలియుగం దోషార్ణవమైనప్పటికి, ఒక గొప్ప అర్హత కలిగి ఉంది, ఏమిటంటే - కేవలం శ్రీకృష్ణనామస్మరణే, బంధాల్ని ఛేదిస్తుంది, దాంతో అంతిమ లక్ష్యం ప్రాప్తిస్తుంది”.

అందుకని ఇటువంటి భయంకరాయుధం మరొకటిలేదు. నిరంతరం నామంలో మగ్నమవటం సకల భయాల్నితొలగిస్తుంది. ఇందుకు శ్రీ చైతన్య ప్రభువు1. భూతదయ 2. నామస్మరణానురక్తిని పెంపొందించు కోవటం 3. వైష్ణవసేవలను బోధించాడు.

ప్రతి వారు ఈ బోధనలను శాయశక్తులా అనుసరించటం కర్తవ్యం. మొదట సర్వభూతాల యెడ దయ జూపటంతో ప్రభు నామంపై అనురక్తి కలుగుతుంది. నామం చేయటం సాగిస్తే గురువుల దయ ప్రాప్తిస్తుంది, ఇది సాక్షాత్తు కృష్ణునికృపని మించిన విలువ గలది. కృష్ణ ప్రాప్తితో ముక్తి సిద్ధిస్తుంది. కాని కృష్ణభక్తుని ఆదరం పొందితే కృష్ణుని పొందవచ్చు. కనుక, కృష్ణభక్తుని సమాగమం కృష్ణ సమాగమాని కంటె ఎంతో విలువైనది. నిరంతరనామ జపంతో మాత్రమే భక్త సమాగమం ప్రాప్తిస్తుంది. కనుక ఎప్పుడూ నామంలోమునిగి ఉండు.నామస్మరణ ఫలాన్ని నిర్ణయించటానికి ప్రయత్నించకుండా రాత్రింబవళ్ళు దానిలో మగ్నుడవై ఉండు. నీవు ఎప్పటికీ సంతోషంగాను. సంతృప్తిగాను ఉంటావు. నీ ఈ దురదృష్టవంతుణ్ణి మర్చిపోకు.

నీ

హర

అమ్మా! నా అంత అదృష్ట వంతుడెవరు? ఎటుతిరిగినా నీరూపమే కనిపిస్తోంది. ఆ మెరిసే నల్లనిరంగు, నడిమోస్తరు ఆకారం, వాత్సల్య పూరితమైన విచ్చుకున్న నేత్రాలూ ఎప్పుడూ నా కళ్ళకి కట్టి నన్నానందంలో ముంచుతాయి. రెండు రోజుల క్రితమే నీ ఒడిలో కూర్చుని పెదవుల మీద నవ్వుతో, ముంగురులు మొహాన పడుతుంటే ఎంత ఆడుకున్నాను? అనుభవించిన వాడికి తెలుస్తుంది ఆనందం. అప్పుడప్పుడు నీ నల్లని కళ్ళు నన్ను భయపెట్టాయి. అప్పుడప్పుడు నవ్వటానికి ధైర్యం తెచ్చుకొంటాను. అమ్మా! ఎవరికి తెలుసు నీ కళ్ళలో ఏమున్నదో ! నే నిప్పుడు నీ ముద్దుల బిడ్డ నయ్యాను. నిజమమ్మా. నాకు కులంలేదు. గౌరు నాకు అది లేకుండా చేశాడు. కులం, వంశం, అంతస్థు, సిగ్గు, భయం నాకులేవు. నేనుపూర్తిగా పిచ్చివాణ్ణి. కలకత్తా కాలేజీలో ఉన్నప్పుడూ అంతే. కాలేజీ సమయం ముగిసిన తర్వాత, అందరూ వెళ్ళి పోయిన తర్వాత నిద్రపోతున్నట్లు నాసీట్లో కనిపించే వాడిని. చప్రాసీలు గది తలుపులు మూయటానికి వచ్చి ఇంకా ఎందు కున్నావని అడిగే వారు. నిద్రనుంచి లేచినట్లుగా లేచి, సిగ్గుపడి బైటపడేవాడిని. ఇంచుమించు అన్నీ పోగొట్టు కున్నాను. ఇంకా ఏమైనా మిగిలిఉంటే అదికూడా పోవాలని నన్నాశీర్వదించమ్మా. ఏఆట ఆడించేందుకు నన్ను ఇక్కడికి తీసుకు వచ్చాడో ఆ లీలా కృష్ణుడికే తెలుసు. అతనిఆజ్ఞని మీరలేకుండా ఉన్నాను. ప్రతిబిడ్డకీ ఒకతల్లి. కాని, నాకు అనేకమంది తల్లులు. నే నంత అల్లరివాడిననా అంతమంది తల్లులమధ్య ఉంచ బడ్డాను? అతని దివ్య సంకల్పం అర్థం కాదు. అతనికే తెలుసు. కాని ఆ దయామయుడు నాపట్ల దయగా ఉన్నాడు, అలాగే ఉంటాడు అనిపిస్తోంది. అమ్మా 'కన్న'సాధువు పెట్టే దలియా (గోధుమపాయసం) తీసుకోవద్దని చెప్పావు. కాని ఏంచేయను? యశోదమ్మ కూడా ఏమాత్రం నిర్లక్ష్యం చేయలేదు, బృందావనం విడిచి గోకులం వరకు వెళ్ళింది. కాని కృష్ణుణ్ణి అరికట్ట లేక పోయింది. అతణ్ణి ఒకగదిలో పడేసి అదుపులో పెట్టగలిగేదా ఆమె? అంతఅదుపు లేకపోయినా యశోద ఎప్పటికీ అతణ్ణి కోప్పడలేదు. అందుకని అమ్మా నేను తప్పుచేసినా నీవు అపరాధంగా భావించవద్దు అని నాప్రార్థన. నాతల్లి వాత్సల్యంలో నేనెల్లప్పుడు ఉండాలని నాప్రార్థన, నా ఆశ.

అమ్మా కృష్ణుని వాంఛించేవారికి పాపపుణ్యాల మీద భీతి ఉన్నదా? ఎక్కడ నుంచి పాపపుణ్యాలు సంపాదించగలరు? కృష్ణుడి రాజ్యంలో పుణ్యానికీ పాపానికీ స్థానంలేదు. బృందావనం పుణ్యపాపాలు ప్రవేశించలేని బ్రహ్మానంద నిలయం. ఎందుకమ్మామరి "తప్పుచేస్తాను" "తప్పుచేస్తాను" అని మళ్ళీ మళ్ళీ వ్రాస్తావు?

మోసపోయిన వాడిని మళ్ళీమోసంచేయకు. పాపపుణ్యాల్ని నిర్ణయించే అధికారం మనకి లేదని నామనవి. కృష్ణుని కృపతో వాటికతీతంగా ఉందాము. పాపపుణ్యాలని పట్టించుకునే వారిని వాటిని నిర్ణయించుకోనీ. ఆరెండింటితో మన కేమిటిపని? నీవుపట్టించుకోకు. పాపమనేది లేదు. నీ నీడపడితే పుణ్యం వస్తుంది. అంతదూరాన్నుంచే పాపం పారిపోతుంది. భయంలేదు.

లాలసలోకి ఎగిరి పోతున్నట్లు వ్రాశావు. దానిగురించి ఆందోళన పడకు. ఈ చిలిపి కుర్రవాడితో వేగేసరికి ఎన్నోసార్లు నీవు ఉద్రేకపడవలసి రావచ్చు. ప్రేమకి పదును పెట్టేది లాలస. ఎలా కత్తులు మొదలైనవి మొండివైనప్పుడు పదును పెట్టాలో అలాగే లాలస ప్రేమకి సానరాయి. లాలసను దాచలేము, ముఖంమీద కనిపిస్తుంది. మృగమదం యొక్క ప్రత్యేకత అదే. అడ్డుపెట్టే మృగమదసౌరభం ఆగుతుందా? అలాగే లాలసలో ఉన్నవాడు తనంత తాను చెప్పుకోపోయినా బయటపడి పోతాడు. అమ్మా నీవు పూర్ణ లాలసవు. నీతో ఉండి నాలౌకిక లాలసలని నీపార లౌకికలాలసతో మార్చు కుంటాను. తెలివితక్కువ పిల్లల్ని శిక్షించటానికి తల్లివెనుకాడుతుంది. నా విషయంలో నా ఉపాధ్యాయులు దయామయులు. వారు నీవుచూపించినంత దయ చూపించరనుకో, నేను నేర్చుకోనపుడు శిక్షిస్తారు. లాలస నేర్చుకోవటానికి, మర్చిపోవటానికి వారి భయంనుంచి ఒకరోజు తప్పించుకొంటాను. దీన్నిగురించి వారికి సరైన సూచనలు ఇవ్వు. ఈబడికి అన్ని వస్తువులూ సిద్ధంగాపెట్టు.

నీ గారాబు పిల్లాడు

హర

## 39వ పత్రము

ప్రియాతి ప్రియమైన అమ్మా !

నీ వాత్సల్య పూరితమైన ఉత్తరం అందింది. దరిద్రుడి దురదృష్టం ఎంత బలవత్తరమైన దంటే అతనికి నీరు అవసరమైనపుడు సముద్రంకూడా ఎండిపోతుంది. అదీ ఈరోజు నాస్థితి. దయతో జాగ్రత్తగా నీ ఉత్తరంలో పంపిన పరమ పూజనీయమైన బృందావనధూళి ఎండిపోయి మాయమైంది. ఏమైనా ఉత్తరాన్ని తలపైనా ముఖంపైనా పెట్టుకొని పరిపూర్ణంగా పవిత్రుణ్ణయ్యాను. అమ్మా, చాలాకాలం తర్వాత నీవు బాగున్నావని విని నేను ఎంత ఆనందించానో హృదయాంతర్వర్తియైన ఆభగవానుడికే తెలుసు. నీ ఆజ్ఞానుసారం బృందావన పవిత్ర ధూళికి రాణీ అయిన రాధారాణి

మంచుతెర తొలగించి మార్గాన్ని సుగమం చేసిందమ్మా. త్రోవపొడవునా మంచు కప్పబడిపోవటంతో అగమ్యమై 11,12 రోజులుగా టపాలేదు. నీ ఉత్తరం బట్వాడాతో మళ్ళీ యధాస్థితికి వచ్చింది. ఒక్క రోజుకూడా త్రోవలో ఆలస్యంకాలేదు. మిగిలిన ఉత్తరాలు కూడా నీ ఉత్తరంతో బాటు వచ్చేశాయి. కొన్ని 10 రోజులు, మరికొన్ని 12 రోజులు పట్టాయి గమ్యంచేరటానికి. బృందావన పవిత్రధూళి ప్రభావం, నీ వాత్సల్యశక్తి అంతగొప్పవి. హనుమంతుని తల్లి అంజన అడ్డమున్న పర్వతాల మధ్యనుంచి ఆకాశమార్గం గుండా ధారాపాతంగా తన స్తన్యాన్ని పంపి కొడుకును పోషించింది. అమ్మా నీ విప్పుడు ఈ పర్వత శ్రేణులగుండా, ఈ మంచుగడ్డల గుండా నీ స్తన్యాన్ని ధారగా కురిపించి నీకోతి పిల్లాణ్ణి పోషిస్తున్నావు. నన్ను నేను మహా అదష్టవంతుణ్ణిగా భావించుకొంటానమ్మా. ఎల్లప్పుడూ నాయెడల దయగా ఉండు.

నీ ముద్దుల కొడుకు

హర

# 40వ పత్రము

ప్రియమైన చిరంజీ లాల్ సాహిబ్,

నీ ఉత్తరంలోని విషయాలు చదువుతున్నప్పుడు నేను పొందిన ఆనందంలోని ఒక చిన్న అంశాన్నైనా వ్యక్తీకరించటం నాశక్తికి మించినపని. నీ శీఘ్రాభివృద్ధి చూచి ఎంతో సంతోషించాను. ఇలాగే ముందుకుసాగు. సంతృప్తుడివవుతావు. తల్లిని ప్రేమించటం నేర్చుకో. అదిమాత్రమే నీకు శాశ్వతా నందాన్ని కలిగించి, నిన్ను అత్యంత ప్రియమైన సాధు సంగమానికి జేరుస్తుంది. తల్లులు మనవలె మర్త్యులని భావించకు. మానవరూపంలో ఉన్న దేవతలు వాళ్ళు. ఈ విశ్వమంతా తల్లుల రాజ్యం. ఆమెసర్వ సృష్టికీ అధీశ్వరి. తల్లులు మారు వేషంలో ఉన్న దేవతలు. ఇప్పుడు మీ అమ్మ నీ మీద అనుగ్రహంతో ఉన్నదని భావిస్తాను. శీఘ్రంగా సమయానికి పొందిన నీ యీ అభివృద్ధి దాని ఫలితం. నా నమస్కారాల్ని మీ అమ్మకు, నీ ప్రియమైన భార్యకు అందించి, నా పట్ల వాత్సల్యంతో ఉండమని కోరు. వాళ్ళే నాకు ఆశ, ఆధారం, ముఖ్యాశ్రయాలున్నూ. వాళ్ళ ప్రత్యేక శ్రద్ధలేకపోతే ఈ ప్రపంచంలో నా కాస్తిక్యమే లేదు. నీ భార్యకూడా నీ పట్ల అత్యంతానురాగంతో ఇప్పుడు ఉన్నదని గ్రహించాను. ఎప్పుడూ ఆమెను ఆనందంగా ఉంచటానికి ప్రయత్నించు. మిత్రమా, ఈరోజు ఇంకా కొంచెంచెప్ప బోతున్నాను. నీకదిపూర్తి ఆమోద యోగ్యంగా ఉంటుందని ఆశిస్తాను.

మిత్రమా, మానవుడు భౌతిక, ఆధ్యాత్మిక ఆహారాలవల్ల బ్రతుకుతాడని నీవు గ్రహించాలి. లోపలి ఆత్మమనుగడకు ఆధ్యాత్మికాహారం, స్థూల శరీరపోషణకి భౌతికాహారం అవసరం. ఇప్పుడు నీవు భౌతికాహారం నీ కుద్యోగం కల్పించిన వారినుండి సంపాదించు కొంటున్నావు. అందుకని నీ శరీరంతోనూ, తెలివి తోనూ వారిని సేవించు. కాని నీ ఆత్మని దేవదేవుడైన కృష్ణునిసేవలో ఉంచు, అలా అయితేనే ఆత్మశక్తులూ, సహకారాలూ సంప్రాప్తిస్తాయి. ఆత్మతో ఆత్మని సేవించు. భౌతికాన్ని భౌతికంగా సేవించు. భౌతిక పదార్థాల్ని ఆత్మతో సేవిస్తే అనతి కాలంలోనే నీ ఆత్మ భౌతిక పదార్థంగా మారుతుందని గ్రహిస్తావు పదార్థంతోనూ అంతే. నిరంతరాత్మాను సంధానంతో పదార్థం పునీతమై ఆత్మగా మారుతుంది. ఇందుకోసమే భగవంతుణ్ణి మనసా, వాచా, కర్మణా సేవించమని శాస్త్రాలు చెప్తున్నాయి. భౌతిక సహాయ సంపత్తులాశించే వారికి వాటిని అందించు. పదార్థంతో - ఆకలిగొన్నవారికి అన్నంతో, దిగంబరులికి వస్త్రాలతో, బీదవానికి ధనంతో. కాని, పతితుల్ని ఆత్మతో వారి ఉన్నతి నాకాంక్షించు. వారికోసం కృష్ణుణ్ణి ప్రార్థించు. లోకైక నాథుడైన కృష్ణుణ్ణి పొందేమార్గం వారికి బోధించు. పతితులికి లౌకిక సహాయాలు అత్యల్ప సహాయం మాత్రమే చేస్తాయి. పతనమైన వారి ఆత్మని పోషించే ఆధ్యాత్మికాహారం వారికి కావాలి. కృష్ణుడి తర్వాత తల్లి ఈ ఆధ్యాత్మిక శక్తులకి సహకారాలకీ నిలయం. వీటి అవసరం ఎప్పుడువచ్చినా నీతల్లి దగ్గర అవిగ్రహించు. నీతల్లిని సంతోషపెట్టటానికి ప్రయత్నించు. అప్పుడామె నీకేమికావలిస్తే అది అను గ్రహిస్తుంది. తల్లి తర్వాత భార్య అని గుర్తించు. ఆమెకూడా నీకన్నివిధాలా సహాయం చేయటానికి వెనుకాడదు.

మధురమూ మహాశక్తి వంతమూ అయిన కృష్ణ నామాన్ని మరువకు. స్వప్నంలోకూడా నామస్మరణ చేయటానికి ప్రయత్నించు. నామస్మరణే ముక్తికిమార్గం. నీకు సమయం దొరికినపుడు కృష్ణలీలలకి సంబంధించిన పుస్తకాలు చదువు. అనవసరంగా సమయం వృధాచేయకు. గతించిన రోజు ఎప్పటికీ గతించినట్లే. ఈ బ్రహ్మాండంలోని ఏ సంపదా దాన్ని వెనుకకి పిలవలేదు. ఎప్పుడూ ఆర్తులకి సహాయంచేయి. ఆర్థిక సహాయం నీశక్తికి మించితే ఆర్తుల్ని కనీసం తీయని చల్లని మాటలతో నైనా సంతోషపెట్టు. పాపుల్ని అసహ్యించుకోకు. జాలిపడు. శాశ్వతానందానికి మార్గాన్ని వారికి చూపటానికి ప్రయత్నించు. సాధువులికి సర్వదా సహాయ కారివిగా ఉండు. వారి గుణశీలాల్ని ఎంచకు. వారి కష్టాల్ని తగ్గించటానికి హృదయపూర్వకంగా, ప్రాణాధికంగా (శాయశక్తులా) ప్రయత్నించు. రక్షకభటులు ప్రజలకి ప్రభువులకి మధ్యవర్తులని జ్ఞాపకం పెట్టుకో. కనుక, రక్షకభటులు చట్ట

బద్ధంగాగాని, చట్ట విరుద్ధంగాగాని, పేదప్రజలమీద ఏజులుమైనా చెలాయించవచ్చు. బుద్ధి పూర్వకంగా గాని, అన్యధాగాని ఈ బీదప్రజల్ని అణగద్రొక్కటానికి ప్రయత్నించకు. ఈ ప్రపంచములో ఏ పదార్థమూ శాశ్వతం కాదనీ, ఇక్కడ చేసిన పనులిక్కడే అంతమౌతాయనీ జ్ఞాపకముంచుకో. కాని మంచీ చెడ్డ పనుల ఫలితాలు చేసిన వాణ్ణి ఎల్ల ఎడలా అనుసరిస్తాయి, కష్టానికీ సుఖానికీ కారణమౌతాయి. మాట్లాడే ముందు, పనిచేసేముందు నీ మాటల్నీ చేతల్నీ యోచించు. ఎప్పుడూ పరుషాల్ని నోటినుంచి రానీయకు. నీ చేతులమీదుగా దుష్కర్మల్ని, క్రూరకర్మల్నిచేయకు. అప్పుడు శాశ్వతానందం నిరంతరం నిన్నంటి ఉంటుంది. మళ్ళీ నిన్నర్థిస్తున్నాను. కృష్ణుణ్ణి, అతని మధుర నామాన్ని మర్చిపోకు. మేమంతా ఇక్కడ క్షేమం.

నీ మిత్రుడు

హరనాథ్

# 41వ పత్రము

ప్రాణప్రియా !

మనోహరమైన ఉత్తరం అందగానే అమితానందాన్ని అనుభవించాను, హృదయం తేలిపోయింది. ఇంత మధురాతి మధురంగా ఉండటానికి ఏ మధుర రసాయనంతో దాన్ని తీర్చిదిద్దావో తెలియదు. మిఠాయిలు చేస్తావు కనుక నీకాపద్ధతి తెలుసు. పూర్తిగా తెలియనివాళ్ళము, నేర్పులేని వాళ్ళమూ మాకెట్లా తెలుస్తుంది? ప్రియా! నీవు పరిపూర్ణురాలివి. మంచి అను, చెడ్డఅను, నీలో ఒక ప్రత్యేకత ఉన్నది. చెప్పమంటావా, నీవు కపటివి. ఎవరికీ పూర్తిగా అర్ధంకావు. నీ శక్తి అమోఘం, ఎంత ఎక్కువ నిన్నర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తే నీ వంత కపటంగా ఉంటావు. సహజంగా సరళమైనదానివి, నీ కాపట్యం ఒక ప్రత్యేకలక్షణం. దాన్ని వదులుకోవు.నిజం, నీవు సర్వం సమర్పిస్తావు. నీ మనస్సు, హృదయమూకూడా, కాని దీన్ని వదలవు. నాకదేకావాలి. మరేమీవద్దు. ఇప్పుడు నన్నర్థం చేసుకున్నావు. నాకిచ్చేయి. దయజూడు.నిన్ను ప్రశాంతంగా ఉండగా సంతోషించనీ, నీయీ వింతగుణాన్ని గురించి కృష్ణుడు దీర్ఘంగా ఆలోచిస్తూ మూడువంకర్లు తిరిగాడు. ఇంకానిన్నర్థం చేసుకోలేక, గౌరాంగుడుగా రాధా నామం తన అధరాలమీద ఆడుతూంటే రోదించాడు. నీకు తెలుసు గౌరుని ఎట్లా ఏడిపించాలో. మరెవ్వరికీ ఆశక్తి లేదు. నీకొక్కదానికే తెలుసు గౌరుని ఎలా ఏడిపించాలో, నవ్వించాలో. నీలో ఏముందో, గౌరు ఎందుకు ఏడుస్తాడో

తెలియదు. అదేనాకుకావాలి. నేనూ ఏడవాలనుకుంటున్నాను, నీకు తెలుసు అదేమిటో. అతనికీ తెలుసు, అదెవరికి బహిర్గతం చేస్తావో వారికీ తెలుసు. అందుకని ప్రార్థిస్తున్నాను, నన్ను తెలుసుకోనీ, నేను తృప్తిపడతాను. నిట్టూరుస్తూ, నవ్వుతూ, నర్తిస్తూ నాకు ఆనందించాలని ఉంది. నాప్రార్థనని మన్నిస్తావా? విషయ వాంఛలకున్న పేర్లలో ప్రేమ ఒకటి. నీ దగ్గర అది ఉన్నది కనుక నీ వద్దే దాన్ని నేర్చుకోవాలని నాకుంది. అందుకే రాధ, నాప్రేమ రాణి. దయచేసి ఇదినాకు నేర్పు. నేను చాలా దురదృష్టవంతుణ్ణి. ప్రేమవిడిచి కామాన్ని నేర్చుకొంటున్నాను. బంగారం విడిచి గాజుకోసం అలమటిస్తున్నాను. ప్రేమ, కామం ఎంతో భేదిస్తాయి. ఏమాత్రం స్వార్థస్పృహ లేని అనురాగం ప్రేమ. కృష్ణుడు ప్రేమకేవశుడు. ప్రేమకి ఋణపడతాడు. గౌరాంగుడవటంలో అతని ఉద్దేశ్యం ఆ ప్రేమ ఋణవిముక్తే. స్వార్థస్పృహాపూరితమైన అనురాగం కామం. కామం నుంచి భౌతిక మైన సుఖాలు, బాధలు, మంచీచెడ్డా, దుఃఖము, దరిద్రమూ సంప్రాప్తిస్తాయి. ప్రేమ పిరికివాణ్ణి ధీరుణ్ణి, ధీరుణ్ణి పిరికివాణ్ణి చేస్తుంది. ప్రేమ పురుషుల్ని స్త్రీల గాను, స్త్రీలను పురుషులుగాను మార్చుతుంది. మృతుల్ని పునర్జీవితుల్ని గాను, సజీవుల్ని విగతజీవులుగాను చేయగల సమర్థవంతమైనది. నీకా ప్రేమసంగతి తెలుసు కనుక నీ శరణుజొచ్చాను. నాకుపదేశించు. పరిపూర్ణంగా ఆనందించి నా జీవితాన్ని సఫలం చేసుకొంటాను. పిసినారిగాగాని, కపటంగా గాని ప్రవర్తించవద్దు. పూర్తిగా నిస్వార్థంగా ఉండి నన్ను రక్షించావు. సురక్షితంగా ఉంచటానికి ప్రయత్నించావు. నేనంటే అనురాగంగాను, ప్రేమగాను ఉన్నావు. స్వార్థం లేకుండా ప్రేమించటం బోధించు, అటువంటి నిస్వార్థప్రేమని చవిచూచి సంతృప్తి పడతాను. ఇంకా కపటంవద్దు. నా మాటలు విని బహుశా ఆశ్చర్యపోతావు, నీ వెట్లా కపటంగా ఉంటున్నావోనని. నీవు కోపపడకపోతే దానిని నీకు చూపగలను. చూపనా? అయితే చూడు. కర్మేంద్రియాల, జ్ఞానేంద్రియాల వశంలోపడి వికృత లాలసలవల్ల హృదయనాథుణ్ణి గురించి యోచించలేక పోయానన్నావు. చెప్పు, ఇది కాపట్యం కాదా? ఇంకెలా హృదయాదినాథుణ్ణి భావించాలి? నీవు చెప్పిన ప్రకారం భావనలో అతను ప్రాప్తిస్తే గోపికలు ఎప్పుడూ అతన్ని గురించి అలా భావించలేదు. వారు ధ్యానము, అధ్యవసాయము అంటే అసలు ఎరగరు. శాస్త్రాలు చెప్తాయి. ''నీ పవిత్రపాదపద్మ ధ్యానంలో నిమగ్నులై ఉండే యోగీశ్వరులు కారు గోపికలు'' ఈ సూక్ష్మ ఆరాధనా పద్ధతి నెరుగుదువు కనుక నీవు యోగ మభ్యసించవు. ధ్యానము, యోగము విసర్జించావు కనుక కృష్ణుడు నీ సొమ్మయ్యాడు. కనుక ఈ కపటం విడనాడి ఈ సూక్ష్మమార్గాన్ని నాకు

చెప్పమంటాను. అతన్నెలా నీ ఆధీనంలోకి [illegible]
అలభ్యుణ్ణి ఎలా లభ్యం చేసుకోగలనో చెప్పు [illegible]
చేయటం నా విధి. శుభ్రంచేయటానికి వెళ్ళనా? [illegible]
ప్రాథమిక హక్కుదారులు. నాకా కళ తెలియదు. [illegible]
కృపతో ఏనాటికైనా నావిషయం పరిశీలించి ఏది [illegible]
నాకు నేర్పవా? అప్పుడు నాహృదయాన్ని శుభ్ర [illegible]
చేయటానికి కాదు నేను వచ్చింది, నాస్వలాభం కోసం [illegible]
నీవు మనుషుల్ని పట్టుకోగానే వాళ్ళకి నిస్వార్థం బోధించు [illegible]
నీకు సమర్పణమై పోతాను, నిన్నొకసారి నిస్వార్థంగా [illegible]
చేసుకోనీ. నన్నానంద పడనీ. అప్పుడు నీవు నేనవు [illegible]
ప్రాణం ప్రాణంతోకలిసి ఒక కూడిన మొత్తము [illegible]
పదార్థమూ ఆత్మసమైక్యమైన రాజ్యంలోకి ప్రవేశించు [illegible]
ఏకైక సంయోగాన్ని దర్శించి బ్రహ్మానందానుభూతి [illegible]
లేకుండా ఆరాజ్యంలోకి ప్రవేశం అసాధ్యం. దయచేసి [illegible]
బోధించు. ఒక్క నీవే దీన్ని బోధించగలదానివి [illegible]
యుధిష్ఠిరుడు అరణ్యవాసానికిసీతను ద్రౌపదిని [illegible]
తెలుసుకోవాలనుందా? ప్రియతమా ! [illegible]
నీవులేకుండా విజయం ఏ కార్యానికీ లభించదు [illegible]
భూభారంతగ్గించటం, శక్తిసహాయం లేకుండా [illegible]
భార్యారూపంలోని వారి శక్తులతో కూడి ఉన్నారు [illegible]
ఉంటే రావణుడు చచ్చిపోయేవాడా? లేక [illegible]
మరణించేవారా ద్రౌపది రంగంలో లేకపోతే? [illegible]
వ్రాయవచ్చు. ఒక నిమిషం యోచిస్తే నేను [illegible]
చేసుకుంటావు. భూభారం తొలగించటం [illegible]
భార్యారూపంలోని శక్తితోనేను కూడి ఉండవలసి [illegible]
అది లేకుండా నేను లేను. నాహృదయంలోని [illegible]
ప్రతిష్ఠించి నా ఆత్మతృప్తికోసం దాన్ని ఆరాధిస్తాను కాని [illegible]
పోతే మహత్తర ప్రయత్నాలతో కూడా నిన్ను నీ [illegible]
పారిపోతావు. అందుకని మళ్ళీఅడుగుతున్నాను [illegible]
కూర్చుండమని. నాతో ఛాయారూపంలో ఉండు. [illegible]

చెప్పమంటాను. అతన్నెలా నీ ఆధీనంలోకి తెచ్చుకున్నావో కొంచెం చూపించు. ఆ అలభ్యుణ్ణి ఎలా లభ్యం చేసుకోగలనో చెప్పు. శుభ్రం చేసేవాళ్ళ వాడలో శుభ్రం చేయటం నా విధి. శుభ్రంచేయటానికి వెళ్ళనా? నేర్చుకోనా? హరిహులు శుభ్రపరిచే ప్రాథమిక హక్కుదారులు. నాకా కళ తెలియదు. అందువల్ల నీదగ్గరకు వచ్చాను. కృపతో ఏనాటికైనా నావిషయం పరిశీలించి ఏదో ఒకరోజున శుభ్రం చేసే విధానం నాకు నేర్పవా? అప్పుడు నాహృదయాన్ని శుభ్రం చేసుకోగలను. నీకు లాభం చేయటానికి కాదు నేను వచ్చింది, నాస్వలాభం కోసం. మనిషి స్వార్ధపరుడు. కనుక నీవు మనుషుల్ని పట్టుకోగానే వాళ్ళకి నిస్వార్థం బోధించు. ఆ నిధిని నాకు ప్రసాదించు. నీకు సమర్పణమై పోతాను, నిన్నొకసారి నిస్వార్థంగా ప్రేమించి నాజీవితం ధన్యం చేసుకోనీ. నన్నానంద పడనీ. అప్పుడు నీవు నేనవుతావు. నేను నీవవుతాను. అప్పుడు ప్రాణం ప్రాణంతోకలిసి ఒక కూడిన మొత్తమవుతుంది, అటువంటి ప్రాణంతో పదార్థమూ ఆత్మసమైక్యమైన రాజ్యంలోకి ప్రవేశించటానికి అర్హుణ్ణవుతాను. ఈ ఏకైక సంయోగాన్ని దర్శించి బ్రహ్మానందానుభూతి పొందుతాను. అటువంటి సమైక్యం లేకుండా ఆరాజ్యంలోకి ప్రవేశం అసాధ్యం. దయచేసి ప్రాణాన్ని ప్రాణంతో కలిపేపద్ధతి బోధించు. ఒక్క నీవే దీన్ని బోధించగలదానివి. ప్రాణాధిక ప్రియా ! రాముడు యుధిష్ఠిరుడు అరణ్యవాసానికిసీతను ద్రౌపదిని తీసుకు వెళ్ళారన్నది నిజమే. ఎందుకో తెలుసుకోవాలనుందా? ప్రియతమా ! నీవే ఆ కార్యానికంతా మూలానివి. నీవులేకుండా విజయం ఏ కార్యానికీ లభించదు. చూడుప్రియా, వారిపని భూభారంతగ్గించటం, శక్తిసహాయం లేకుండా సాధ్యంకాదు కనుక వారు భార్యారూపంలోని వారి శక్తులతో కూడి ఉన్నారు. రాముడివెంట సీత లేకుండా ఉంటే రావణుడు చచ్చిపోయేవాడా? లేక దుర్యోధనుడు మొదలైనవారు మరణించేవారా ద్రౌపది రంగంలో లేకపోతే? ఈ విషయం గురించి సంపుటాలు వ్రాయవచ్చు. ఒక నిమిషం యోచిస్తే నేను చెప్పింది నిజమో కాదో నీవే అర్థం. చేసుకుంటావు. భూభారం తొలగించటం నామీద ఆధారపడిలేదు కనుక భార్యారూపంలోని శక్తితోనేను కూడి ఉండనవసరం లేదు. నీడకే నా అవసరం. అది లేకుండా నేను లేను. నాహృదయంలోని ఏకాంత విశ్రాంతి స్థలంలో దాన్ని ప్రతిష్ఠించి నా ఆత్మతృప్తికోసం దాన్ని ఆరాధిస్తాను. కాని, ఎప్పుడైనా నీవు కృపజూపక పోతే మహత్తర ప్రయత్నాలతో కూడా నిన్ను నీ స్థానంలో ఉంచలేను. నానుండి నీవు పారిపోతావు. అందుకని మళ్ళీఅడుగుతున్నాను. కాపట్యం విడిచి స్థిరంగా కూర్చుండమని. నాతో ఛాయారూపంలో ఉండు. అమ్మని నీస్థూలశరీరంతో సేవించు.

ఆమె నాసేవలో కంటే. నీ సేవలో ఎక్కువగా సంతోషిస్తుంది. ఇది అబద్ధమని భావించకు. అసలుకంటే వడ్డీముద్దని అందరికీ తెలుసు. అందుకని నీహృదయ పూర్వకంగాఅమ్మనిసేవించమని సలహా ఇస్తాను. కష్టాలు పోతాయి. నాభక్తిపూర్వక నమస్కారాల్ని అమ్మకి అందించు. నా గురించి ఏ మాత్రం ఆందోళన పడవద్దని చెప్పు, ఆమెని వ్యాకులపరచవద్దు. ఎప్పుడూ చిరునవ్వుముఖంతో ఉండు. ఎందుకు ప్రియా, వద్దు. ఒక్కక్షణమైనా పరస్పరం వేరు చేయ బడ్డామా? ఎందుకు మరిబాధ? బహిర్గతం కాని (అంతరాంతరాల్లోని) అనురాగం ప్రేమ. ప్రస్తుతానికి సెలవు తీసుకోనీ. ఇంకా చెప్పవలసినదెంతో ఉన్నది. భయం నన్ను అశకుణ్ణి చేస్తోంది. నీ వాగ్దానం నిలబెట్టుకో. కళ్ళుమూసి ఉన్నా తెరిచిఉన్నా, ఎల్లప్పుడూ నీ సమక్షాన్ని అనుభవించేటట్లు ఎప్పుడూ నీడలా నా వెంట ఉండు.

నీ

హర

# 42వ పత్రము

ప్రాణ ప్రియా !

నిన్ను చూడటానికి మళ్ళీ వచ్చాను. ఏ సుఖంలో ఏకష్టంలో నా రోజులు గడుపుతున్నానో నీకుబాగా తెలుసు. సముద్రంలో మునగటంలో నేను సరిగ్గా మునగ లేదు. విచిత్రమైన తప్పుచేశాను. ఏమైనా ఏమాత్రం ఆతురత పడకు. ప్రత్యేకంగా ఒక విషయం చెప్పటానికి ఈ రోజు కనిపించాను. ఈ మధ్య ఒకటి రెండురోజులపాటు మీ పుట్టింటికి వెళ్ళావా? అక్కడ సుఖంగా లేదా? సరిగ్గా వివరంగా నాకు వ్రాయి. పెద్దపండుగకి సరిగ్గా మూడురోజులముందర ఈ సంగతి జరిగింది. వ్రాయటం మర్చిపోకు, నీ ఉత్తరం వచ్చేవరకూ నా మనస్సు వ్యాకులంగా ఉంటుంది. నాకోసం, ఏంజరిగిందో సవిస్తరంగావ్రాయి. నేను పరిశీలిస్తున్న సమయంలో మీ అత్త నీ కెంతోసాయం చేసింది. నామాటలు పిచ్చివాడి అంచనా లాగా లెక్కవేయకు. నిజంగా నీవునన్ను ప్రేమిస్తుంటే విశ్వాసంతో నావిజ్ఞప్తిని పాటించు. మొండిగా కూర్చుంటే నిన్ను నీవు కష్టపెట్టుకోవటమేకాదు, నాకూకష్టం కలిగిస్తావు. అది ఇంత కంటే ఏమీకాదు. వచ్చే చైత్రమాసంవరకూ మీనాన్నగారి ఇంటికి వెళ్ళకు. ఒక్కరోజు కూడా మా అమ్మకుదూరంగా ఉండకు. ఏ ప్రత్యేక కారణంగానైనా మొహమాటంతో మీనాన్నగారి ఇంటికి వెళ్ళవలసివస్తే రాత్రిపూట అక్కడ ఉండకు. మనం మళ్ళీ కలిస్తే విషయం వివరంగా చెప్తాను. ఇప్పుడుకాదు. మా అమ్మతో నీవు సుఖంగా ఉంటావు. ఏ మాత్రం కష్టపడనక్కరలేదు. ఆమెకి దూరంగా ఉంటే నీవు ప్రమాదం

ఎదుర్కోవలసివస్తుంది. ఇప్పుడునీకెలా ఉంది? నాకు దూరంగా నీవు సుఖంగా లేవూ! నీవు సుఖంగా ఉండి నన్నుకూడా అలాగే ఉంచుతావు. ఎక్కువ ఆలోచించకు, అసహనంగా ఉండకు. నిరంతరం ప్రార్థన (మంత్రజపం) చేయటం మర్చిపోకు. ఇక్కడ ఈ అయిదు రోజులూ అయిదురకాలుగా ఉన్నాను. నా ప్రస్తుత స్థితి నీవుచూడ లేదు. నీ సముఖంలో మర్చిపోయిన విషయాలు ఇప్పుడు జ్ఞాపకం వస్తున్నాయి. అన్నిటికంటె ముఖ్యమైనది నీమంత్రాన్ని జపించటం మర్చిపోకూడదు. ఎవరినీ తీక్షణంగా చూడకు. కఠినంగా మాట్లాడి ఎవరికీకష్టం కలిగించకు. పెద్దవాళ్ళని అవమాన పరచకు. నీ సేవతో తృప్తిపరచి మా అమ్మ దీవనలను పొందటానికి ముఖ్యంగా ప్రయత్నించు. పూర్తిగా నీబుద్ధిని సాధనని నీగురువుగారి పవిత్ర చరణసేవకి వినియోగించు. శ్రీకృష్ణుడికీ గురుదేవుడికీ ఏమాత్రం తేడా లేదు. ఇద్దరూ ఒకటే. ఇది మర్చిపోకు. అందరితోనూ మంచిగాఉండు. పిల్లలను ఒకకంట కనిపెట్టిఉండు. మా అమ్మకి నాభక్తిపూర్వక నమస్కారాల్ని తెలుపు. నాగురించి ఆమె బాధ పడకుండా చూడు. ఆమెబాధపడే ఏ చిన్నపనీ చేయకు. మా అమ్మ ఈ ప్రపంచం నుంచి అదృశ్యమైతే నన్నుకూడాచూడవని గుర్తుంచుకో. మా అమ్మ జీవితం నాజీవితంతోముడిపడి ఉంది. ఇది ఈ రోజు చెప్పాను. మనస్సులోపెట్టుకో. అబద్ధమని ఎప్పటికీ అనుకోకు. ఈ విషయాన్ని గురించి ఎక్కువనేను వ్రాయనక్కర లేదు. నీదయవల్ల నేను క్షేమంగా ఉన్నాను.

నీ
హర

## 43వ పత్రము

ప్రాణప్రియా !

ఇప్పటికి నీ దయకి సాక్ష్యం దొరికింది. నీ వలాకాకపోతే ఈ ప్రపంచం అంతమయ్యేది, ఒక్క జీవికూడా బ్రతికి ఉండేదికాదు. నీవు నాపట్లదయతో ప్రసన్నంగా ఉన్నావు కనుక ఈ అపారపారావారం ఒక్క తరంగం కూడా లేకుండా ప్రశాంతంగా ఉంది. నీవు ప్రశాంతంగా ఉండి నన్నలా ఉంచావు అందుకే నిన్నంత ప్రేమిస్తాను, అంతచనువు తీసుకొంటాను. ఈ దయ ఎల్లప్పుడూ ఉండాలనీ, నేను నీకృపని కోల్పోకుండా ఉండాలనీ ప్రార్థిస్తాను. నాలాంటి అదృష్టవంతులు ఉండరు. చూడు, ప్రతిజీవినీ కాపాడటానికి ఒక అమ్మ ఉన్నది. నన్నుచూడు, అసమర్థుణ్ణి కనుక నారక్షణ బాధ్యత చాలా మంది తల్లుల మీద పడింది. నేనుధన్యుణ్ణి. దయానిధి దయాగుణం నిజంగామహత్తరమైంది. నాస్థితి ఏమిటి! హృదయేశ్వరుని అపార

వాత్సల్యాను రాగాలు నీ సహకారంతో కనిపిస్తున్నాయి. నీకోసంమాత్రమే, నీ కృష్ణుడు నన్నంతగా ఇష్టపడతాడు, ప్రేమిస్తాడు. నీవు అతనికి ప్రియాతి ప్రియమవుతున్న కొద్దీ అతనింకా ఇంకా నన్ను ప్రేమిస్తాడు, ఎందుకంటే కేవలం నేను నీవాణ్ణి కనుక. అందుకని, అతణ్ణి, అతని నామాన్ని, అతని ప్రేమని నిరంతరం ధ్యానిస్తూ రోజులు గడపమంటాను. ఇతర చింతలతో నీమనస్సుని కలవరపెట్టుకోకు. అతడిప్రేమ పయోధిలో మునిగి నిరంతరం ఆ మాధుర్యాన్ని గ్రోలు.అప్పుడు నీవు విషంత్రాగినా మరణించవు, విషం నిన్నెప్పటికీ దహించలేదు. ఒకవేళ ఎవరైనా నాలాంటి దరిద్రులు ప్రేమసాగరంలో మునిగికూడా నోళ్ళుమూసుకుంటే, ఆ విషయంవేరు. వాళ్ళెప్పుడూ దహించుకుపోతూనేఉంటారు.. వాళ్ళు చల్లబడటానికి తావేది? నేను వ్రాస్తున్నది అసంబద్ధమని అనుకోకు. కృష్ణప్రేమ సముద్రంలో ప్రవేశించి ఎవడైనా తపిస్తున్నట్లను కుంటాడా? కేవలం దానిదృష్టి పడటంతోనే అనేకవేల తాపాలు శమిస్తాయికదా, దాన్ని తాకినతర్వాత కూడా ఎవరన్నా బాధల్ని పొందగలరా? ఉదాహరణకి జటిలా కుటిలల్ని చూడు, వారు శ్రీకృష్ణుడి మనోహర రూపాన్ని దర్శించారు, అయినా తీవ్రవేదనపడ్డారు. చంద్రావళి ప్రేమసాగరాన్ని తన నిలయంగా చేసుకొన్నది. కాని, శ్రీమతిలాగా ఉపశమనాన్ని పొందలేక పోయింది. భక్తులు వారిపురోగతిలో వాళ్ళపాదుని కోల్పోయి పడిపోతారు, అంతపెద్ద సముద్రం మధ్యలో ఉండికూడా ఎందుకు తీవ్రవేదన పడతారు? ప్రేమసాగరంలో అనేకవేల విషసర్పాలను చూడవలసివస్తుంది. ఆ అగాధసాగర జలాన్ని స్వార్థంతో మధిస్తే ఆ సర్పాలు కరుస్తాయి. నోళ్ళుమూసుకొని అమృతం త్రాగనివారు బాధతో తపించి మరణిస్తారు. కనుక నాలాగా, నీనోరుమూసుకోకు. నీపూజాఫలం వల్ల ఆచల్లని సముద్రంలో పడితే యధేచ్ఛగా గ్రోలు. నీకు భయంపోతుంది.ఈ మాటలుపోనీ, చప్పగా నీకు రుచించటంలేదు. వేడివేడి 'పిలా' తర్వాత చద్దిఅన్నం రుచిగా ఉండదు. పూజార్హమైన మా అమ్మకి నాగౌరవపూర్వక నమస్కారాలు చెప్పు. నాగురించి ఒక్క క్షణంగూడా కంగారు పడవద్దని చప్పు. ఆమె దీవనలు పొందినవారికి చింతలుండవు. ఆమె మట్టుకామె చింతలు లేకుండా ఉంటే మనమూ ఉన్నట్లే. చెట్టు వ్రేళ్ళు సారవంతగా ఉంటే ఫలాలు నిస్సందేహంగా స్వాదిష్టంగా ఉంటాయి. కనుక ఆమెని ఎప్పుడూ ఆనందంగా ఉండనీ. నిరంతరం ఆమెను సేవించు. నిన్నాదరంతో ఆమె చూస్తే నీ కోర్కెలన్నీ ఈడేరతాయి, నీయిష్టం వచ్చినట్లు చేయి. నీవు పూర్ణ సంకల్పవు.

నీ

హర

**ప్రథమభాగం సమాప్తం**

# పాగల్ హరనాథ్

(రెండవభాగము)

అనువాదము : శ్రీ టి.వి. జనార్ధనరావు, ఎమ్.ఏ.,

సికింద్రాబాదు.

## 1వ పత్రము

ప్రియమైన పూర్ణా , (పూర్ణా చంద్రఛటర్జీ)

నీ ఉత్తరం నాకు చాలా సంతోషం కలిగించింది. బాబూ, ఈ ప్రపంచంలో ప్రతివాడూ ఋణగ్రస్తుడే. కొందరు పెద్ద మొత్తాల్ని గుత్తకి తీసుకుంటారు. కొందరు చిన్న మొత్తాల్ని, ఇంతే భేదం. చేసిన చెడ్డపనులకి పశ్చాత్తాప పడటమే నిజమైన లబ్ధి, కాని జ్ఞాపక ముంచుకోవలసినదేమిటంటే మొదటిది భంగమైనప్పుడు, రెండవసారి పశ్చాత్తాపడటం, ఆ పని అలవాటుగా మారుతుంది. కనుక ఆ పనీ ఆ పశ్చాత్తాపపడటమూ శాశ్వతంగా వదిలివేయాలి. బాబూ, మనుష్యులు దుస్సహవాసంలో పడితే వాళ్ళ ఇష్టానికి వ్యతిరేక మైనప్పటికీ తప్పులు చేయక తప్పదు. కనుక నీవు శాశ్వతంగా అటువంటి సాంగత్యం త్యజించాలి. ఎప్పుడూ సత్సాంగత్యాన్ని అభిలషించు. సంకల్పానికి వికల్పంగాని, అసాధ్యంగాని ఏమీ లేదు. కనుక లభించినా లభించక పోయినా ఎప్పుడూ సంత్సాంగత్యాన్ని అభిలషించు. నిరంతర సంకల్ప సిద్ధుడైన ఆ కృష్ణుణ్ణి దర్శిస్తావు. ఆయన నీ వాంఛితం నెరవేరుస్తాడు. అప్పుడు నీవు ఒక్క క్షణం కైజరువవుతావు, శాశ్వతంగా సంతృప్తి పొందుతావు. శ్రీకృష్ణ సాన్నిధ్యంలో కూడా ప్రియమైనదైన లబ్ధి సాధు సాంగత్యంలో అతిహీనమని సత్యంగా తెలుసుకో. కృష్ణుడే వారికా గౌరవాన్ని ప్రసాదించాడు. సాధువులు కృష్ణ చరణాలకు సర్వస్వాన్నీ సమర్పించారు, కనుక సాధు సాంగత్యము , పరిచర్య నీ ప్రధాన జీవితాశయంగా చేసుకొమ్మంటున్నాను. నీకు దానం చేయాటానికి డబ్బు లేదూ, శారీరకంగానూ, మంచి మాటలతోను ఇతరులకి సాధ్యమైనంత వరకు మంచి వేయటానికి ప్రయత్నించు. నీ మనస్సులోని దురాలోచనల్ని పూర్తిగా తొలగించివేయటానికి ప్రయత్నించు. దురాలోచనలు దుష్కర్మలకన్న చాలా బలవత్తరమైనవి. అందుకే రాజయోగం హఠయోగం కంటె శ్రేష్ఠమైనది. ఒకటి ఆలోచన, మరొకటి ఆచరణ.ఆలోచన ఎంత శక్తివంతమైనదంటే అది లేని వస్తువుల్ని సృష్టిస్తుంది. కనిపించని వాటిని చూపిస్తుంది. పట్టుకోలేని వాటిని పట్టుకుంటుంది.

కనుక నీ ఆలోచనల్ని చక్కగా మెరుగుపెట్టాలి. మెరుగైన ఆలోచనలు మెరుపులోని కాంతిలాగా కటిక చీకటి గదిలో విద్యుత్కాంతిని విరజిమ్ముతాయి. అప్పుడు ఏదీ తెలియనిది ఉండదు. ప్రతిదీ అద్దంలో లాగా స్పష్టంగా కనిపిస్తుంది. పరిపూర్ణానందం పొంది తృప్తి పడతావు. తల్లిదండ్రులు భగవంతుని అవతారంగా పూజింపబడాలి. అప్పుడు కరుణామయుడైన హరికృప ప్రాప్తిస్తుంది. జన్మనిచ్చిన తల్లితండ్రుల్ని ఎలా సంరక్షించాలో తెలియనివాడు తల్లిదండ్రి అనే బాంధవ్యాన్ని కల్పించుకుని భగవంతుణ్ణి ఎలా సేవిస్తాడు? సౌభ్రాతృత్వం స్వగృహంలోనే మొదలౌతుందని తెలియదా నీకు? అలాగే ప్రతిదీను, ఇప్పుడు నీవు శ్రద్ధ వహించకపోతే ఇంకాఎప్పుడూ మొద్దబ్బాయి లాగా తప్పులే పలకవలసివస్తుంది. కనుక నీవు నీ మొదటి పాఠాల్ని తగినంత శ్రద్ధతో నేర్చుకోవాలి. నీవు నీ తల్లిదండ్రుల్ని సేవించటం నీ మొదటి పాఠం. దీనిలో శ్రద్ధ చూపకపోతే తర్వాత ఎప్పుడూ అశ్రద్ధగానే ఉండిపోవాల్సి వస్తుంది. చివరి పరీక్షలో ఉత్తీర్ణులవటం అతికష్టమైన విషయ మవుతుంది. నీ తల్లిదండ్రుల్ని భగవంతుని అవతారంగా సేవించి గౌరవించాలి. ఏ వ్యక్తి అయినా దేవతల్ని చర్మచక్షువులతో సశరీరులుగా చూడాలనుకుంటే అతన్ని తన తల్లిదండ్రుల్ని చూడనీ, ఎవడూ ప్రవేశ పరీక్షలో కృతార్థుడు కాకుండా పట్టభద్రుడయ్యే యోచన చెయ్యలేడు కదా. అలాగే తన తల్లిదండ్రుల్ని సేవించటమనే ప్రవేశపరీక్షలో సఫలీకృతుడు కానిదే కళాశాలలో కొనసాగాలనే అతని కోరిక పిచ్చి ఊహ కాకమరేమీ కాదు. తల్లిదండ్రులు పూజార్హులైనట్లే భార్య ప్రేమాదరాలకి అర్హమైంది - భార్య కేవలం ఆటబొమ్మగా భావించి మనలాగా ఎవరూ మోసపోకూడదు. చాలా ప్రాపంచిక విషయాలలో మనం మన నైజ శక్తిని వాంఛించి ఆమె సాహచర్యంలో శక్తివంతులమై పని చేయగలుగు తున్నాము. కనుకే ఆమె శక్తి అనిపించుకుంటుంది. మనకి విధ్యుక్త కర్మల్లో సహకరిస్తుంది. కనుక ఆమె సహధర్మచారిణి. వారసుణ్ణి తన గర్భంలో ధరించింది కనుక ఆమె జయ. అందువల్ల అటువంటి భార్య ధర్మార్థ కామమోక్షాలనే పురుషార్థాలలో ప్రతి దానిలోనూ ఆమె ప్రధాన సహకారిణి. అలాగే సంకల్పిస్తే నరకానికి తీసుకుపోతుంది. మళ్ళీ ఆమే స్వర్గానికి త్రోవజూపేదికూడానూ. ఆమే వైరాగ్యానికి, మోక్షానికి త్రోవజూపగలదు. కనుక ఆమెని అగౌరవ పరిచే యోచనే మనం ఊహించకూడదు. ఈ ప్రపంచంలోని ప్రతి స్త్రీకి అర్హ గౌరవాన్నివ్వటం మర్చిపోగూడదు. అందులో కొంతమంది బంధించుతూ, కొందరు దండన విధిస్తూ లేక విముక్తుల్ని చేస్తూ రాజోద్యోగుల్లాగానే వాళ్ళు వాళ్ళ వాళ్ళ విధుల్ని నిర్వర్తిస్తున్నారు. నరకానికి త్రోసేయ దలుచుకున్న వాళ్ళు వ్యభిచారుల్లా రాక్షసీ, పిశాచీలుగా

పరమానందంలో ప్రవర్తిస్తారు. మళ్ళీ వాళ్ళే వాళ్ళ రక్తంతో మన ప్రాణాల్ని పోషించి మోక్ష మార్గానికి త్రోవజూపిస్తున్నారు. కనుక ఆమె ఎటువంటిదైనా భార్యని అగౌరవపరచకు. ప్రవేశ నిర్గమ ద్వారాలవద్ద నిలబడి స్త్రీలే మనం కోరుకున్న గమ్యానికి చేరుస్తారు. వారికన్ని ఆటలూవచ్చు. ఏ ఆటలోనూ వాళ్ళని ఓడిద్దామని ప్రయత్నించకు. కృష్ణనామం మరువకు. ఇదే ప్రధాన మంత్రం దీనిని విశ్రాంతిలోనూ, నిద్రలోనూ కూడా మరువకు. "నిరంతరం పవిత్రంగా ఉండే నామాన్ని జపించేటప్పుడు శుచి అనే ప్రశ్న మనసులోకి రానీయకు. ఆయన నామాన్ని స్మరించే వాడినుండి మైలంతా అల్లంత దూరానికి పారిపోతుంది.

మీ
హర

# 2వ పత్రము

ప్రియమైన సోదరా హేమూ! (హేమచంద్రఘోష్)

ఒక యుగం తర్వాత ఈ రోజు మీ ఉత్తరం అందుకున్నాను. బృందావనం దర్శించుకొని తరించారని విని చాలా సంతోషించాను. దురదృష్టవంతుణ్ణి కనుక బృందావనం దర్శించే అదృష్టం నాకు కలగలేదు. మీ శేష జీవితాన్ని ఆనందంగా గడపటానికి వ్రజనాథుని నామాన్ని ఆశ్రయించండి. బ్రహ్మాండంలో మరేనామమూ కృష్ణ నామమంత మధురమైనది దొరకదు. "సర్వశక్తులికి నామం మూలం. నామాన్ని మరువకండి" మీ జీవితంలో ఎక్కువ భాగం తుచ్ఛ ప్రాపంచిక సుఖాలతో గడిపారు. ఇంకా ఎందుకు? వీటిని విడిచిపెట్టి యధార్థంగా పవిత్రమైన శ్రీకృష్ణ నామాశ్రయంలో రాబోయే జన్మకి ఆయత్తం కావటం అవసరం. ఇది చివరి జన్మ కాదు. ఇంతకుముందు జన్మలున్నాయి. అందుకని భ్రమలో మునిగి వచ్చే జన్మని పాడుచేసుకోకండి. రోజు రోజుకి శరీరం బలహీన మవుతున్నది. అందుకని తామసికాహారం బదులు సాత్త్వికాహారం స్వీకరించాలి. యౌవనంలో అతి రుచికరమైన ఆహార పానీయాలుగా గణింపబడిన చేపలు, మాంసం, త్రాగుడు-విషంలాగా విసర్జించాలి. లేకపోతే ఆరోగ్యం పూర్తిగా దెబ్బతింటుంది. పండ్లు, దుంపలు, కాయగూరలు ఇప్పుడు ఆహారంలో ముఖ్య పదార్థాలు కావాలి. మంచి ఆహారం శరీరాన్ని ఆరోగ్యవంతంగా ఉంచుతుంది. ఆరోగ్యకరమైన శరీరం మనస్సుని ఆరోగ్యకరంగా ఉంచుతుంది. స్థిరమైన మనస్సుతో మీరు శక్తివంతంగా శ్రీకృష్ణ నామం చేయగలుగుతారు. " నశ్వరమైన ఐశ్వర్యాల కోసం ఐహిక వాంఛల కోసం

వచ్చే జన్మని పాడుచేసుకోవటం వాంఛనీయం కాదు" ఇతరుల్ని అణగద్రొక్కుదామనే ఆలోచనే మనసు నుంచి దూరం చేయాలి. నేను, నాది అనే మహాదురహంకారం విడనాడాలి. జీవితంలో ఉత్తమ భాగం గతించింది. ఇంకా ఆగటం లేదు. ధనాన్ని సద్వినియోగం చేయాలి. ఆస్థి కూడబెట్టడం, భార్యకి, బంధువులకి సొమ్ములు చేయించటం, మృష్టాన్న భోజనం సద్వినియోగ మనిపించుకోదు. అవసరములో ఉన్న వాళ్ళని ఆదుకోవటం, ఆకలితో మాడుతున్న వారికి అన్నం పెట్టటం, బట్టలు లేనివారికి బట్టలు ఇవ్వటం, మొదలైనవి చేస్తే డబ్బు సద్వినియోగం చేసినట్లు లెక్క. కైజరు కూడా ఈ ప్రపంచం విడిచి పెట్టేటప్పుడు ఏమీ తీసుకురాలేదు. పోయేటప్పుడు ఏమీ తీసుకుపోనూ లేదు.అతడు పట్టుకువచ్చేది, పట్టుకుపోయేది అతని మంచి, చెడ్డ పనులే. అందుకని ధనంతో, మరణించిన తర్వాత వెంట వచ్చే మంచి పనులు చేయటం వాంఛనీయం. అహంకారాన్ని విసర్జించటం అవసరం. లేకపోతే ఏ మాత్రం అహంలేని నిత్యానందుడు కృప వహించడు. హృదయాన్ని అర్ధ్రం చేయాలి. లేకపోతే అత్యంత మార్దవమైన కృష్ణ చరణాలు అందులో కనిపించవు. అందువల్ల కఠినమైనదేదైనా హృదయంలో ఉంటే దాన్ని తొలగించే ప్రయత్నం చేయుటం మంచిది. కుర్రవాడిలాగా ఇంకా ప్రవర్తించటం కూడదు. సూర్యాస్తమయంతో కొంచెం తొందరపడటం అవసరం. లేకపోతే చీకటిపడితే ఏమీ జరగదు. " నామం చేయండి, చేయమని ఇతరులకి చెప్పండి" పూర్తిగా లౌకికమైన వ్యక్తుల సాంగత్యం విసర్జించటానికి ఉద్యుక్తులు కండి. " సాధ్యమైనంత ఆతురతతో భక్తుల సాంగత్యాన్ని పొందండి." నన్ను పిచ్చివాడిగా భావించి నా అమాయకత్వాన్ని లెక్క చెయ్యకండి. నేను మహా పాపిని, అతి కపటిని. మీ ప్రియ భార్యకి మా భక్తిని అందజేసి, మా పట్ల దయతో ఉండవలసిందిగా అర్థించండి. మానవుణ్ణి దేవునిగా భావించి పొరబడవద్దని ఆవిడకు చెప్పండి. మనిషి ఎప్పటికీ మనిషే. మేము పూర్తిగా స్నహాయులమని కూడా ఆవిడకు చెప్పండి. మా సంకల్పంవల్ల ఏదీ రాదు. దీపోదు. అవన్నీ దృఢ సంకల్పాలు, వాంఛించినవి చేయగల సమర్థాలు. కనుక దయతో ఆవిడ దర్శనమిస్తే నేను కృతార్థుడినవుతాను. నా కోరిక లేవీ తీరేవి కావు.

మీ

హర

# 3వ పత్రము

ప్రియసోదరా, హేమూ! ప్రియ సోదరీ!

మీ ఉత్తరం చూసి నేను నిజంగా ఎంతో సంతోషించాను. అటువంటి ఆనందంలో కృష్ణుడెప్పుడైనా మనల్ని ఉంచుతాడా? మీరు ఆనందంగా ఉంటే నేను ఆనందంగా ఉంటాను. కృష్ణుడు మీకు నిరంతరం ఆనందం ప్రసాదించుగాక! మీరు నిరంతరం ఆనందంగా ఉండాలంటే, అత్యంత మనోహరమైన కృష్ణనామాన్ని మరువకండి. రాత్రింబవళ్ళు ఆ నామంలో మునిగి ఉండండి. ఆ నామం మీ కెటువంటి ఆనందం కలిగిస్తుందో అప్పుడు చూస్తారు. " కృష్ణ నామం చేసేటప్పుడు పరిశుద్ధమూ, అపరిశుద్ధమూ అన్న ఆలోచనలు మీ మనసులోకి రానీయకండి. దేని సంపర్కమున ప్రతి వస్తువూ పవిత్రమౌతుందో అటువంటి అగ్నిని ఏమైలా ఎలాసోకదో, అలాగే ఏమైలా కృష్ణనామాన్ని సోకదు. నామ జపం ప్రేమని కలిగిస్తుంది" ప్రేమతో ప్రేమలక్ష్యమైన కృష్ణుడు లభ్యుడౌతాడు. కృష్ణ నామాన్ని తీసుకొన్నట్లుగానే అనాథల కోసం, ఆర్తులకోసం పరితపించండి. వాళ్ళకి ఊరట కలిగించేందుకు సంసిద్ధంగా ఉండండి. వాళ్ళ బాధల్ని డబ్బుతో గాని, ఓదార్పుతోగానీ తొలగించటానికి ప్రయత్నించండి. ఏ ఒక్కర్నీ కష్టంలోకి లాగటానికి మీ మనస్సుకి ప్రేరణ రానీయకండి. ఏ కారణంగానయినా మీరు కోపంగా వుంటే, మీ జీవిత భాగస్వామిని కోప్పడవద్దు. తొందరగా ఆ కోపాన్ని మీ మనస్సులో నుండి తొలగించండి. అంకురాన్ని ఎంత పెద్దదైనా, తేలికగా తీసివేయవచ్చు. కాని పెరిగి , వేళ్ళుబారి వృక్షమైతే తీసివేసినా, తప్పకుండా దాని గుర్తు మిగులుతుంది. అలాగే 'క్రోధం' హృదయంలో బలవత్తరంగా నాటుకుంటే తొలగించటం కష్టం.' తొలగించటమంటూ జరిగితే, చెరగని ఒక పాడు గుర్తు మిగిల్చిపోతుంది. కామం క్రోధం, ఇంకా ఇలాంటి అంతశ్శత్రువులు మన మనోపరిధిలో అల్లుకున్నాయెూ, వదలాలనుకోవు. ఎలాగైనా ఏదోరకంగా వెళ్ళగొట్టబడితేనా, వెళ్ళేటప్పుడు నాశనం చేయటానికి వెనుకాడవు. అందుకని, మీ మనస్సుల్లో అటువంటి శత్రువులకి తావీయకండి. అవి మిమ్మల్ని సమీపించినా అప్పటికప్పుడు తరిమికొట్టండి. ఇతరులకి అపకారంచేసే ఆలోచన చేయవద్దు. అపకారం చేద్దామనుకోవటంకన్నా నిజంగా అపకారం చేయటం మంచిది. ఆలోచనా శక్తి నిజంగా చాలా శక్తివంతమైనది. ఆలోచనలు ఎంత బలవత్తరమైనవంటే ఊహాతీతుడైన ఆ భగవానుణ్ణే పట్టేస్తాయి. ఆలోచనా శక్తీ, గతీ ఎప్పుడూ అజేయాలు. ఆ బలవత్తర శక్తిని శత్రువు చేసుకున్నవాడెవడూ నిశ్చింతగా విశ్రమించలేడు. తన

నేస్తంగా మార్చుకున్న వాడికి సాధ్యం కానిదేదీ ఉండదు. నిరంతర ధ్యానంతో హృదయం పరిశుద్ధమైతే ఆ పరమ హితైషి కృష్ణుడు దాన్ని ఎప్పటికీ తన నివాస స్థానం చేసుకుంటాడు. "పిలవకపోయినా వస్తాడు, పొమ్మన్నా పోడు. ఆ స్థితి కలిగించే ఆనందం వర్ణనాతీతం" ప్రయత్నంతో సాధించండి. అప్పుడు మీ కర్థమౌతుంది. బంధానికీ, మోక్షానికీ మనస్సేకారణం. ఆలోచన ఎంత తేలికగా ఉంటే యోచించే వాడిని అది అంత ఉన్నతుడిని చేస్తుంది. ఎంత భారమైతే అంత అతడిని కృంగదీస్తుంది.

తల్లి ప్రత్యక్షదైవంలా సేవించబడాలి, భావించబడాలి, తల్లికి మించి మరొకరెవరూ భూమ్మీదలేరు. ఏవిధంగానూ ఆవిడ బాధపడకుండా చూడు. నీవు అదృష్టవంతుడివి. నీకు తల్లి ఇంకావుంది. మీ ఇద్దరూ కృష్ణనామం ఎలా తీసుకోవాలో, ఎటువంటి అమోఘలాభం. ఆనందం దానివల్ల లభిస్తుందో చూపి, లోకానికి మార్గదర్శకులు కండి.

మీ
హర

## 4వ పత్రము

సోదరా హేమూ!

అంతగా బాధపడవద్దని నీభార్యతో చెప్పు. ఆమె దయతో మేము ఒక రకంగా బాగానే ఉన్నాము. కృష్ణుని మధుర నామాన్ని చేయడం మరిచిపోవద్దని ఆమెకు చెప్పు. దానిని నీవు మరిచిపోవద్దు, ఆమెని మరువనీకు. నామం కంటే గొప్ప ఆధారము, మహత్వమైనది, రెండవది లేదు. కృష్ణునికి అతని నామానికి భేదంలేదు. పాపాత్మునికి సాక్షాత్తు కృష్ణుని కంటే కృష్ణ నామమే చాలా ప్రియమైనది. ఎందుకంటే కృష్ణుడు పాపాత్ముని దగ్గరికిరాడు. పాపాత్ముడు కృష్ణనామాన్ని చేయవచ్చు. చేసి, కృష్ణుని చేరగలడు. కనుక మనం అతని నామాన్ని సాక్షాత్తు అతనికంటే అత్యంత ప్రియమైనదిగా భావించాలి. కృష్ణుని దగ్గర మంచికి చెడ్డకి విచక్షణ, స్థానము, స్థితుల అధికార ప్రసక్తి అవసరమౌతుంది. కాని నామానికి ఆ ప్రసక్తి లేదు. నామం మహదానందము. నిరంతరం పవిత్ర మొనరించేదీను అటువంటి మధుర నామాన్ని తింటున్నప్పుడు గాని, తిరిగ్గా ఉన్నప్పుడు గాని, ఏ పరిస్థితుల్లోనూ, ఎక్కడ మర్చిపోకు. నామజపం నిర్లక్ష్యం చేయకు. సదా పవిత్రము., పావనము అయిన నామాన్ని

తీసుకునేటప్పుడు యోగ్యత, సమయము, పవిత్రత, అపవిత్రత అనేవి నీ మనస్సులోనికి రానీయకు. నామం చేసేటప్పుడు అపవిత్రత నీదరికి రాదు. అప్పుడప్పుడు నామాన్ని బిగ్గరగా చేయటానికి ఏకాంతంలోకి వెళ్ళు. అప్పుడు ప్రేమ నీ నిలువెల్లా నిండి నీ కళ్ళగుండా బయటికి ప్రవహిస్తుంది. అన్ని కష్టాలు అంతమవుతాయి. అన్ని బాధలు తీరుతాయి. కృష్ణనామమే కృష్ణప్రేమ అందించగల సమర్థవంతమైనది. అసలు స్వయంగా కృష్ణుడే దాన్ని ప్రసాదించగలడా అన్న విషయం వివాదాంశము. కనుక కృష్ణనామం సాక్షాత్తు కృష్ణుని కంటే గొప్పది. ఇక్కడ చెప్పబడినది సామాన్యంగా అంగీకరించబడినా కాకపోయినా, అందరి హృదయాలకి ఆనందదాయకమైనా కాకపోయినా అది మనలాంటి ఆర్తుల, నిస్సహాయులైన పాపాత్ముల హృదయాలలో ఆశ చిగురింప చేస్తుందనడానికి ఏమాత్రం సందేహం లేదు. ఇందుకే బాధాతప్తులైన పాపాత్ములకి కృష్ణుని కంటే కృష్ణనామమే ఎంతో ప్రియమైనది. పాపం పుణ్యం నామమనే అజేయమైన ఆయుధాన్ని శరణుజొచ్చేంత వరకే మనిషిని భయపెట్టగలవు. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక బాధలతో నిరంతరం వ్యధ చెందే వ్యక్తులకు ప్రభునామం వంటి క్షేమదాయకమైన మార్గం మరొకటి లేదు. సాక్షాత్తు కృష్ణుడే మహాపాపాత్ముడైన అజామిళుడికి ఏమీ చేయగలిగి ఉండేవాడు కాదు. కాని తెలియకుండా అతని నామాన్ని ఉచ్చరించటంలో అతి పవిత్రుడు, భయవిముక్తుడు అయ్యాడు. ఇది పూర్తిగా తెలిసిన తర్వాత కూడా ఈ మహదాశ్రయాన్ని ఉపయోగించుకోలేకపోతే మనం ముక్తిని ఎలా పొందగలం? ప్రభునామం వంటి పరమ పావనమైనది మరొకటి లేదు.' కనుక అందరికి మనవి చేసుకుంటున్నాను. మీరు సంతృప్తులౌతారు. అన్ని కష్టాలు అంతమౌతాయి. కృష్ణ సేవలో సదా ఆనందిస్తున్న మిమ్మల్ని చూసి మమ్మల్ని ఆనందించనీయండి. నామస్మరణ సరిగ్గా జరిగిందా లేదా అన్నది పట్టించు కోనవసరం లేదు. ఎవరి నామమో అది అతని ఆలోచనకు విడిచి నామంలో ముందుకు సాగుదాము. లాభదృష్టితో ఆతని సేవలో ప్రవేశించటం నిరాశనే కలిగిస్తుంది. సార్వభౌములకు సార్వభౌముడైన అతణ్ణి స్వల్పభిక్షలు ఎప్పటికీ యాచించకు.

మీ

హర

# 5వ పత్రము

ప్రియసోదరా హేమూ, ప్రియసోదరీ (హేము భార్య)

సంతోషలిప్తమైన మీ ఉత్తరం చదివి ఎంతో ఆనందించాను. సోదరా, శారీమావలె, నీవు కూడా ఒక చేత్తో పనిచేయవచ్చు. రెండవ చేత్తో జపమాల ధరించవచ్చు. నీ గృహకృత్య నిర్వహణలో సతమతమవుతున్నా, కృష్ణనామాన్ని జపించటం మరువకు. నామముకంటే మించిన అమూల్యరత్నం మరేమి లేదు. అదియే ప్రేమకు తల్లి, తండ్రి, పోషకుడు, స్రష్ట. నామం నుంచి ప్రేమలభిస్తుంది. ప్రేమ నుంచి ప్రేమ నవకిశోరుణ్ణి నీవు పొందుతావు. నామ జపాన్ని మించిన యజ్ఞం ఏదీలేదు. అన్ని యజ్ఞాలలోను జపయజ్ఞం శ్రేష్టమైనది. అన్ని రకాల కష్టాలు నామం చేయటంతో అంతమవుతాయి. ఇటువంటి నిధి మరొకటి లేదు. సోదరీ, ఈ ప్రాపంచికమైంది నీవేది చూస్తావో అది క్షణభంగురమైనదే. ఈ రోజు ఉన్నది. రేపు ఉండకపోవచ్చు. ఇందువలన ఈ లౌకికమైన ఏదో ఒక దానిని గాఢంగా ప్రేమించకోరేవారు పూర్తిగా మోసపోతారు. కొందరు తమని తాము మరిచిపోయి, పిచ్చిగా తమ పిల్లలని ప్రేమిస్తారు. అలా చేయటంలో అమిత దుఃఖాన్ని వీళ్ళకి కలిగించి చెప్పాపెట్టకుండా వాళ్ళు గతించటం చూస్తారు. అప్పుడు తాము కేవలం ఏడవటం కోసమే ప్రేమించామని వాళ్ళు గుర్తిస్తారు. ఈ రకంగానే కొందరు తమ భర్తల్ని, కొందరు తమ భార్యల్ని, మరికొందరు ఎందరినో ఇతరుల్ని ప్రేమించి మోసపోతారు. సోదరీ నీవు ఎన్నటికీ విచారించనవసరం ఉండదు. మనము తన్మయులమైతే అతడు గ్రహిస్తాడు. మనం మర్చిపోతే అతను జ్ఞాపకం చేస్తాడు. మనం ఏడుస్తే అతను మనకళ్ళు తుడుస్తాడు. మనం చిరునవ్వు నవ్వితే మన సంతోషంలో అతను పాలుపంచుకొంటాడు. సోదరీ, పూర్తిగా ఇది అర్థం చేసుకొని నీ హృదయంలో కృష్ణుణ్ణి ప్రేమించు. ఎవరినన్నా తల్లి, తండ్రి, అన్న, మిత్రుడు, కొడుకు, కూతురు, అని పిలవాలనుకుంటే అతణ్ణి అలా పిలువు. అతణ్ణి మర్చిపోతే, స్వర్గ సామ్రాజ్యం, భయానక నరకలోకాలకంటే హీనమవుతుంది. అతణ్ణి హృదయంలో నిలుపుకుంటే, వైకుంఠ మహానందాన్ని, నరకంలో కూడా పొందవచ్చు. అతను నా భర్త, నా స్వామి, నా పోషకుడు, నా రక్షకుడు. అతణ్ణి మరిచి ఎందుకు బ్రతుకుతాను? కృపానిధి! కృష్ణా! ప్రేమించటం నేర్పు. నేనలా ప్రేమిస్తూ ఆనందించనీ, ఇంకేం అర్థిస్తాను. నాకు కావలసిన ప్రతిదీ ఇచ్చావు. ఇస్తున్నావు. అయాచితంగా నువ్వు ప్రసాదించిన వస్తువుల్ని మళ్ళీ అడగకుండా ఉందునుగాక. ఏ అమూల్య రత్నాలు నీ దగ్గర

ఉన్నాయో నాకు తెలియదు. అన్ని రత్నాలకంటే అత్యుత్తమమైనది ఎంచుకోకుండా, ఒక గాజుముక్క నీ దగ్గరినుంచి తెస్తానని నాకు భయం. నీ నుంచి నేనేదీ అడగనని మనవి చేస్తున్నాను. కాని, వెంటనే ఉత్తమోత్తమమైన రత్నాన్ని నాకు ప్రసాదించాలి. నీ కృపకోసం నేను తపిస్తున్నాను. నాకు అడగటం చేతకాదు, కనుక నాకు కోరికలు లేవని నిర్ధారించుకోకు, నా అవసరాన్ని నీ అంతట నీవే గ్రహించి వాటిని నాకందించు. సోదరీ, మన వాంఛితాన్ని అర్థం చేసుకొని అందించేవాడెవరో అతడు దాతల్లో మహాదాత అయిన కృష్ణుడు. అతణ్ణి మరవకు. అతణ్ణి పరాయి వానిగా భావించకు. క్షణిక ఐహిక బంధాలు చాలాసార్లు మనం కల్పించుకొన్నాం. తల్లులు, తండ్రులు స్నేహితులు, భార్యలు, భర్తలు, అసంఖ్యాకంగా జన్మజన్మకీ మనకున్నారు. కాని ఆ అనుబంధం చిరకాలం నిల్వలేదు. మన గత బంధువులు మనని గుర్తించరు. మనం వాళ్లని గుర్తించలేము. కానీ, సోదరీ, మన అన్ని జన్మల జీవితాల్లోను కృష్ణుడు, మన దృష్టిపథం నుంచి తొలగిపోలేదు. సమయానికి మన కోరికలు తీరుస్తూ సదా మనల్ని రక్షిస్తున్నాడు. అతణ్ణి మరచి ఉండటం కంటే హేయమైనది మరేదైనా ఉన్నదా? దీన్ని పూర్తిగా అర్థంచేసుకొని, ఎప్పుడూ అతణ్ణి పొందాలంటే అతని నామాన్ని తప్పక తీసుకోవాలని ఢంకాపథంగా అందరికీ చెప్పు. సాక్షాత్తు అతనికంటే అతని నామం ఎంతో శ్రేష్ఠమైనది. ఎందుకంటే అతడు ముక్తిని మాత్రమే ఇవ్వగలడు. మరిఅతని నామమో! అతణ్ణి అందుబాటులోకి తీసుకురాగలదు. నామం కంటే ఉత్తమమైన ఔషధం కాని, చక్కని చిట్కాకాని మరేదిలేదు. అతని నామం చేయండి. మీ రోజులు ఆనందంగా గడపండి. ప్రపంచానికి ఆదర్శంగా నిలవండి. ఇదే నేను కోరేది " మీ తాప పాపభారాల్ని నా తలపైన వేసి కృష్ణ ప్రేమలో మగ్నమవండి. దీన్ని చూసి నన్ను ఆనందించనీయండి. నన్ను గురించి నేనొక్క క్షణంకూడా యోచించను. నాకు నరకమంటే భయంలేదు. " మీరు నవ్వుతూ తుళ్ళుతూ కృష్ణుడితో కలవండి ఇది నేను దూరాన్నుంచి చూస్తాను. అంతే. కృష్ణుడు మీరు సాధించి చక్కగా దాచుకున్న నిధి. కృష్ణుణ్ణి , అతడి ప్రేమని మీరు మీ యిష్టంవచ్చిన వారికి అందించగలరు. ఎందుకంటే తాము పురుషులమని డాంబికాలు పల్కే వారికి స్థానం గాని, ప్రవేశం గాని లేని అతని రాజ్యానికి మీరు ఏకచ్ఛాత్రాధిపతులు.

మీ

హర

# 6వ పత్రము

ప్రియ సోదరా హేమూ, ప్రియ సోదరీ (హేమూ భార్య)

మీరు ఆదరంతో వ్రాసిన ఉత్తరం చూచి మహదానంద పడ్డాను. మా మీద మీకున్న అమితమైన ఆదరం మాకు తెలుసు ఎప్పటికీ అలా మేము మీ ఆదరపాత్రులము కావాలని కృష్ణుణ్ణి ప్రార్థిస్తాము. ఏ గత పాపిష్టి కర్మకి ప్రతి ఫలంగా ఆ మారుమూల ఏకాంతంగా ఉండవలసి వచ్చిందో తెలియదు. తలచుకోవటానికి మీరున్నారనే ఆశతోనే దుఃఖమయమైన ఈ ప్రపంచంలో మహదానందంతో గడుపుతున్నాను. మీ ఆలోచనలతో నేను పొందే ఆనందం ఎంత మహత్తరమైనదంటే - నామంచీ చెడ్డా గురించి ఆలోచించటానికే నాకు సమయం లేకుండా పోతోంది. ఆనందంగా ఉన్న మిమ్మల్ని చూస్తూ దుర్భర నరక బాధలకి కూడా భయపడను. సదా కృష్ణ నామానురక్తులవుతూ కృష్ణ ప్రేమతో తన్మయులవుతున్న మిమ్మల్ని చూసి నేను తరించాలి. ఈ ప్రపంచం రెండు రోజులది. ఈ కష్టాలు, సుఖాలు క్షణికాలు. కనుక ఈ క్షణిక సంతోషంతో ఒళ్ళు మరచి శాశ్వతమైన బ్రహ్మానందాన్ని మరచిపోకండి. కృష్ణుడు ఎప్పటికీ ప్రాణమిత్రుడు, బంధువు, ప్రాణానికి ప్రాణం, మిత్రులందరిలో పరమ మిత్రుడు. అతణ్ణి మరువకండి. కృష్ణుణ్ణి విడిచి ఎవరినైనా ప్రేమించటానికి పూనుకుంటే - అతడు తప్పక నీకు దుఃఖాన్ని కల్గిస్తాడు. కృష్ణుణ్ణి కాక ఏ వస్తువునైనా ఆశిస్తే నిరాశే మిగులుతుంది. అన్ని పరిస్థితుల్లోనూ, అన్ని సమయాల్లోనూ ప్రేమ పొంగి పొర్లించే సహచరుడు అతడొక్కడే. అటువంటి ప్రాణ మిత్రుణ్ణి విడిచి మాయలో పుట్టిన కపట స్నేహితుల నుంచి ఆధారాలు, ఆప్యాయత ఆశిస్తే - మన పొరపాటుకి మనం ఆడియాస పాలవటం ఖాయం. పూజించటానికి శాశ్వతమని ఏ భౌతిక వస్తువునీ ఎన్నుకోకూడదు. ఎన్నిసార్లు మనం తల్లి, తండ్రి కొడుకు, కూతురు, భార్య, భర్త వంటి ప్రియ బంధువుల్ని పొందాము! ఎంత గాఢంగా వాళ్ళని ప్రేమించాము! వంచన పాలవటానికి తప్ప!! గత జన్మలో విడిచివచ్చిన వారినిగురించి ఒక్క క్షణమైనా ఆలోచించము. వాళ్ళు కూడా మనల్ని పూర్తిగా మర్చిపోయారు. నాలాగే ప్రతి ఒక్కడు లౌకిక విచారాలలో పడి నీళ్ళలో మునుగుతూ ఉక్కిరి బిక్కిరి అవుతున్న వాడి వంటివాడే. తలెత్తి గాలిపీల్చుకున్నప్పుడు తను పూర్తిగా విముక్తుడ నయ్యాడను కుంటాడు. కాని, మరుక్షణం స్పృహతప్పి నీళ్ళలోకి లోతుగా మునిగిపో[illegible] అటువంటి భయానక దృశ్యం మరొకటుండదు. ఈ రోజు ఒక ప్రియతముని ఊహానిష్క్రమణపు విషాదచ్ఛాయనన్ను అగాధ నైరాశ్యంలోకి త్రోసివేస్తుంది. అత[illegible]

పోగొట్టుకొని రేపు సరిగ్గా అలాంటి నశ్వరమైన మరొక దాని మీద నా ప్రేమని మార్చి ప్రసరింపచేస్తున్నాను. నాదుఃఖాన్ని విస్మరిస్తున్నాను. ఓ ప్రభూ! నీలీల మహాగొప్పదయ్యా! దానికి మొదలూలేదు. చివరాలేదు. నిరంతరం ఒకేరీతిగా ప్రవర్తిస్తూనే ఉంది. ఒక్క సారి కూడా మేర మీరదు. ఏ మానవ ప్రయత్నమూ దాన్ని మార్చలేదు. ఎలాగడిచిందో - అలాగే గడుస్తుంది. ప్రభూ ఒక్కసారి ఈ అద్భుతమైన డోలనుంచి నన్నొక్కసారి ఈ అద్భుతడోల నుంచి నన్నొకమారు క్రిందికి దింపు. దాన్ని సరిగ్గా దర్శించనీ. డోలలో ఉండినేనెలా చక్కగా దర్శిస్తాను? అతిభీతుణ్ణై దర్శించి ఆనందించలేను. నిరంతరం సుడిలో బడి భయభీతుడినయ్యాను. దయచేసి ఒక్కసారి క్రిందికి దింపు. సోదరీ! ఏమిమాట్లాడుతున్నాడో ఎరుగకుండా వెర్రిధోరణిలో పిచ్చివాడు అతిగా ప్రేలాపిస్తాడు. నేనూ అలాగే చాలా సేపు వాగాను, నన్ను లెక్కపెట్టకు, కాని, నేను చెప్పిందేమిటో ఒక్క క్షణం యోచించి, ఒక్కింత నీ హృదయం విశాలమవటం గుర్తించి ఆనందిస్తావేమో! నీకు గానీ, నాకుగాని ఈ ప్రాపంచికమైన దేదీ శాశ్వతం కాదు. ఇవ్వాళేది ఇవ్వబడిందో రేపు అది తీసుకోబడుతుంది. ఎవరిస్తారో అతడే తీసుకొంటాడు. కొద్ది క్షణాలు పోషించి, మన చేతుల్లో ఉన్నవి మన స్వంతమనుకుంటాము. కనుక వాటినుంచి వేరయ్యేటపుడు దుఃఖంతో వ్యధ చెందుతాము. దీన్ని ఒక్కింత గ్రహిస్తే, మనం ఘోర తప్పిదంలో పడటంనుంచి, పర్యవసానంగా తాత్కాలికంగా మన చేతుల్లో ఉన్న వాటిని కోల్పోవలసి వచ్చినప్పుడు, విచారించటం నుండి తప్పించుకొంటాం. సోదరీ! ఐహికమైన అన్ని వస్తువులు అతనిచేతే ఇవ్వబడతాయి. తీసుకొనబడతాయి. అని ఘంటాపథంగా చెప్తాను. ఏదీ నా స్వంతమని చెప్పుకొనగలిగింది లేదు. ఈభౌతిక శరీరం కూడా అతనిదే. అతని ఇష్టానుసారం తీసుకొని వెళ్ళబడుతుంది. ఇతరుల ఆస్తిని మనదని భ్రమించి, ఎడబాసేముందు ఎంతో పరితపిస్తాం. మన హృదయాలలో వసించి కృష్ణుడు ఎల్లప్పుడూ ఇది జ్ఞాపకముంచుకోనేటట్లు చేయుగాక అని కోర్తాను. మానవుడు అతణ్ణి చూడలేడు. కాని అతని నామం సదా అతనితో ఉంటుంది. మనసా వాచా కర్మణా దాన్ని ఆశ్రయించుకొందుము గాక! నామం " నా స్వంతము " అని అనుకునే, స్థితి వచ్చినపుడు, సాక్షాత్తూ అతడే నా స్వంతమవుతాడు. మనిషిగానో పురుగునో, ఈగగానో నేనతణ్ణి తప్పక చూస్తాను వ్రజధామంలోని జంతువులూ, పక్షులూ అతన్ని చూస్తున్నాయి. అతనితో ఆడుకొంటున్నాయి. సోదరీ! అలా ఆనందపూర్ణుడైన అతనితో ఆనందంగా క్రీడించదలిస్తే అతని నామాన్ని నిర్లక్ష్యం చేయకు. ప్రాపంచికమైన ప్రతి వస్తువునీ

విస్మరించి నామంలో లీనమయిపో, బ్రహ్మానందం పొందుతావు. అన్ని కష్టాలు తీరతాయి. ప్రియతముడైన కృష్ణుడికి ప్రియతమమైన ప్రియతమవై సదా ప్రశాంతంగా ఉంటావు. నామాన్ని విడచి దేన్ని సమీపించినా అది నిన్ను అపరిచయస్తునిలా నిరాదరిస్తుంది. వజ్రాన్ని గురించి వినని వాడెవడైనా, వాడిచేతుల్లో అదిపడితే దాన్ని విసిరిపారేస్తాడు. కాని, రత్నాన్ని గురించి విన్నవాడు - గాజుముక్కల్ని రత్నాలుగా భావిస్తూ యేరుకుంటాడు. గాజుముక్కల్లో రత్నాలు కనుక్కోవాలనే ప్రయత్నంలో వాస్తవ రత్నాన్ని అతడు ఏరుకోవచ్చు. 'కృష్ణా' 'కృష్ణా' అంటూపో. దీన్ని, దాన్ని కృష్ణునిగా గ్రహించు. ఒకరోజున గొర్రెలమందలో తోడేలు కనిపిస్తుంది. నీవు కృష్ణుణ్ణి దర్శిస్తావు. నీ కోరికలన్నీ ఈడేరతాయి.

నీ
హర

# 7వ పత్రము

తమ్ముడూ సుధీ!

ఈ రోజు నీ ఉత్తరం చూసి చాలా బాధపడ్డాను. అలా మన అమ్మ మనల్ని విడిచి వెళ్తుందని ఎవరనుకున్నారు.? వారు ఏది అనుకుంటారో అది చేస్తారు. తల్లులు లేని ప్రపంచం ప్రపంచం కానేకాదు. తమ్ముడూ, మహాయోగికి కూడా అమ్మ గతించినట్లు గతించటం సాధ్యంకాదు. ఆమెకి జన్మించి నీవు ధన్యుడవయ్యావు. దురదృష్టవంతుణ్ణి కనుక ఒక్కసారైనా ఆమెను దర్శించుకొని పవిత్రుణ్ణి కాలేకపోయాను. ఆ ఇచ్ఛామయుని సత్సంకల్పం వల్లనే అంతా ఆధారపడి ఉంటుంది. ఎప్పుడూ తాపత్రాయాలలో తచ్చాడే మనకేం తెలుసు? వేదాలకి కూడా భగవానుని లీలలు అర్థం కావు. ఇంకా మానవ మాత్రుల తెలివి గురించి చెప్పాలా? ఈ రోజున నీ వాసించు కోరిక తీర్చగలిగిందేదీ ఈ ప్రపంచంలో లేదు. ఏమైనా ఆమె ఆజ్ఞలలో ఒక్కటైనా నీ జీవితాశయంగా పాటించగలిగితే మహత్తరమైన ఉపశమనం పొందుతావు. మన కంటికి అదృశ్యమైనంత మాత్రాన అమ్మ మనల్ని పూర్తిగా విడిచి వెళ్ళిందనుకోకు సర్వకాల సర్వావస్తలల్లోనూ అమ్మమనతోనే ఉంది. స్థూల శరీరంతో ఉండటమనే ఆటంకం వల్ల సర్వత్రా మనమీద దృష్టి ఉంచ టం సాధ్యం కాలేదు. కనుక, సూక్ష్మమైన సుకుమారమైన శరీరాన్ని ధరించటానికి, ముఖ్యంగా భౌతికశరీరం శాశ్వతం కాదు కనుక విడిచిపెట్టింది. చూడు. ఆమె పట్ల గౌరవాన్ని చూపటానికి ఇదే సమయం. భౌతిక ప్రపంచాన్ని విడిచి మన హృదయాల్ని ఆమె

తన నివాసం చేసుకుంది. ఇప్పుడు ఆమె నివాసాన్ని సదా పవిత్రంగానూ, సుగుణాలంకార యుక్తంగాను ఉంచు. మాలిన్యం ఎంత తక్కువగానైనా నీ హృదయంలో మిగిలిందా, అది ఆమెకు బాధ కల్గిస్తుంది. దాన్ని పవిత్రంగా ఉంచు. ఈ హృదయంలో నివసిస్తూ ఆమె తన చివరి క్షణాల్లో జపించిన నామం వినేటట్టు ప్రత్యేక శ్రద్ధ తీసుకో, నామాన్ని మర్చిపోకు. నిరంతరం నీ తల్లి దీవెనలు పొందటమే నీ కర్తవ్యం. నీ తల్లిని పోగొట్టుకొన్నావనే అపోహపడకు. ఎప్పుడూ నీతోనే ఉండటానికి ఆమె సూక్ష్మ శరీరాన్ని ధరించింది. నీ తల్లికోసం పరితపించకు, కాని లేశ మాత్రమూ ఆమెకు కష్టం కలిగించకు. నీకు మార్గదర్శకంగా ఉండేందుకు అమ్మ పవిత్ర పాద పద్మాల మీద నీ మనస్సు కేంద్రీకరించు. భయపడకు, కష్టాలనుండి ఆమె నిన్ను రక్షించి నిన్ను ఆనందపరుస్తుంది. సదా ఆమె సేవలో ఉండు, అశాంతిగా ఉండకు. ప్రేమ మౌనంగా హృదయంలో పనిచేస్తుంది. మాటలతోను, కళ్ళతోనూ వ్యక్తమయ్యే ప్రేమ ప్రేమేకాదు. అటువంటి ప్రేమ ఒకచోట లాలస, మరొకచోట పరిపూర్ణస్వార్థము.

తమ్ముడూ సుధీ, పోలీసు శాఖ సంస్కరింపబడాలన్నది నిజం. ఈ విషయంలో న్యాయాలూ, చట్టాలూ మార్పు తెస్తాయని ఏమీ ఆశించ నక్కరలేదు. కాని, నీవంటి మంచి, సమర్థులైన వారిచేత నింపబడిందా- ఎంతో మంచి జరగవచ్చు. నీ అవకాశాన్ని జారవిడుచుకోకు. చక్కగా ప్రవర్తించు, నీ వర్తమాన భవిష్యజ్జీవితాలు సౌఖ్యావహంగా మార్చుకొంటావు. తమ్ముడూ, ఎక్కడ అపాయమూ, ఆకర్షణా ఉంటాయో అక్కడే ప్రాప్తి , ప్రతిష్ఠా ఉంటాయి, అని విశదం కదా. కనుక స్థిమితంగా ఉండు. స్థైర్యంగా పాముతో చెలగాటమాడు. దాని కదలికల్ని నీ కళ్ళతో నిశితంగా కనిపెట్టటం మర్చిపోకు. నీవు ప్రపంచానికి మేలు చేయటానికి ప్రయత్నించాలనీ, అందులో సఫలీకృతుడవు కావాలనీ ఈ భగవంతుణ్ణి ప్రార్థిస్తాను. మౌనంగా పురోగమించు. నీ వాంఛితాలు ఈడేరతాయి. కొంతకాలం నీవు కష్టపడి పనిచేయాలనుకో, కాని భయపడకు. ఎంతో శ్రద్ధతో నీ పని నేర్చుకో, కాని అన్నింటికి మించి ఇతరులకి మేలు చేయాలనే నీ సంకల్పాన్ని దృష్టిలో పెట్టుకో. కృంగదీసే ఆలోచనల్ని దరిచేరనీయకు. మనసా, కర్మణా వాచా మానవులకి మంచి చేయటానికి ప్రయత్నించు. సత్యం చెప్పటానికి ఎప్పుడూ సంకోచించకు. కాని, ఎవరికైనా అది పెద్ద నష్టం కల్గిస్తుంటే నీవు మౌనంగా ఉండవచ్చు. పోలీసు పాలనా యంత్రాంగంలోని మానవతా లక్ష్యం నీ జీవిత పరమార్థం చేసుకో. చట్టాల అవకతవకల్ని పట్టించుకోకు. '' కృపామూర్తి అయిన కృష్ణుణ్ణి, అతని మధుర నామాన్ని, ఏ పని చేస్తున్నా తలుచుకుంటూ ఉండు. నామాన్ని మరువకు. అతని నామమే అత్యుత్తమ

మంత్రమని జ్ఞాపకం పెట్టుకో '' చాలా మంది దుష్టుల్ని, పెడదోవ పట్టిన వారిని పవిత్రం చేయగలవు. అవకాశం జారవిడుచుకోకు. నీ హృదయంలో పరోపకార లక్ష్యంతో పనిచేయి. నీవు సఫలీకృతుడవవుతావు.

నీ
హర

# 8వ పత్రము

తమ్ముడూ సుధీ, (సుధీరంజన్ సేట్)

నీ ఉత్తరం చదివి ఆశ్చర్య పోయాను. ఏమిటి, నా ఉత్తరాలు నీ కందలేదా?నీకు రెండు కార్డులు వ్రాశాను. ఏమైనా, ప్రశాంతంగా సాగిపో, నీ కోరికలన్నీ నెరవేరుతాయి. నీవు ప్రశాంతినీ పరమానందాన్ని అనుభవిస్తావు. ఇది మనసులో పెట్టుకో - మృత్యువు లాంటి పాము విషం ఒక్కొక్కప్పుడు ప్రాణాన్ని కాపాడేదవుతుంది. నీ జీవితమే దీన్ని అవునో కాదో తేల్చాలి. కనుక, అటువంటి దారుణ సమస్యల్ని సంతోషాంత రంగంతో ఎదుర్కొమ్మని అంటాను. శాంతంగా, నిశ్చింతంగా పురోగమించు. విజయవంతంగా కార్యాన్ని నిర్వహించుకురా. నీలాంటి మంచి వృక్షపు పుష్పాల్ని నన్ను దర్శించనీ, నా జీవితం అంతమయ్యేలోగా నేను చూడగలిగేటట్లు ఆ సుదినం త్వరలో ప్రసాదించమని శ్రీకృష్ణుణ్ణి ప్రార్థిస్తున్నాను. ఏరకంగానూ వెనుకబడి ఉండవద్దు. నీ పనిని శ్రద్ధతో నేర్చుకో.ప్రతివారూ నీ పనిని చూసి మెచ్చుకొనేటట్లు పనిచెయ్యి. ఎవ్వరికీ విమర్శించే అవకాశం ఇవ్వకు. ఇలా సాగిపో, నీ తల్లిని మెప్పించగలుగుతావు. నీ మొదటి జీతంలో కొంతభాగం ఎలా ఖర్చుపెట్టాలో. అలా ఖర్చుపెట్టావు. ఇక్కడొకమాట, పవిత్ర హృదయంతో ఒక్క రూపాయీ పావలాని దాచిపెట్టు. సమయం వచ్చినపుడు చెప్తాను అది ఎలా ఖర్చుపెట్టాలో ప్రతినెలా నాలుగణాలు ఈ రూపాయీ పావలాకి జేర్చు. ఒక పవిత్ర కార్యానికి ఉద్దేశించబడిన ఈ డబ్బుతో చాలా మంచి చేయవచ్చు. నీ తల్లికి ప్రతి ఉదయం, సాయంత్రం నమస్కరించు. ఎప్పుడూ నీ సమక్షంలో ఆమె ఉన్నట్లు భావించు. నీకు సాధ్యమైతే ఎప్పుడూ ఎవర్నీ కష్టాల్లోకి ఈడ్చకు, అలా చేయాలని ఊహించకు. పాపం చేయటంలో దురాలోచనలు దుష్కర్మలకన్నా బలవత్తరమైనవి. కనుక సదా నీ సమయాన్ని మంచి ఆలోచనలతో గడుపు. ఎప్పుడన్నా సమయం దొరికితే - ఏకాంతాన్ని కోరుకో. అక్కడ ఏకైక లక్ష్యంతో కృష్ణుని పవిత్ర పాదాల్ని, అతని మధుర నామాన్ని ధ్యానించు. తగిన స్నేహితుడు దొరకకపోతే ఒంటరిగానే ఉండు.

నీ
హర

# 9వ పత్రము

తమ్ముడూ సుధీ!

నీ ఉత్తరమూ, పోస్టుకార్డూ భూషన్ నుంచి వచ్చిన మరొక ఉత్తరంతో బాటు అందినాయి. కష్టాల్లో మొదలైన జీవితం సాధారణంగా సుఖవంతమౌతుందని అతనితో చెప్పు. ఇది నేను అతని వైవాహిక జీవితంలో చూశాను. వృధాగా అల్పమైన విషయాలలో మునిగి ఉండవద్దని చెప్పు. అతని భార్య స్వభావం చాలా యోగ్యమైంది. ఆమె అభిమానవంతురాలు, ఆత్మగౌరవం కలది. అతని అర్థం లేని కోరికలకి ఎర అయి అవమానపడటానికి ఆమె విపరీతంగా భయపడుతోంది. అంతకంటే ఏమీలేదు. తమ్ముడూ సుధీ! భార్య ఆట వస్తువు కాదు. సహధర్మచారిణి, అంటే ధర్మకార్యాలలో సహకరించేదని. స్త్రీలు లక్ష్మిదేవికి ప్రతినిధులు. ఏరకంగా పొరబడినా, అదృష్టాన్ని జారవిడుచుకోవటం ఖాయం. వారు విశ్వానికి జీవాలు, భక్తి ప్రేమలకు ఆధారాలు, అగౌరవింపబడ్డారా, వారి భయంకర రూపాన్ని కాళిగా, పిశాచాలుగా, రాక్షసులుగా, వ్యక్తీకరిస్తారు. సర్వమూ నాశనం చేస్తారు. నీచస్త్రీలు సూక్ష్మంగా తమ ప్రళయ రూపాన్ని ద్యోతకం చేస్తారు. పారావారం లాంటి ఈ స్త్రీజనంలో అనర్ఘరత్నాలను దర్శించాలి. సంస్కారులైన బుద్ధిమంతులు అటువంటి రత్నాల్ని గాలించి నిశ్చింతగా రోజులు గడుపుతారు. బలహీనులు, బుద్ధిహీనులు అంధులై కామాతురులై - ఈ క్షణంలో తమ జీవితాలు అంతం చేసుకోవటానికి ఆ సముద్రంలో మునుగుతారు. ఈ భయంకర శక్తితో అతిజాగ్రత్తగా మెలుగు. స్త్రీల వైపు కామ దృష్టితో చూడకు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు స్త్రీలో ఏకీకృతమై ఉన్నారు. స్త్రీలని అగౌరవపరచటం - తక్షణ వినాశాన్ని ఆహ్వానించుకోవటమే. గత ఆధునిక చరిత్రలు దీన్ని నీకు ద్యోతకం చేస్తాయి. ద్రౌపదీ పరాభవమే కౌరవ వినాశనానికి హేతువు. సీతాపహరణమే రాక్షసకుల సర్వవినాశనానికి దోవతీసింది. హెలెన్‌కి జరిగిన అగౌరవమే ట్రాయ్ వినాశనానికి హేతుభూతమయింది. సరోజినికి చేసిన పరాభవాలు హిందూ దేశంలో ముసల్మానుల పాలనను అంతం చేశాయి. అటువంటి స్పష్టమైన ఉదాహరణలే దాదాపు ప్రతి ఇంటిలోనూ దొరుకుతాయి. వాటిని చూడటానికి దూరం పోనక్కరలేదు. ఎక్కడ స్త్రీలు గౌరవింపబడరో - శాంతి, తృప్తి తక్షణమే అక్కడి నుంచి పోతాయి. ఏమైనా, నేను నీకు ముఖ్యంగా చెప్పేదేమంటే - నీభార్యని ఆట వస్తువుగా చూచి మోసపోవద్దని, ఇప్పటి నుంచే జాగ్రత్తపడు. పాశ్చాత్యుల్లా గానో, బ్రహ్మ సామాజికులలాగానో నీ భార్యను తర్ఫీదుచేయకు. హిందూ కుటుంబంలో

హిందూ గృహిణి ఒక ప్రేమాస్పదమైన వస్తువు. ఈ విషయంలో ఎక్కువ చెప్పటానికి నాకు అధికారమూ లేదు. ఉద్దేశమూలేదు. ఇప్పుడు నీవు వేసినటువంటి చిక్కు ప్రశ్నలు వేసి నన్ను ఇబ్బంది పెట్టకు. నేను తెలివిలేనివాణ్ణి గనుక నేను వాటికి సమాధానము చెప్పగలనని ఎప్పుడూ ఆశించకు. నీ భార్యపట్ల నీవు ఊహించుకున్న నీచదృష్టి వల్ల నీవు మోసగింపబడతావని నా కనిపిస్తోంది. ఈ క్షణం నుండి జాగ్రత్తగా ఉండు. ఒక మంచి ఇల్లాలుగా ఆమెని తీర్చిదిద్దు. ఇది మనస్సులో పెట్టుకో. భర్తపట్ల విశ్వాసమే భార్యకి అందం. ఆమె రూపురేఖలు నదురైనవా కావా అనేది అసలు లెఖ్ఖలోనికేరాదు. ఆమె బాధపడుతున్న తల్లికీ తదితర పెద్దలకీ పూర్తిగా విధేయంగా ఉండి భర్తకి కష్టసుఖాల్లో సహకరిస్తుండాలి. అటువంటిది భార్య, సహధర్మిణి. కళ్ళకింపైన భార్యల్ని లక్షలాదిమందిని పొందవచ్చు. కాని హృదయానువర్తులైన వాళ్ళని పొందటం కష్టం. కేవలం కంటి కింపుగా ఉండే భార్యల్ని ఆశించకు. నీ బాధ్యత ఏమరకు. అసమాన మంత్రం కృష్ణుని మధురనామాన్ని మర్చిపోకు.

నీ
హర

## 10వ పత్రము

బాబా జోగేష్ చంద్ర బంధోపాధ్యాయగారి కుమార్తెకు,

ప్రియమైన అమ్మా

నా ఉత్తరం అందుకున్న తర్వాత నువ్వుమౌనంగా ఉంటున్నావు అందుకని రాక్షసీ మాత అనిగాని, పిల్లల్ని చంపే షష్టిమాత అనిగాని పిలవనా? షష్టిమాతవి నీవైతే నేను నీకొడుకు ఇనుపభీముణ్ణి. నువ్వు నన్ను చంపలేవు. కేవలం నీ పళ్ళు విరగగొట్టుకుంటావు. నీ కొడుకు మహదానందంలో ఉన్నాడు. అతనికి ఆటంకంగా ఉండకు. అల్లరి పిల్లవాడు కనుక అతనికేంతోస్తే అది అతను చేయవచ్చు. అతణ్ణి లెఖ్ఖపెట్టకు. నవ్వుతూ తుళ్ళుతూ పావన కృష్ణపాదారవిందాల మీద మనసు లగ్నం చేసి ఈలోకంలోకిరా. నీవు అన్నీ మర్చిపోవచ్చుకాని కృష్ణుణ్ణి మర్చిపోకు. మొహం దాచుకొనేటట్టు చేసే ఏ పనిలోనూ చేయి పెట్టకు. నవ్వటానికి వచ్చావుగనుక నవ్వుతూ సాగిపో. దేని జ్ఞాపకాలు నీ మనస్సును ఆనందపరుస్తాయో అది మంచిపని గనుక ఆ పనిచెయ్యి. దేని జ్ఞాపకాలు భయంతో ఒళ్ళు జలదరింపజేస్తాయో అది పాపపు పని కనుక ప్రలోభపడి పతనమవకుండా జాగ్రత్తగా సాగిపో. నేను

మహాపాపాత్ముణ్ణి కనుక, అటువంటి పాపాత్మురి తల్లి అని నిన్నెవరూ కించపరచకుండా చూచుకో. ప్రతివాడూ నీ పనిని మెచ్చుకొనేటట్లు చూసుకో. ఒక లేత మొక్క ఏవైపుకి వంచితే ఆవైపుకి వంగుతుంది. ఇప్పుడు నీవు ఎన్నుకోబోతున్న మార్గం అనుసరించటానికి నీకు సుగమం. ఈ స్థితిలో ప్రజలు మంచిదో చెడ్డదో తాము ఎన్నుకున్న భవిష్యత్కార్యక్రమాన్ని రూపుదిద్దుకోగలరు. ఇప్పుడు కొంచెం జాగ్రత్తగా ఉండటం మంచిది. భయమూ, సిగ్గూ లేకుండా ఏకార్యం నిర్వర్తించగలవో ఆపనిచెయ్యి. దేవతలలో ఉత్తమోత్త ముడిలా నీ భర్త గౌరవించబడాలి.

అతని తల్లిదండ్రులు నీ తల్లిదండ్రులవంటివారే. ఏ తల్లి నిన్ను గర్భంలో ధరించిందో, ఏ తండ్రి నిన్ను పోషించాడో వాళ్ళు నిన్ను నీ వివాహంలో ఇచ్చి వేశారు. నిన్ను వారు ఇచ్చివేశారు కనుక వారికి నీపైన ఇంకా ఏ హక్కుగాని, అధికారంగాని, లేవు. నీ తల్లిదండ్రుల్లో ఎవరైనా పొరపాటున అటువంటి అధికారాన్ని అభిలషిస్తున్నారా, వాళ్ళు తప్పుచేస్తున్నట్లే. నీ అత్తమామల్ని సశరీరులైన దేవత, దేవుళ్ళులా గౌరవించు. హృదయపూర్వకంగా వాళ్ళు నిన్ను దీవిస్తే నీ వప్పుడు యే బాధా అనుభవించనక్కరలేదు. కాని నీ పట్ల సుముఖంగా లేకపోతే నీవు వైకుంఠంలో కూడా ఆనందం పొందలేవు. నీ పిచ్చి కొడుకు మాటలు మనసులో పెట్టుకో అమ్మా. నే నెప్పుడూ నీకొడుకుగా ఉండగలనా? నేనలా ఉండేటట్టు దీవించమ్మా నేను మహదానందంలో ఉన్నాను. నా విషయంలో అశాంతిగా ఉండకు. రాత్రింబవళ్లు ఆడకు, చెడ్డపుస్తకాలు చదవకు దుష్ప్రసంగాల్లో ఎన్నటికీ పాల్గొనకు, దుష్కర్మచెయ్యకు, ఎప్పటికీ ఇతరుల్ని చేయనీయకు.

నీ
హర

# 11వ పత్రము

తమ్ముడూ, రాధా,

స్వర్గాన్ని యధాతధంగా నీ ఉత్తరం నాకైవశం చేసింది. నిజం తమ్ముడూ, ఈ ప్రపంచం చిరస్థాయిగా నిలవవచ్చు. అయినా మనది అని మనం పిలుచుకునేది నిలవదు. ఇది కచ్చితంగా నిశ్చయం. గౌరవం, ధనం, భార్యా, పిల్లలు, బంధువులు ఎల్లకాలం మనవారు కారు. ఇది సత్యం. ఒక్క క్షణం అద్దెఇల్లు లేక తోట నీదని అనుకుంటున్నావు. కాని, కొంచెం ఆలోచిస్తే నీవు - గడువు పూర్తి అయిన వెంటనే

మరొకరి సొమ్మవుతుందని గ్రహిస్తావు. ఆ తోట, ఆ ఇల్లు అలాగే ఇదివరకటి లాగానే ఉంటాయి. నీవు మాత్రం వాటి ఆధిపత్యం కోల్పోతావు. కనుక నశ్వరమైన విషయాల మీద అంత అతురత ఎందుకంటాను. లక్షల,కోట్ల రూపాయలకి అధిపతివి కావచ్చు. నీ కడుపు నింపుకొనగలిగినంతకే నీకు వ్రాసి పెట్టి ఉంది. మిగిలింది ఒకచోట కుప్పగా పోసి ఉంటుంది. నా మాటలు అర్థం చేసుకున్నావని నేను చాలా సంతోషిస్తున్నాను. నిరంతరం నీ సొమ్మయిన హరినామాన్ని సదా దృష్టిలో ఉంచుకో. దాన్ని వృద్ధి చేయటానికి, నామంతో ఆర్తునికి సహాయం చేయటం ద్వారా వడ్డీకి అప్పుఇవ్వు. నీవానందంగా ఉండు, వాళ్ళని కూడా ఆనందంగా ఉంచు. ఈ నామాన్ని అందరికీ ఇవ్వటానికి ప్రయత్నించు. చివరికి వాళ్ళచేత దెబ్బలు తినవలసి వచ్చినా సరే,వాళ్ళ చేతుల్లో అన్ని రకాల అవమానాలని అనుభవించినా సరే, ఈ ప్రాపంచిక విషయాలకి దేనికీ అంత అతురత చూపకు. మంచివైనా, చెడ్డవైనా, అన్ని వ్యాసంగాల్ని నీ మనస్సు నుంచి తొలగించు. మానవుడిచ్చిన గౌరవం గౌరవ మెట్టా కాదో అట్లాగే అగౌరవమూనూ. దేనినీ హృదయంలో అంతగా పట్టించుకోకు. నీభావనా జగత్తులో ధన్యుడివిగా ఆనందంగా ఉండు

నీ
హర

## 12వ పత్రము

బాబూ, జతీన్,

నీ ఉత్తరం చదవటానికి నాకు చాలా బాధగా ఉంటుంది. నీ కష్టాలు తల్చుకున్నప్పుడు నేను చాలా బాధపడతాను. ప్రతిదీ భగవానుని ఇచ్ఛప్రకారం వస్తోంది, పోతోంది. మనం ఏరకంగానూ ఘటనలకి కర్తలం కాలేము. ఏమైనా గత కర్మల్ని అన్నింటినీ మర్చిపోయి, జరగబోయేదానికి జాగ్రత్తగా ఉండు. పశ్చాత్తాపాగ్నితో నీ హృదయాన్ని నిర్మలం చేసుకో, ఆ కరుణాళువైన కృష్ణుడు తన దయార్ద్ర దృష్టిని తప్పక నీపై ప్రసరిస్తాడు. ఇప్పుడు నేను కోరేది, కృష్ణణ్ణి ప్రార్థించేదల్లా, నీవు త్వరగా స్వస్థుడివై, వచ్చి నీ ఉద్యోగంలో జేరాలని. కృష్ణుడు తన దయార్ద్ర దృష్టి నీపై ఉంచకపోతే ఈ రోజు నీ ప్రాణాలు నీ బొందిలో నిలచేవా? ఏమైనా అతణ్ణి మర్చిపోకు. అతని నామాన్ని విడిచిపెట్టకు. అతడు అతని నామమనే త్రాటితో మాత్రమే బంధింపబడతాడు. మరేదీ అతణ్ణి ఎప్పుడూ బంధించలేదు. నిరంతరం ఈ ప్రాపంచిక వ్యామోహాలలో మునగవద్దని, మా అమ్మతో చెప్పు. ఎన్నోసార్లు ఈ

భూమి మీదకి వచ్చాను. కాని, కృష్ణుణ్ణి ధ్యానించక పోవటం చేత ఈ రాకపోకల్ని అంతంచేయలేకపోయాను. ఈసారి కూడా మరువ కుందునుగాక! బాబూ, నీవు నాపై తప్పుపట్టావని విన్నాను, నిజమేనా? లేక చాలాకాలం తర్వాత కూడా నాగురించి నీవు విచారించవలసిన స్థితిలోనే నేను ఉన్నందుకా! బాబూ, నీకు అర్హత ఉన్నది కనుక, న్యాయంగా నీవు గర్వించగలవు, కాని, నా స్థితి ఏమిటో తెలుసుకుని కూడా, నేను గర్వించటం అవివేకం. భూమి మీద నేను ఒక మహాకర్మిష్టి జీవినయినప్పుడు నేనెలా గర్విస్తాను? పవిత్రాతి పవిత్రులు కనుక - మీరంతా అభిమాన వంతులు అగుదురు గాక! అప్పుడు నేను సంతోషిస్తాను. కాని, నేను చెప్పేదిదే - ఎవరినైనా తప్పుపట్టదలిస్తే - కృష్ణుణ్ణి తప్పుపట్టండి. మనుష్యుల్నీ, ఈగల్నీ, పురుగుల్నీ, తప్పు పట్టకండి. నీవెవర్ని గాఢంగా ప్రేమిస్తావో వాళ్ళని మాత్రమే తప్పు పట్టగలవు. కనుక, నీ హృదయపూర్వకంగా అతణ్ణి ప్రేమించు, అతణ్ణి మాత్రమే తప్పుపట్టు, ఇతరులను నిందించకు, మరి ప్రయోజనమూ లేదు. ఎందుకంటే - నీ అహంకారాగ్నిలో నిన్ను నీవే దహించుకుని మరణిస్తావు. కనుక బాబూ, కృష్ణుణ్ణి ఎప్పుడూ నీవాణ్ణిగా ప్రేమించు అని అంటాను. ఈ ప్రాపంచికమైనదేదీ శాశ్వతం కాదు. కాని, ఇక్కడ మనం చేసేదంతా - ఈ జన్మలో మన కర్మలూ - వాటిపుణ్యాపాపాలు వాటంతట అవి నశించేంతవరకూ ఉంటాయి. అందుకని, నీ స్వీయకర్మల మీద ఎల్లప్పుడూ ఒక కన్నువేసి ఉంచాలి.

నీ
హర

## 13వ పత్రము

బాబూ, జతీన్,

ఆ రోజు నీకు వ్రాశాను. మళ్ళీ ఈ రోజున చక్కగా నీ కార్యక్రమాలు నీవు నిర్వర్తించుకుంటున్నావని 'రాధ' వలన విని చాలా సంతోషించాను. పూర్ణ సంకల్ప అయిన ఆ దివ్యమాత సంకల్పం వల్లనే ఇదంతా జరిగింది. నిన్నెడబాసి ఉండటానికి బహుశా ఇష్టంలేక, నిన్నామె స్వష్టుణ్ణి చేసింది. ఇప్పుడు కొంతకాలం ఏచీకూ చింతలూ లేని హృదయంతో మన ఇరువురికి అయిన అమ్మతో ఉండు, బాబూ, భార్య దగ్గర ఉండటం తప్పని ఏమాత్రం భావించకు. వారు (స్త్రీలు) మూల శక్తులు. వారికి కృష్ణుడిపై ఒక రకమైన అధికారం ఉన్నది. ఎవరిపై వారికి దయగలిగితే, వారికి, వారు కృష్ణుణ్ణి ఇవ్వగలరు. శ్రీచైతన్య చరితామృతం ద్వితీయభాగం అష్టమా

ధ్యాయంలో " రాధాయా ః భవతంచ చిత్తజతునౌ" అని ఆరంభమయ్యే శ్లోకం ఒకటి నీవు చూస్తావు. అలా ఒకసారి ఆ శ్లోకాన్ని గూర్చి మూడు నాలుగు నెలలు చింతనచెయ్యి , దాని విశేషం గుర్తిస్తావు. కొంచెం ఆలోచించు ఈ రమణీయ భువన భవనం ఎలా అలంకరింపబడిందో, ఎవరు దీనిని అలా సింగారిస్తున్నారో నీవే గ్రహిస్తావు. ఈ విధంగా అలంకరించటంలో సహాయపడు. క్రమంగా ఈ పనిని నీవే చేయగలుగుతావు. అప్పుడు నీ అంతట నీవే మిరుమిట్లు గొలిపే కెంపు వన్నెలతో సింగారిస్తావు. ఒక సుతారివద్ద కూలీగా పనిచేస్తూ క్రమంగా అతని పనిని నేర్చుకుంటావు. అప్పుడు సంతృప్తి పడతావు. పంజరాల్లో బంధింపబడిన పక్షుల్ని చూడటంకంటే, అడవి పక్షుల్ని చూసి ఆనందించు. పక్షుల్ని పట్టుకునేవాడు తను పట్టుకొన్న ఆ ఒక్క పక్షినే చేజిక్కించుకోగలుగుతాడు. పక్షుల్ని పట్టుకోనివాడు పక్షులన్నింటినీ తనవిగా చెప్పుకోగలడు. ఇప్పటివరకూ పట్టుకున్నవి చాలు. ఇంకా పట్టుకోవటానికి ప్రయత్నించకు. అంతకంటె పట్టిన వాటిని వదిలి పెట్టటానికి ప్రయత్నించు. నీ అంతట నీవు వాటిని విడిచిపెట్టటానికి సుముఖుడివి గాకపోతే తలుపులు తెరిచిపెట్టు. వాటి కిష్టం వచ్చినట్లు అవి వెళ్తాయి. లేదా ఉంటాయి. ఏదో పిచ్చిలో వ్రాశాను. దాన్ని గురించి నన్నేమీ అడగకు. పిచ్చివాడిలాగా ఏదో వాగాను. నేనే నా మాటల్ని అర్థం చేసుకోలేను . యోచించు, అవన్నీ నీకు అర్థమౌతాయి. నీవు ఎవర్నీ సంప్రదించనక్కరలేదు. బాబూ జతీన్, మీ అందరితోను ఈ ప్రపంచమంతా నాకు ఒక బృందావనంలా కనిపిస్తోంది. కృష్ణుడు నిన్ను శాశ్వతానందంలో ఉంచుగాక ! ఇది ఒకటే అతనికి నా ప్రార్థన. మన శిరస్సులు వంచి, అతని పాదాలవద్ద శరణాగతి పొందటం కంటె మనం చేయవలసినదేమీ లేదని నేను భావిస్తాను. బాబూ, నీవు వ్రాసే పద్ధతి నా ప్రాణాల్ని తీస్తోంది. నా కృష్ణుని సామ్రాజ్యంలో అంత విచారించవలసిన దేదీలేదు. ఆ ఆనంద సామ్రాజ్యంలో సంతోషం తప్ప మరేమీ లేదు. కనుక కృష్ణ నామం చెయ్యి. నీ రోజుల్ని సంతోషంలో గడుపు. మనం కోరిందల్లా అతని నుంచి పొందినప్పుడు, మన మెందుకు మౌనంగా ఉండాలి? మనం అతని నుంచి కోరిన ప్రతిదీ మనం అతని నుండి పొందుతామని గ్రహించిన తర్వాత, మన మెందుకు ఆతురత పడాలి? మన రోజుల్ని ఎందుకు దఃఖంలో గడపాలి? కాని మనమంతా ఒక్కటి మనసులో పెట్టుకోవాలి. "అతని నుండి రత్నానికి బదులు రాయిని మనం కోరగూడదు". ఒకటి రెండు ఐహిక వాంఛితాల్ని అతని నుంచి కోరిన తర్వాత, మన మేది ఆర్థిస్తే అది మనం పొందుతాము అని దృఢంగా విశ్వసించాలి. నమ్మకం కలిగేందుకే ఒకటి రెండు వస్తువుల్ని మాత్రం అతణ్ణి అడగాలి. కాని, తర్వాత మరింకా ఏ ఐహిక వాంఛితాల్నీ కోరకు. ఏమీ

అడగకు. అతని నుంచి ప్రేమ, భక్తి తప్ప. ప్రేమ అతని నుంచి అర్థించటం ప్రారంభించినప్పుడు మొదట్లో కొంత వ్యతిరేకత ఎదురౌతుంది. తిరోగమించావా, నీకు ఎదురే , ముందుకు సాగావా జయమాలిక నీదే.

ఆకాశంలో ఉన్న చంద్రుణ్ణి చూపి పసిపాపని ఎలా మోసపుచ్చుతారో అలాగే అతడూ - నీవు ప్రేమ నడిగి నప్పుడు ఆటవస్తువుల్లాంటివి ఇచ్చి, మభ్యపెడతాడు. కాని మోసపోకు. బాబూ, భయంలేదు, గతాన్ని త్రవ్వుకోకు. భవిష్యత్తును గురించి ఆలోచించకు. అన్ని యావల్నీ విడిచిన నిర్మల హృదయంతో మధుర నామాన్ని స్మరించు. నీవు అన్నీ పొందుతావు. కృష్ణుణ్ణి విస్మరించినా నష్టంలేదు. కాని జాగ్రత్త, అతని నామాన్ని మరిచిపోకు. నామ స్మరణతో నీవు ప్రేమని పొందుతావు. ప్రేమ నీకు కృష్ణుణ్ణి తెచ్చియిస్తుంది. ప్రేమతో పోల్చితే కృష్ణత్వము కూడా విలువ లేనిదే ఇంకా ఇతర విషయాల్ని చెప్పట మెందుకు ? ఈ ప్రేమ సామ్రాజ్యంలో ముక్తి విలువ లేనిది. దానిని కొనేవాడు లేడు. పైగా అది కొట్టుచీకుడు అయింది. ఏదో ఒకరోజున తప్పక నశించే శరీరాన్ని గురించి నీవెందుకు భయపడుతున్నావు? ముఖ్యంగా యోగ్యులైన పిల్లలు,తల్లిదండ్రులు, అన్నదమ్ములు,. స్నేహితులు నాకుండగా, ఏ విషయానికీ నాకు ఆందోళన లేదు. అని ఒక్కొక్కప్పుడు అనుకుంటూ ఉంటాను. నవ్వుతూ గెంతుతూ ఆనందంగా మీ మధ్యలో వెళ్ళిపోతే అంతకు మించిన ఆనందం ఏముంది అని. బాబూ! ఏమైనా నా సంకల్పం నిష్ఫలం. కృష్ణుని ఇచ్ఛ సర్వదా ఫలవంతమైంది, ఆధిక్యత కలది. అతడు ఏం చేసినా అది నామంచికే. ఎందుకంటే ఏ పరిస్థితుల్లో భార్యని ఉంచి భర్త ఆనందిస్తే, భార్య ఆ విషయంలో ఏమీ చెప్పటానికిలేదుకదా ! కనుక బాబూ, నాకు శక్తిలేదు, అవుననీ కాదనీ చెప్పే అవకాశమూ లేదని గట్టిగా చెప్తాను. ఏది నాకోసం కృష్ణుడు చేసినా దానిలో సంతోషంగా ఆనందాన్ని వెలిబుచ్చుతాను. భూమిమీద జీవులమైన మనం కృష్ణతత్వాన్ని, మహిమను ఎలా అర్థం చేసుకుంటాం? ఆస్థితిలో తలలు వంచి అతని పాదాల వద్ద ఆశ్రయం పొందటం కంటె మనం చేయవలసిన దేమున్నది?

నీ

హర



# 14వ పత్రము

బాబూ, జతీన్,

నీకు ఉత్తరము వ్రాశాను అప్పుడే శాంతిపూర్ నుండి మీ అమ్మ, మా అమ్మల వద్దనుండి సమాచారం అంది చాలా సంతోషించాను. నీ ఉత్తరంతో బాటు ఒక ఉత్తరం వారికి జతపరచాను. బాబూ! తీరిక వేళలలో ఏకాంతంగా షికారుకు వెళ్ళు. దారిలో వుండే అన్ని రకాల రత్నాల్ని ఎరుకోగల్గుతావు. ఏకాంత ప్రదేశాల్లో మాత్రమే మధుర ఫలాన్ని ప్రసాదించే ప్రేమ వృక్షం చూడగలుగుతాము. భూమి బాగా నీరు పీల్చుకుని జలమయమయ్యే వరకూ ప్రవాహాన్ని అరికట్టకు. ఈ ప్రేమ ప్రవాహం ఇతరుల సాంగత్యంతో ఆగిపోతుంది. కనుక, కొంతకాలం దాన్ని విసర్జించు, నీ హృదయగత కామిత మీడేరుతుంది. అలా కాకపోతే భూమికి చమ్మతగలదు. పైగా సమస్యలు ఎదురవుతాయి. దెబ్బలు తిన్న తర్వాత కూడా దయచూపటం నేర్చుకోనంతవరకూ, ముందు చెట్లతోను, చేమలతోను కలిసిఉండు. తర్వాత, పిల్లులు, కుక్కలు తదితర అల్పజంతువులతోనూ చివరికి మానవులతోనూ. ఒక్కసారే కొండదాటటానికి పోకు, నీవు పడిపోయే అవకాశముంది. నేను నాచేతులూ, కాళ్ళూ విరగగొట్టుకున్నాను.కనుక, అప్పుడప్పుడు మిమ్మల్ని జాగ్రత్తగా ఉండమని హెచ్చరిస్తున్నాను. ఇది జ్ఞాపకముంచుకో, నా గురించి ఆలోచించకు. ఈ శరీరం విడిచి పెట్టినా మిమ్మలి నెవ్వరినీ నేను విడిచి పెట్టను. కనుక మీరు ఎంతమాత్రమూ ఆతురత చెందనవసరం లేదు. కృష్ణుని మధురనామాన్ని మరువకు. ఎందుకంటే నామం మాత్రమే గొప్ప మంత్రం, మహోపకారి కూడ. నామానికి మించినదేదైనా ఉన్నదని నేను భావించను. రోజూ రెండు పూటలా కడుపునిండా తిండి సంపాదించుకునే యాచకుని స్థితిముందు రాచరికం ఎందుకూ కొరగాదు.

నీ

హర

# 15వ పత్రము

బాబూ, జతీన్,

ప్రేమతో, అనురాగంతో నీవు వ్రాసినది చదివి నేను ఎంత సంతోషిస్తున్నానో ఆంతర్యంలో ఉండే ఆ హరికి మాత్రమే తెలుసు. ఆ ఆనందాన్ని వర్ణించగలిగే భాషలేదు. ఒకవేళ ఉన్నా మానవునికి దాన్ని వ్యక్తం చేసే శక్తిలేదు. మీరంతా నా పూజకి, అర్చనకి ఏకైక లక్ష్యాలు. మీరంతా నా మనస్సులో ఉన్నప్పుడు నేనీ ప్రపంచాన్ని మర్చిపోయి వ్రజ మండలంలో ఉన్నట్లు భావిస్తాను. ప్రతిక్షణం ఆ లీలామయుని

(కృష్ణుని ) (ప్రేమమయి (రాధ) లీలల్ని నేను దర్శిస్తాను. బాబూ, నిజం చెప్పాలంటే నీవే నా పెన్నిధివి, నా మార్గ దర్శివి, నా గురువువి. తనయులు మహాభక్తులైతే తండ్రి గ్రుడ్డివాడైనా నష్టం లేదు. చేయిపట్టుకుని త్రోవచూపుతూ నీ చేతుల్లో తీసుకుపోతూ పరమధ్యేయమయిన ఆ ఆనంద ధామానికి నీవు తప్పక నన్ను తీసుకొని వెళ్ళి దర్శనం చేయిస్తావు. అంతేకాదు నా ప్రియమైన తల్లులు మీ అందరికంటె ఇంకా నాకు సహాయకారులు. నాకంటె అదృష్టవంతు లెవరు బాబూ? మిమ్మలినందర్నీ పొందబట్టే పుణ్య పాపాలకి నేను భయపడటంలేదు. మీ వల్లనే అటువంటి శక్తి, గౌరవం,పూజ్యత నాకు కలిగాయి. లేకపోతే, నావంటి ధర్మభ్రష్టుడి పేరు కూడా ఎవరూ తలిచేవారు కారు. బాబూ ఇప్పుడర్థంచేసుకున్నావా నా నిజస్థితి? నీవే నా అసలైన ఆలంబనం. ఏమాత్రం నీవు జారవిడిచినా అగాధంలో పడిపోతాను. అందుకే తరచుగా గట్టిగా పట్టుకొమ్మని చెప్పాను. ఎంతో జాగ్రత్తతో, హృదయ పూర్వకంగా, నీ ఆశ్రయంవైపు నీ గమ్యానికి త్రోవ తప్పకుండా చూచుకోవటం ద్వారా నన్ను మహా విపత్తునుంచి తప్పించు. నీ ఆశ్రయ స్థానం దయార్ద్రమైన హరినామం. ఎటువంటి శత్రువైనా నీ యీ అజేయమైన దుర్గంలో నీకు కష్టం కలిగించలేదు. ఈ కోటలో నివసించేవాడు నిరంతరం సంతోషంగానూ నిశ్చింతగానూ ఉండవచ్చు. ధ్యానము, ధారణ, వైరాగ్యము రూపంలో బలమైన సైన్యాన్ని, రథికుల్నీ సేనా నాయకుల్నీ దుర్గవాసుల సంరక్షణకి నియమించవలసిన అవసరంలేదు. ఎందుకంటే కామక్రోథాది ప్రచండ ప్రబల శత్రువర్గం ఏ చక్ర భయానికి పటాపంచలై ప్రాణభీతితో పరుగెత్తి పోతుందో ఆ చక్రధారి చక్రం అతి జాగ్రత్తగా నాలుగువైపుల నుండీ ఈ కోటను కాపాడుతున్నది. కనుక, బాబూ, భక్తుడికి అతి మధురమైనది, శత్రువుకి వజ్రాయుధం కన్నా అతి కఠినమైనదీ అయిన కృష్ణనామాన్ని మరువకు. తింటున్నా, పడుకున్నా, ఆటలాడుతున్నా, నాట్యమాడుతున్నా, పాట పాడుతున్నా, ఎల్లప్పుడూ అతని నామాన్ని జ్ఞాపకం పెట్టుకో. అవి నీవి కనుక, వాటికి దానిని గురించి జ్ఞాపకం చెయ్యి. అతని నామంపై ఆధారపడిన బంధితులు విముక్తులై ఎవరి నామాన్ని వారుచేస్తున్నారో అతణ్ణి పొందటంలో ఏమాత్రం సందేహంలేదు. యోగసాధన, తపస్సులలో ప్రతిమెట్టులోనూ కాలుజారే ప్రమాదం ఉన్నది. ఫలితం అనుమానం. కాని, అతని నామాన్ని ఆశ్రయించటంలో ఏ లేశమాత్రమైన అపాయమూలేదు. ప్రేమమయుడైన శ్రీ గౌరంగ ప్రభువు సుకరమైన మార్గాన్ని చూపినందువల్ల జీవుల దృష్టిలో ఉత్తమోత్తమమైన అవతారమయ్యాడు. ఇతర మార్గాల్లో సంప్రదాయాల భేదం ఉన్నది. హిందువులకి, ముసల్మానులకి, క్రైస్తవులకి,

ఇతరులకీ యోగమార్గంలో ఎంత భేదమున్నది! అయితే, నామ జప మార్గంలో ఏకత్వం, సమానత్వం సర్వత్రా గోచరిస్తాయి. హిందువులు, ముసల్మానులు, క్రైస్తవులు ఇంకా ఇతరులు అంతా ఆ కరుణామయుడైన ప్రభు నామాన్ని తమ తమ భాషల్లో తమ తమ సంప్రదాయాల కనువుగా జపమాలలతో జపిస్తారు. అందుకని, ఇంతకు మించిన శాశ్వత, పవిత్ర, విశ్వజనీన మార్గం ఏదీ లేదని నొక్కి వక్కాణిస్తాను. కనుక సమస్తం విస్మరించి ఆత్మానందంతో అతని నామంలో తన్మయుడివికా, దానితో, నీవూ నీవాళ్ళనీ ఆనందంగా ఉంచగలవు. గట్టిగా ఆశ్రయించు, దృఢ విశ్వాసం కలిగి ఉండు, అన్ని చింతలకీ అతీతుడివి తప్పక అవుతావు. నామం యొక్క ఇంకొక విశిష్టత ఏమిటంటే తపస్సులు చేస్తే కొన్ని సిద్ధులు కలుగుతాయి. జీవులు అహంకరిస్తారు . తమ్ముతాము మర్చిపోతారు. కాని, అటువంటి ప్రమాదం నామజపంలో లేదు. ఇక్కడ శక్తులు రాగానే ప్రేమ వృద్ధి పొందుతుంది. జీవుల్ని వినయవంతుల్నిగా, సౌమ్యుల్నిగా తీర్చిదిద్దుతుంది. తపస్సుల ఫలితం మానవాతీతమైంది, కాగా, ' నామజప పర్యవసానం ప్రేమ '. ఇక్కడ ఈ రెండింటి వ్యత్యాసం నీవు చూస్తావు. దీన్ని గురించి ఇతరులతో తర్కించకు. తర్కించవలసివస్తే నీ హృదయంలో నీవే తర్కించుకో. లేక నీ హృదయానికి నచ్చిన వారితో తర్కించు, ప్రతిదీ గ్రహిస్తావు. దీని సూక్ష్మగతి అందరికీ బోధపడదు, కనుక , ప్రతివాడితోనూ దీన్ని గురించి తర్కించావా, ఆనందానికి బదులు దుఃఖం, ప్రేమ స్థానంలో క్రోధం, విశ్వాసానికి బదులు సంశయం, అపనమ్మకం కలుగుతాయి. ఒక్క క్షణంలో ఎంత కాలంనుంచో అతికష్టంతో నీవు సంపాదించిన నిధిని పోగొట్టుకుంటావు.కనుక తగినంత శక్తి పొందేంత వరకూ ఏకాంతంగా, మౌనంగా సాగిపో, తర్వాత భయంలేదు. చేప పిల్లని బాగా లోతులేని, నిలకడగల నీళ్ళలో పోషించి, అప్పుడు అన్యక్రూర జంతువులు నివసిస్తున్న, ఘోషిస్తున్న సముద్రంలో పెట్టు. అక్కడ అది నిర్భయంగా తిరుగుతుంది ; రోజురోజుకీ పెరుగుతుంది. కాని, ముందరే సముద్రంలో పెట్టితే ఏ అనామక జంతువునోట్లోనో పడుతుంది. మళ్ళీ తిరిగి వెనక్కి తెచ్చుకొనే అవకాశమే మిగలదు. కనుకముందే నీవు చాలా జాగ్రత్తగా ఉండాలి. ఇతరుల కష్టాల్ని చూసి నీవుపొందే విచారాన్ని ఆ దుఃఖహారి అయిన హరికి త్రికరణశుద్ధిగా రహస్యంగా మనవిచెయ్యి. కాని , శక్తి పొందేంత వరకూ బహిరంగంగా దళితుల్ని ఉద్ధరించటానికి పోబోకు. ఎందుకంటే, అప్పుడు నీవు విజయం సాధించలేవు సరికదా. నీవు కూడా పతనంచెంది బాధపడవచ్చు. నీ అంతరాంతరాలలో ఇతరుల యోగ క్షేమాలకై ప్రార్థించు. ప్రభువు నీ వాంఛల్ని

ంరిరక్షించటానికై నీ శాశ్వతగృహ సౌందర్యాన్ని పాడు చేయకు తోటి ఉద్యోగుల ంహవాసంలో ఆ శాశ్వత ప్రియాతి ప్రియ మిత్రుణ్ణి పోగొట్టుకోకు. ఎప్పుడూ ఇది ంనసులో పెట్టుకో. ఈ భూమి నీకు తాత్కాలిక నివాసస్థానం మాత్రమే.

నామం చేస్తున్నప్పుడు ఇతర ఆలోచనలు వస్తే విచారించకు. దాంతో ఏ మాత్రం ష్టంలేదు, కాని మొదలు పెట్టేటప్పుడు సావధాన మనస్కుడవై కూర్చో, దృఢ ంకల్పంతో ఒక వ్రతానికి ఉపక్రమించిన తర్వాత ఏమైలా నిన్ను అంటదు. కాని ంవు ప్రారంభంలో అతి నిర్మలంగా ఉండేటట్లు మాత్రం చూచుకో. ఆత్రుత ఆమె సహోదరి అయిన తీవ్రమైన వేదనలను నీ శాశ్వత మిత్రుల్నిగా చేసుకో. అవి నాబృందావనానికి లలిత, విశాఖలు, అవి కృష్ణ సాన్నిధ్యానికి రాకపోకలకు ఏకైక సామ్రాజ్ఞులు. ఈ రెంటి సహవాసాన్ని ఎప్పుడూ విస్మరించకు. వారే చేయి పుచ్చుకుని రాధాకృష్ణుల నిత్యసేవకు సేవకురాలిగా నిన్ను సమర్పించేవి. అవే తూనీగలాగా రంగులతో నీకు రంగులు వేసేవి. కనుక వాటిని విస్మరించకు. ఉత్తమమైన అనువైన ఆహారం ఏమిటో నిర్ణయించుకోలేకపోతే, అవి ఎవరిలో ఉంటాయో వాళ్ళ దగ్గర నుండి నేర్చుకో. మండే ఎండలో వాటిని ఉంచకు. ఎందుకంటే అవి వాడిపోగలవు. ఎప్పుడూ భిన్న భిన్న ఆచ్ఛాదనలతో వాటిని మరుగు పరచు, చేతులు,ముఖాని కంటే మిగిలిన అన్ని శరీర భాగాల రంగు ఎప్పుడూ ఆచ్ఛాదనతో ఉండటం వల్ల ఎంత వన్నెగా ఉంటుందో నీవు గమనించలేదా? ఇందువల్లే ఉష్ణదేశాల ప్రజలకన్నా శీతల దేశాల ప్రజలు తెల్లగా ఉంటారు. కనుక స్పష్టమైన రంగు వచ్చే వరకూ వాటిని చాటుగా ఉంచటానికి ప్రయత్నించు. సిగ్గే స్త్రీకి ముసుగు. అది లేకపోతే ఆమె మాధుర్యం మృగ్యమౌతుంది. కనుక విచక్షణారహితమైన అందరి చూపులు దృష్టిలో పెట్టుకుని, వాటి ముఖాల మేలి ముసుగు తొలగించటానికి, వాటివైపు కామంతో చూసేవారి నీడని కూడా అవి ముట్టుకోకుండా జాగ్రత్తపడు, మాఅమ్మని (నీ భార్యను) నీ దగ్గర ఉంచుకొనమని అనటంలో నేను తప్పుచేయలేదు. అన్ని ఇతర స్థలాలు నీకు శాంతిపూర్ వంటివే. తేడా ఏమీ లేదని తెలుసుకున్న తర్వాత అలా చెప్పాను. ప్రేమాస్పదమైన వస్తువుని దూరంగా ఉంచటంతో స్వచ్ఛమైన ప్రేమ అభివృద్ధి చెంది పోషించబడుతుంది అన్నది యదార్థమే కాని ఏ విషయంలోను విరసం వాంఛనీయం కాదు. సంవత్సరమంతా చదివిన విద్యార్థికి సంవత్సరాంతంలో జరిగే పరీక్ష అతని అభివృద్ధికి (ఉత్తీర్ణతకు)గాని, తత్ భిన్నత్వానికి గాని ఉత్తమమైన పరీక్ష. నీవు అనుభవించ తగినది నీ ప్రక్కన ఉండగా త్యజించటం నిజమైన వైరాగ్యం. మానసిక వైరాగ్యం అసంపూర్ణం. పొరబాటున్నా,

మీ

హర

స్వీయ ప్రాణాధిక ప్రియులు , మీరూ ఆ కుటుంబానికి చెందినవారే కనుక, ఆయన దర్బారులో నా తరుపున ఎందుకు మాట్లాడకూడదు? మీకు శక్తి ఉన్నది కనుక మీ సహాయాన్ని అపేక్షిస్తున్నాను. దయచేసి నన్ను నిరాశ పరచకండి. కేవలం మీరే నా శక్తియుక్తులు. మా అమ్మతో తన అల్లరి పిల్లవాడిపై వాత్సల్య పూర్వక కృపామయ దృష్టిని ఉంచమని చెప్పండి, తండ్రీ! మీరు న్యాయమూర్తులు, కనుక, మీ పిల్లల అర్హతా నర్హతల్ని పరీక్షిస్తారు. తర్వాత ప్రేమిస్తారు. కాని, తల్లులు అలా చేయరు. తల్లుల దృష్టిలో మంచి పిల్లలు, చెడ్డ పిల్లలు సమానంగా ప్రియమైన వారే. కనుక వారి నుంచి మహదనుగ్రహాన్ని అపేక్షిస్తున్నాను. వారి దయకు సదా పాత్రుణ్ణి అగుదునుగాక! తన నికృష్ట పాపిష్టి పుత్రుడిపై తన దయార్థ్ర ప్రేమ దృష్టి సారించండని మా అమ్మతో చెప్పండి. ఆమె వాత్సల్యాన్నీ, దయనీ అర్థించటానికి అర్హుణ్ణి కానప్పటికీ మా అమ్మ హృదయం ప్రేమమయమైనదని నాకు తెలుసు కనుక అలా చేసేందుకు సాహసిస్తాను. ఆనందమయమైన మా అమ్మ మనోజ్ఞమూర్తిని దర్శించాలని ఎంతగానో ఆకాంక్షిస్తున్నాను. ఎప్పుడా దివ్య ఘడియ కృష్ణానుగ్రహంతో ప్రాప్తిస్తుందో నాకు తెలియదు. ఆమెను దర్శిస్తానా లేదా అన్నది కాదు విషయం. ఆమె వాత్సల్యాన్ని నోచుకోని దుస్థితి నాకు కలగకుండా ఉండాలని కృష్ణుడికి నా ప్రార్థన. నన్ను తన తనయుడిగా అంగీకరించమని మా అమ్మతో చెప్పండి. నా శాంతిపూర్ తల్లిదండ్రులు దయతో ఇంకొక జననీ జనకుల్ని ప్రసాదించారు. సర్వదా వారికి కృతజ్ఞుణ్ణి, ఇంకా ఎప్పటికీ కృతజ్ఞుణ్ణిగా ఉంటాను.

తండ్రీ! ఈ ప్రపంచం ఒక సత్రం వంటిది మాత్రమే. ఒక రాత్రికి యాత్రికుడి విశ్రాంతి స్థలం. ఉదయం వరకూ ఆగుతారు, అప్పుడు వేరొక చోటికి వెళ్తారు. అలా అలా అంతే, మీరూ, ఒకచోటు తర్వాత మరొక చోటు వదలవలసిందే. కనుక, ఉచితమేమిటంటే - ఈ ప్రస్తుత జీవితాకర్షణల పట్ల పూర్తిగా నిమగ్నులు కాకుండా, కేవలం యాత్రికుల నివాసంగా దీనిని మీరు గ్రహించాలి. ఎవ్వరూ ఇక్కడ అమరిన వస్తువుల్ని ఎంత ఖరీదు పెట్టికొన్నా, ఎంత జాగ్రత్తగా పదిలపరచుకున్నా తీసుకువెళ్ళగలగటం లేదు. తీసుకు వెళ్ళలేరు. కాని. మొదట్లో రుచికరం కాకపోయినా కాని, ఎవరిచేతా అంగీకరింప బడకపోయినా కాని, ఎవరిచేత నయినా కొంత సంపాదింపబడిందా - మరణానంతరం అది అతన్ని అనుసరిస్తుంది. దాని జాగృతిలో సకల శ్రేయస్సులని కలిగిస్తుంది. అది ' హరినామం '. మానవులు అన్ని రకాల వ్యామోహాల మధ్య, హరినామం వారి కర్ణాల్ని సోకగానే వణికిపోయి వ్యామోహాలకి దూరంగా పారిపోతారు. ఎందుకంటే - నామాకర్షణ అటువంటిది. కేవలం దాని శ్రవణం వల్లన కూడా నశ్వర ప్రాపంచిక సుఖం అల్లంత దూరంగా పారిపోతుంది.

ప్రాపంచిక భోగానికి విముఖులుగా జీవులు శాశ్వత ఆధ్యాత్మికానందంలో మునిగిపోతారు. తండ్రీ! ఐహిక సుఖం శాశ్వతమనుకోకండని చెప్తున్నాను. మధుర హరినామ స్మరణ మరువకండి. మీ కంఠంలోనేకాదు. ఈ రత్నాన్ని ఇతరుల గళాలలోనూ అలంకరించండి, ప్రేమ సామ్రాజ్యానికి అందరూ ఏకరీతిగా అలంకరించుకుని తరలిరండి. మీ పాప భారాల్ని మోయటానికి నేను సిద్ధంగా ఉన్నాను. మీ భారాల్ని నా తలపై ఉంచి మీ పెదవులపై హరి నామంతో, హరి ప్రేమతో ఉన్మత్తులై, ప్రేమ సామ్రాజ్యమైన బృందావనానికి వెళ్ళండి. నేను అల్లంత దూరాన్నుంచి అది దర్శించి ఆనందిస్తాను. కృష్ణుడు ఆ శుభదినం దర్శించే అదృష్టం నాకు అనుగ్రహించుగాక! అందరూ హరినామస్మరణ చేస్తుండగా చూద్దునుగాక! తండ్రీ! అతనిదయ నీకు అనుగ్రహించినప్పుడు అతణ్ణి విస్మరించకండి. తరచు స్మరిస్తూ ఉండండి.

మీ
హర

# 18వ పత్రము

ఉపేంద్రనాథ్ ఘోష్.

నేను మిమ్మెలా సంబోధించినా, మీకది బాధాకరంగా ఉంటుందని, ఈరోజు నే నేరకంగానూ సంబోధించటం లేదు. దయచేసి అపార్థం చేసుకోవద్దు. మీ ఉత్తరం చదివి నిజంగా బాధపడ్డాను. నన్ను సర్వదా సన్మార్గంలో ఉంచమని ప్రభువుని ప్రార్థించాను. నేను మనుష్యులను మోసం చేయగలిగాను, కాని ఆ ప్రేమ మయుడైన నిత్యానందుడు మోసపోడు. అతనికి పదహారణాల సంపూర్ణ నిండు హృదయం కావాలి. కాని నాకది పదిహేడణాలు ఋణపక్షంలో ఉంది. జమలో నాకేమీ లేదు. నాకున్నదల్లా మీ శుభాకాంక్షలు మాత్రమే. నితాయి మీవాడు. మీరు అతని ప్రధాన ఇష్ట జనులు. కనుక మీ అందరికీ నా హృదయపూర్వకమైన విన్నపం ఏమిటంటే - ఆ దయామూర్తి నితాయితో నా గురించి మాట్లాడండి అని. మీ మాటల్ని అతడు త్రోసివేయలేడు. ఈ నికృష్ణ జీవికై తప్పక దయజూపుతాడు. చెప్పగా విన్నాను. అంతర్యంలో నాకూ తెలుసు. అది ఏమిటంటే- ప్రేమ లేకుండా ఆ ప్రేమ ప్రభువు ప్రాప్తించడు. నా నితాయి ప్రేమ మయుడు. యదార్థ ప్రేమావతారం, ప్రధాన ప్రేమదాత, అందువల్ల ఒకవేళ మీరు ప్రియమైన గౌరాంగుణ్ణి పొందితే, నితాయి పాదాలవద్ద శరణు పొందటం మరువకండి. నితాయి అతి కృపాపూర్ణుడు. అతనితో నా తరఫున మాట్లాడండి, పతితుణ్ణి అని నన్ను అసహ్యించుకోవద్దని చెప్పండి. నా

జీవ యాత్రకై ఒక పైసా కూడా లేనివాణ్ణి కనుక మీ ద్వారం దగ్గర బిచ్చగాణ్ణి, నన్ను నిరాశపరచకండి. చందమామ నాశించేవాడికి అద్దంచూపి, రత్నాన్ని అభిలషించే వాడికి రాయినిచ్చి మోసగించకండి. నా దురదృష్టమేమిటంటే నా నిజస్థితిని చూస్తే ఎవ్వరూ నన్ను నమ్మరు. ఒక ధనవంతుడి కొడుకు ధనమంతా వ్యభిచారంలో నాశనం చేసికొని, దరిద్రుడైనప్పుడు, ఎవ్వరూ అతని పేదరికాన్ని విశ్వసించకుండా అతనికి దురంత దుఃఖం కలిగిస్తూ ఉంటే ఏ స్థితిలో ఉంటాడో నా స్థితి సరిగ్గా అలా ఉంది. నిజమే నేనొక మహాపురుషుడి కొడుకుని, మహాశక్తికి పుట్టాను, కాని రావణ, హిరణ్యకశిపుల కన్నా ఆంతర్యంలో దుర్మారుణ్ణి. కాని నా దౌర్భాగ్యానికి ఎవ్వరూ అది నమ్మటంలేదు.

ఈ ఆశతోనే నేను ఎదురుచూస్తూ ఉంటాను. నా నుంచి మీ దృష్టి మరల్చుకోకండి అని ప్రార్థన. ఒక సాధువు నుంచి ఏమి విన్నానో అది చెప్తాను. "కృష్ణుని మధుర నామంకంటె మహామంత్రంగాని, మహౌషధంకాని లేదు. ఈ నామ మాహాత్మ్యంతో, జీవులు శివత్వాన్ని తృణీకరిస్తారు. మహాకాలుడైన మృత్యువునీ శాసిస్తారు. కాలాన్ని తృణీకరించి ఇహంలోనూ, పరంలోనూ, సమానంగా , ఆనందంగా ఉంటారు. ప్రాపంచిక చింతలు కూడా నామ సంకీర్తన ధ్వని ఎక్కడ వినిపిస్తుందో అక్కడికి చేరలేవు. ఇక శారీరక బాధలు గురించి చెప్పటమెందుకు? కృష్ణనామ స్మరణలో మత్తుడైనవాణ్ణి కేవల శారీరక అనారోగ్యం సమీపించ సాహసించదు. ఎవరు ప్రతి ఉదయం, సాయంత్రం స్నానానంతరం మొదట్లో నీళ్ళుపోసి, తులసి మొక్కకి నమస్కరించి, దాని క్రింద మట్టిని కొంత ఒంటికి పూసుకుంటారో వారిని ఏ వ్యాధీ సమీపించలేదు. అతని నామాన్ని మరచిన వెంటనే మాయ అతణ్ణి వశీకరించుకుంటుంది. దాని అనుచరులు అన్ని రకాల వికారాలతోనూ అనేకరీతులుగా ఆ మాయాదాసుణ్ణి హింసిస్తాయి. ఎక్కడ కృష్ణనామం ఉన్నదో అక్కడ మాయలేదు. కనుక దుఃఖపు ఛాయకూడా అక్కడ కనిపించదు." కనుక మనసా, వాచా, కర్మణా ప్రతివాడు కృష్ణుణ్ణి ఆశ్రయించి అతని నామస్మరణని శరణుపొందాలి. ఇవన్నీ మీకు బాగా తెలిసినా చెప్తున్నాను. కనుక అన్యథా భావించకండి.

మీ

హర

# 19వ పత్రము

తమ్ముడూ (ఉపేంద్రనాథ్ ఘోష్)

ఈ రోజు నీ ఉత్తరం చూసి చాలా ఆనందించాను. కాని తక్షణం నీ అనారోగ్యం గురించి వినగానే బాధపడ్డాను. ఏమైనా, ఇప్పుడెలా ఉన్నావో తెలియజేయి. నీ ప్రస్తుత జీవిత లక్ష్యం తినటం, తిరగటం, సుఖ దుఃఖాలలో మునిగి ఉండటంగా భావించకు. ఇతరులపట్ల దయ చూపటానికి కృష్ణనామ స్మరణ చేయటం, ఆర్తుల అవసరాలను తీర్చటం, దీనుల దుఃఖాలను తొలగించటం మానవుల కర్తవ్యం. కాని ఈ సత్కర్మలే లేకపోతే మనిషికీ, హీనమైన పశువుకీ భేదం ఉండేదికాదు. పరిపూర్ణంగా హరి ప్రేమలో లీనమయ్యేంత వరకూ తదనుగుణంగా సంప్రాప్తమయ్యే ఈ గుణాల్ని హృదయంలో నిలుపుకోవాలి. వీటిని హృదయపూర్వకంగా ఆరాధిస్తే హరిప్రేమ సంప్రాప్తిస్తుంది. తర్వాత వీటిని తదభిన్నంగా చూడవలసిన అవసరంలేదు. పెండ్లి కొడుకు స్వయంగా ఎదురుగా ఉన్న తర్వాత అతని బంధుమిత్రుల గురించి ఎవరూ పట్టించుకోరు. పట్టించుకొనేటంత సమయమూ ఉండదు. ప్రేమోన్మత్తుడ వయ్యేంతవరకూ వాటిని ప్రత్యేక శ్రద్ధతో గౌరవించు. నీ శేషజీవితాన్ని వాటిని నిర్లక్ష్యం చేసి వృధా చేసుకోకు. పెండ్లి కొడుకు  తరుపున కుక్కని కూడా పెండ్లి అయ్యేంత వరకూ అభిమానించాలి. గౌరవించాలి. పెండ్లి అయిన తర్వాత ఇతరుల సంగతి పట్టించుకోకపోవచ్చు. కాని,పెండ్లికొడుకు తల్లిదండ్రులతో పోట్లాడకూడదు. పైగా నిరంతరం వారిని సంతోష పరుస్తుండాలి. అలాగే కృష్ణ ప్రేమ సిద్ధించినా, కృష్ణనామ స్మరణని విస్మరించకూడదు. ప్రేమకి తల్లీ,తండ్రీ నామం. నామస్మరణ నుంచి మాత్రమే ప్రేమ లభిస్తుంది. ప్రేమనుంచి ప్రేమమయుడు హరి లభిస్తాడు. కనుక, నీ వేదైనా మర్చిపోవచ్చు. కాని అతని నామ స్మరణ మాత్రం మరువ వద్దని చెప్తాను. అతనిని పొందే సులభమైన  మార్గం ఇంతకంటె మరొకటి (ముఖ్యంగా ఈ కలియుంగలో) ఉన్నదేమో నేను చెప్పలేను. దుష్టులకీ, పతితులకీ కృష్ణునికంటె కృష్ణనామం ప్రియకారణము. వారికి శాంతిని ప్రసాదించేందుకు కృష్ణనామం ఈ భూమి మీద విజయ విహారం చేస్తోంది. దయామయుడైన ఆ ప్రభువుని నేను కోరేదల్లా ఏమిటంటే, శుభప్రదమైన కృష్ణనామం సదా మహిమాన్వితమై ఈ లోకంలోని పాపులూ, పతితులూ తన్నామస్మరణ సంగతిచేత తమ పాపాల్నీ , దుఃఖాల్నీ మరచి ప్రశాంత చిత్తులగుదురుగాక! అని. ఇక్కడ నామముండగా పాపాత్ములికీ పతితులికీ ఈ ఆతురత ఎందుకు?  తమ్ముడూ, నాలాంటి బాధితులందరమూ వచ్చి, సమిష్టిగా,

బిగ్గరగా హరినామ స్మరణ చేద్దాం. అలా నిరంతరం మన ఆత్మశాంతి చేసుకుందాం. నామస్మరణలో ఉన్న ఆనందానికి సమానమైన ఆనందం మరొకటిలేదు. మధురాతి మధురమైనది. దాన్ని అర్థం చేసుకోవాలనుకున్నవాడు మరింత మాధుర్యాన్ని అనుభవిస్తాడు. అది వర్ణనా తీతం. దానిమాధుర్యం దానిదే. మరొకదానితో పోల్చటానికి వీలులేదు. ఎవ్వరూ ఆ మధుర నామాన్ని ఉపేక్షించ కుండా ఉందురుగాక! జీవితం శాశ్వతం కాదు. ఈ రోజు ఉన్నది, రేపు నశించవచ్చు. కనుక,అతని నామాన్ని అందరూ, ఆశ్రయించాలి. అందరూ తమ పాప భారాల్ని నాతలపై వేసి ప్రశాంతచిత్తులై హరినామాన్ని చేయండి. మురికి వస్తువుల్ని పడవేసే చోటు సహజంగా మురికిగా ఉండక తప్పదు. కనుక మీ పాపభారాల్ని పారవేయటానికి నాతలకంటె తగిన స్థలం మీ కెక్కడ లభ్యమౌతుంది? మీరు ఆనందంగా ఉంటే నేనూ ఆనందంగా ఉంటాను. నరకంలో ఉన్నాసరే. కనుక ఆ దయామయుడికి నా ప్రార్థన ఏమిటంటే మిమ్మల్ని ఆనందంగా ఉంచాలిగాక! అని.

మీ
హర

## 20వ పత్రము

తమ్ముూడూ, ఉపేన్,

నాకలా వ్రాసి అవమానపరచకు. నేనొక నికృష్ట పాపాత్ముణ్ణి. నన్ను నన్నులాగే చూడు. నీ ప్రేమ దృక్కులతో నన్నెలా చూస్తున్నావో నిజంగా నేను దానికి పూర్తిగా విరుద్ధమైన వాణ్ణి. గ్రుడ్డివాణ్ణి తప్పుదోవ పట్టించటం సులభమైనట్లే - ఒక మనిషిని మోసగించటానికి ఎక్కువ శ్రమపడనక్కరలేదు. మనిషి మోసపోతాడు సందేహం లేదు. కాని నా నితాయి మోసపోడు. అతణ్ణి ఆకర్షించగలది పూర్తిగా భిన్నమైనది. అది అందరికీ లభించదు. దయతో నితాయి దాన్ని ఎవరికి అనుగ్రహిస్తాడో అతడు మాత్రమే తను ధన్యుణ్ణని అనుభూతి పొందుతాడు. తన కిచ్చిన ప్రేమపాశంతో సాక్షాత్తూ నితాయినే బంధిస్తాడు. అటువంటి బంధం బంధించిన వాడికీ, బంధితుడికీ సమాన సంతోష ప్రదమైనది. బంధం మరింత బిగుసుకోవాలని కాంక్షిస్తాడు. నితాయీ! నీవు దివ్యుడివి, నీ దయ దివ్యమైనది. ఇప్పుడు నీ చరణాలకి నా విన్నపమేమిటంటే - మమ్మల్ని ఆ నీ దివ్యలోకానికి గొనిపోవూ! ఒక్కసారి నా హృదయాకాంక్షని తీర్చు, కేవలం ఒక్క సారి చూపించు. చూపించి వెళ్ళగొట్టు. వెళ్ళగొట్టినా సరేదయచేసి ఒక్కసారి చూపించు, తమ్ముడూ, అటువంటి నితాయిని

విస్మరించకు. ఒక్కసారి పట్టుకున్నావు కనుక ఉపేక్షించకు. దృఢంగా బంధించు, ఆనందిస్తావు. దృఢంగా బంధించి గట్టిగాలాగు. అద్భుతమైన రహస్యాలనేకం గోచరిస్తాయి. నీవొక వస్తువుని బంధిస్తావు కాని నీవు లాగుతుంటే ఎన్ని అలౌకిక వస్తువులు దానికి కట్టుబడ్డాయో గ్రహిస్తావు. ఒక్కదాన్ని లాగితే నీకు మూడు లభిస్తాయి. ఇవి ఒకదానిలో లయిస్తాయి. మళ్ళీ ఈ ఒకటి రెండవుతుంది. ఎంత ఆనందం ఉందో, ఏ రహస్యాలున్నాయో నీవు గ్రహిస్తావు. ఈ ఆకర్షణలో, ఈ పరిష్వంగంలో క్రొత్త లీలలు జరుగుతుంటాయి. నిరంతరం ఆనందిస్తావు సంతృప్తి పడతావు. తమ్ముడూ, నిన్ను నీవే అతనికి బంధించుకో, నీ వొక్కడివే లాగలేకపోతే చాలా మందిని తోడుగా చేర్చుకో. వాళ్ల ప్రమేయం ఏమాత్రం లేకుండానే వాళ్ళు గూడా నీ ద్వారా తరిస్తారు. నయాన కొందరినీ, భయాన కొందరినీ యోగ్యతా యోగ్యతలని యోచించకుండా అందరినీ నీ వద్దకు పిలువు. నీ సత్సంగులుగా జేర్చుకో, మట్టికుండల్ని చేసేవాళ్ళు మొదట్లో బంగారు కుండల్ని చేయటానికి ఆహ్వానించినా అంగీకరించరు. కాని లాభంలో భేదం గ్రహించగానే వాళ్ళని నీవు ఆహ్వానించ నక్కరలేదు, ఆశ జూపించనక్కరలేదు. వాళ్ళంతట వాళ్ళే ఈ క్రొత్త పనికి పూనుకుంటారు. కనుక తమ్ముడూ, వీడూ- వాడూ అని కాక అందరినీ నీ మిత్రుల్నిగా చేసుకో. నా నితాయి సామ్రాజ్యానికి వెళ్ళటానికి తగినట్లుగా మిమ్మల్ని మీరు అలంకరించుకుని సిద్ధంకండి. అందరూ సమానమైన ఆదరాన్నీ పొందుతారు. ఈ అనంతమైన గనిలో అనర్ఘ రత్నాల్ని ఎన్నని ఒక్కడివీ ఏరుకుంటావు? అది అందరికీ చూపించు. ఎన్ని ఏరుకు పోగలిగితే అన్ని ఏరుకుపోతారు. ఎవ్వరూ అన్యాయం జరిగినట్లు బాధపడనక్కరలేదు. ఎవ్వరూ ఏ రకంగానూ దుఃఖంతో నిట్టూర్పులు నిగిడించనక్కరలేదు. నా నితాయి తన భాండాగారం ద్వారాలు తెరిచి కూర్చున్నాడు. ఇష్టమున్న వారెవరైనా అక్కడికి వెళ్ళవచ్చు. తను కోరుకున్నది తీసుకోవచ్చు. నీవూ నేనూ సమానాదరాన్ని అక్కడ పొందుతాము. ఎంత పాత్రని తనతో తీసికొనివెళ్తే అంతసరుకు తనవెంట తెచ్చుకోవచ్చు. ఒకరికి ఎక్కువ వచ్చినదనీ,ఒకరికి తక్కువనీ పోట్లాడుకొనే సందర్భం ఒక్కటీ ఉండదు. ఎంత కోరుకుంటే అంత తీసుకువెళ్ళవచ్చు. ఆపేవాళ్ళు ఎవరూ లేరు. కాని, ఒక్క విషయం మనసులో పెట్టుకోవాలి. అక్కడ పాత్రలు దొరకవు. ఒకటి అప్పిచ్చేవాడూ ఉండడు. అంతా అది దోచుకోవటానికి వెళ్ళేవాళ్ళే. కనుక నీవు జ్ఞాపకం పెట్టుకోవలసిన దేమంటే- నీ పాత్ర ఎంత పెద్దదయితే, అక్కడి నుంచి నీవన్ని ఎక్కువ రత్నాల్ని తెచ్చుకోగలవు. తమ్ముడూ ఎవళ్ళెక్కడున్నా సరే, అందరినీ నీ వెంట తీసుకువెళ్ళు.

ఆలస్యం చేస్తే ప్రమాదం. రోజు రోజూ విషయం విడిచి నీవేరకం గానూ వృథాగా కాలహరణం చేయగూడదు. ఎందుకంటే దురదృష్ట వశాన నాలుగువందల సంవత్సరాల పూర్వం ఆవరణ కూడా లేని ఈ నిధికి ఈనాడు ద్వారాలు, ఒక్కటొక్కటిగా అమర్చబడ్డాయి. ద్వారాలు అమర్చబడటమే కాదు, దానిలో ప్రవేశించటానికి అనర్హులని భావించబడే వారికి ద్వారాలు ఒక్కటొక్కటే మూసుకున్నాయి కూడా. ఈ ప్రస్తుత పరిస్థితులు ఇంకా కొన్ని రోజుల తర్వాత ఉండకపోవచ్చు. కనుక, ఆలస్యం చేయకుండా ఉండటం యుక్తం. ఈరోజుల్లో ఈ ప్రపంచం నుంచి యాభయి తర్వాత అరణ్యాలకి వానప్రస్థం వెళ్ళాలనడం సబబు కాదు. ఎంత తొందరగా సాధ్యమైతే అంత తొందరగా వెళ్ళాలి. కనుక, తమ్ముడూ, శరీరంలోని అణువణువుతోనూ హరినామం చేస్తూపో. నీవు నిత్యానందుని ధనాగారాన్ని తొందరగా చేరుకుంటావు. నీ మనస్సుకి నచ్చిన రత్నాన్ని తీసుకుని సంతృప్తుడవవుతావు అని చెప్తాను. తమ్ముడూ, పిచ్చివాడే మరొక పిచ్చివాడి మాటల్ని అర్థం చేసుకోగలడు. వాడి దృష్టిలోనే వాటికి కొంత విలువ ఉన్నది. వేదాంతులికి, జ్ఞానులికి ఇటువంటి అభిప్రాయాలతో ప్రయోజనం లేదు. ఈ ఆనంద వ్యాపారపు సరుకు కొనదలచుకున్న వాళ్లెవరైనా మరెవరిచేతనన్నా నిరోధింప బడతారేమోననీ, నేను తెచ్చాను కనుక మళ్ళీ వెనుకకి తీసుకుపోవలసి వస్తుందేమోనని భయపడుతున్నాను. నీవు పిచ్చివాడివైతే, తమ్ముడూ అటువంటి వాళ్ళతో కలువు. వాళ్ల సాంగత్యంలో శాశ్వతానందాన్ని అనుభవించు. లేకపోతే వెఱ్ఱివాళ్ళ మధ్యలో విజ్ఞుడిలా నీవు ప్రమాదంలో పడతావు. పొందబోయేదీ, పొందిందీ పోగొట్టుకుంటావు. వెఱ్ఱివాడు తన తిండికోసం కష్టపడనక్కరలేదు. ఏమాత్రం ప్రయత్నం లేకుండానే వస్తుంది. అయితే అప్పుడప్పుడు తిట్లు, తన్నులు తినవలసి వస్తుంది. తిండికోసం కొంతమంది పిచ్చివాళ్ళలా దొంగవేషం వేసే వాళ్ళున్నారు. కాని, ఒకసారి దెబ్బలుతిన్నారా దొంగవేషం వదిలేస్తారు. చెరసాలో మరింకే పెద్దశిక్షో వాళ్ళపాలవుతుంది. జీవితమంతా ఒకే రీతిగా పిచ్చివాడిలా ఉంటే పెద్ద శిక్ష ననుభవించనక్కరలేదు. జైలుకి వెళ్ళనక్కరలేదు. కష్టపడ నక్కరలేదు. లేకపోతే రెండురెట్లో, మూడురెట్లో శిక్ష అనుభవించవలసి ఉంటుంది. కనుక వెఱ్ఱివాళ్ళ సమూహంలో అలా కలిసేముందు ఒకసారికి రెండుసార్లు ఆలోచించాలి. తమ్ముడూ నేను చెప్పినదాన్నిఅపార్థం చేసుకోవద్దని ప్రార్థన.

నీ

హర

# 21వ పత్రము

ప్రియమైన ఉపేన్,

నీ వివాహం చక్కగా జరిగిందని విని ఎంతో సంతోషించాను. నీవెందుకంత బాధపడ్డావు? ఏమైనా ఒక కారణమున్నదా ఆ స్వల్ప విషయానికి ఇంత బాధపడటానికి? నీవు విచారించటంలో నిజమైన కారణమేకొంచమైనా ఉంటే నిన్ను నీవు సరిదిద్దుకోగలిగిన అవకాశం వచ్చినందుకు కృతజ్ఞతతో ఉండాలి. లేదా, దాన్ని గురించి పట్టించుకోనే కూడదు. వివేకవంతుడెప్పుడూ తప్పుడు మాటలు. తప్పుడు ప్రచారాలవల్ల లేశమాత్రమూ చలించడు. అవి నిజమని నిరూపించ బడినప్పటికీ, వాటికి చింతించుకుంటూ కూర్చునే బదులు, వివేక వంతులు వాళ్ళని, వాళ్ళు సరిదిద్దుకోవాలని ప్రయత్నిస్తారు. కొంచెంచూడు, భూమిమీద అందరు మనుష్యులూ సమానంగా తెలివికలవాళ్ళుకారు. అలా అంతా సమానంగా తెలివిగలవాళ్ళే అయితే ధర్మ సంరక్షణకీ, మన మధ్య అడుకోవటానికీ దేవదేవుడు మానవరూపంలో వచ్చినప్పుడు అందరూ ఆయన్ని గుర్తించే వాళ్ళు. ఆయనని శరణుజొచ్చేవారు. ఇది ఎప్పుడూ జరగనిపని. ఆ ప్రభువుకి కూడా ప్రతిస్పర్ధులూ , చులకన చేసేవారూ ఉన్నారు. ప్రతివాళ్ళూ తెలివిలో సమానమైతే ప్రపంచంలో ఒకే ఒక స్థిరమైన మతమూ ప్రభుని ఒకే ఒక రూపమూ ఉండేది. ప్రతివాడూ ఇక్కడ తన స్వీయ జ్ఞానానుగుణంగా ఆలోచిస్తాడు. అనువైనప్పుడు తన ఆలోచనలకి రూపం కల్పిస్తాడు. కనుక అటువంటి చిన్న విషయం పట్ల ఆశ్చర్యపోవటం సరికాదు. అటువంటి వెన్నో దర్శించేందుకు సిద్ధంగా ఉండు. ప్రాణ ప్రియమైన తన మతపరమైన నమ్మకాల్ని ఉద్దేశించి చేసే దూషణలు నిస్సందేహంగా దురంత బాధాకరాలు, అందుకని అతి జాగ్రత్తతో రహస్యంగా ఉంచుకోవాలి. అన్ని రకాల మనుష్యుల ఎదురుగా బహిర్గతం చేయకూడదు. ఈ చిన్న విషయం గురించి నీవే మాత్రమూ బాధపడకూడదు. గతించిన గతం తన గతాన్ని భూస్థాపితం చేయాలి. నిజంగా నీదే తప్పైతే క్షమాపణ నీవు కోరవలసిందే. నీవు వైష్ణవాన్ని స్వీకరించావు. దాని మొట్టమొదటి సూత్రమేమిటంటే అల్పమైన గడ్డిపరక కంటే కూడా అల్పంగా ఉండటం. చిన్నవిషయాలే నిన్నంత బాధపెడితే, ఇంకా ఎంతో పెద్ద కష్టాలని నీవు ఓర్చుకోలేవు. నీ ధ్యేయానికి దూరమౌతావు. కనుక దాన్ని గురించి నీ బుర్ర పాడుచేసుకోవద్దంటాను. ప్రతిదీ అతని సంకల్పానుసారమే జరుగుతున్నదని తెలుసుకుని, కొంచెం, ఓర్పు వహించు. హృదయపూర్వకంగా అతని పాదాలని ఆశ్రయించు, అలా అయితే నీవు సుఖంగా ఉంటావు. ప్రశాంతి కలుగుతుంది. మానావమానాలు, లాభనష్టాలు

నిన్నప్పుడు కదిలించలేవు. వైష్ణవ మతానికి మూల సూత్రము సహనం. అది దాన్ని ముఖ్యోపదేశం. ఏరకంగానూ విచారించకు, ములుకులవంటి మాటలని హృదయంలో పెట్టుకోకు. ఒకరినోటినుండి వచ్చిన పరుషవాక్యాన్ని నీ చెవుల్లోనే పెట్టుకో. నీ హృదయంలో వాటి ప్రభావం ఉండనీకు. కాని, ఒకరి హృదయాన్నుంచి వచ్చే మాటల్ని జాగ్రత్తగా హృదయంలో పదిలపరచుకో. ప్రభువు నీ ద్వారా చాలా పనులు చేయవచ్చు, కనుక నీ జీవితం అంత విలువ తక్కువదని అనుకోకు. ఈ జీవితాన్ని నీ స్వంతమని భావించకు. ఆ ప్రభువుదని భావించి జాగ్రత్తగా కాపాడు. ఎప్పుడూ ఇది మర్చిపోకు. ప్రభువు యొక్క భావాన్ని సాక్షాత్తు ప్రభువుగానే భావించి అతడు సాక్షాత్కరించేంత వరకు సంరక్షించు. విధేయురాలైన భార్య తన భర్త అతి చిన్న వస్తువుపై కూడా సర్వేసర్వత్రా శ్రద్ధ కనపరచేటట్లుగా ప్రభుభావనపై అంతటి మన్నన చూపటానికి వెనుకాడకు. ప్రతివాడికీ ఇది వెల్లడించకు నవ్వులపాలవుతావు. కాని, నీ హృదయానికి ప్రియమైన వాళ్ళదగ్గర చెప్పటానికి భయపడకు, నీవప్పుడెంతో ఆనందిస్తావు. లౌకికమైన మిత్రులకి, లౌకికమైన ప్రేమని అందించు. హృదయానువర్తులైన మిత్రులకి హృదయ పూర్వకమైన ప్రేమని అర్పించు. ఆత్మేశ్వరుడి అనురాగాన్ని చూరగొన్నవారు, అతణ్ణి గురించి వినటానికి ఆనందించేవారు నిజమైన మిత్రులు. కేవలం నీ సుఖ దుఃఖాలపట్ల సానుభూతి ప్రదర్శించేవారు లౌకిక మిత్రులు. కనుక ఒకరిపట్ల ప్రవర్తించే తీరు మరొకరిపట్ల ప్రవర్తించకుండా జాగ్రత్తపడు. ఎందుకంటే, విరుద్ధంగా ప్రవర్తిస్తే అప్పుడేదీ ఆనందంగా ఉండదు. హరినామం మరువకు. నీ హృదయం నీ క్రొత్త సహచరి, నీ జీవిత సహచారిణిని తీర్చిదిద్దటం కూడా మరువకు. నీరు నీటితో బాగా కలుస్తుంది. నిప్పు నిప్పుతో కలుస్తుంది. కాని, నీటిని నిప్పుతో కలపటం కష్టం. కృష్ణ ప్రేమ రుచి చూసిన వారు ఎలాగో ఇది చేయగలరు. అందుకని మీ యిద్దరూ ఒక మూలకానికే చెంది ఉండటానికి ప్రయత్నించండి. నీ వెన్నుకున్న మార్గాన్నే నీ భార్య అనుసరించేటట్లు చూడు. ఇదే ఆమెను మలచే సరియైన సమయం. ఒక హిందూ మహిళను పాశ్చాత్య పద్ధతిలో మలచటానికి ప్రయత్నించకు. బీద సాదలకు తల్లివతె ఆమెను మలచు, లేకపోతే ఆ ప్రయత్నంలో పెద్దనిందా ప్రమాదమూ తప్ప ఆనందం ఉండదు. ఆదర్శ దంపతులు కండి. ఆదర్శ దంపతులకి (ఆరాధాకృష్ణులకి) ఆరాధకులు కండి.

భార్య కేవలం ఆటవస్తువు కాదు. అలా అయితే 'సహధర్మచారిణి' (భర్తకు ధర్మకార్యాల్లో సహకరించేది) అని ఆమె అనబడేదికాదు. ఇది నిజం. శాస్త్రాలు చెప్తున్నాయి. పుత్రుడు పుట్టేకొరకే భార్యని స్వీకరించాలి. అందువల్ల వివాహం వల్ల

కలిగే ఇతర సంతానాలు 'పుత్రులు' అని అనటం సబబు కాదు. మొదట పురుష సంతానమే పుత్రుడు (పున్నామ నరకం నుండి తల్లితండ్రులను తరింపజేసేవాడు) మిగిలినవారు కామం వల్ల పుట్టినవారు. అందువల్ల - భార్య ఇల్లంతా పిల్లలతో నింపేందుకు కాదు. మొదటి నుంచీ ఎంతో జాగ్రత్త. సరైన నిర్ణయం తీసుకోవటం అలవరచుకో. ఇది మనసులో పెట్టుకో. ఎంత ఎక్కువ సంతానమయితే అంత కష్టం. కేవలం నగలతో కాదు, ఆధ్యాత్మికా భరణాలతో ఆమెను అలంకరించటానికి ప్రయత్నించు, అలా ఆమెను తీర్చిదిద్దు. ఆమె తన స్వంత పిల్లలకు మాత్రమే కాదు. సర్వ ప్రపంచానికే తల్లిగా ఆమెను తీర్చిదిద్దు. జ్ఞాపకం పెట్టుకో, ఆ లలితాంగుల హృదయాలు ఏరకంగానైనా కాఠిన్యం వహించాయా వజ్రానికన్నా కఠినమవుతాయి. మృదుత్వం మృదుహృదయంలో చక్కగా అమరుతుంది. జన్మతః వారు తల్లులు. కనుక వారిని తల్లులుగా తీర్చిదిద్దటానికి ఎవరికీ ఎక్కువ కష్టంకాదు కనుక మొదటినుంచీ జాగ్రత్తగా ఉండు. చాలా మాట్లాడాను. దయచేసి ఏమీ అనుకోకు. నామీద దయా దృష్టి ఉంచు. నేనడిగేది ప్రేమ, ఈవి. కృష్ణుడి దయవల్ల నేను బాగున్నాను.

మీ

హర

# 22వ పత్రము

ప్రియాతి ప్రియమైన ఉపేన్,

నీ ఉత్తరానికి నిన్ను నేను నిజంగా అభిమానిస్తున్నాను. వైవాహిక బంధం ఆత్మ తృప్తి కై నిర్దేశింపబడలేదు. తల్లిదండ్రుల్ని అనేక విధాలుగా సేవించాలి. కాని, కొన్ని సమయం సందర్భాల్లో స్వయంగా సేవజేయటం సాధ్యపడదు. కనుక ప్రియమైన భార్య అవసరం. అందుకని జీవిత భాగస్వామినిగా నీవు గైకొన్న నీ భార్యని తన విధుల్ని తాను పూర్తిగా తెలుసుకొనేటట్లు చేయటంలో అలసత వహించకు. నీ భార్యని కేవలం ఒక ఆటవస్తువుగా భావించి మోసపోకు. సృష్టి స్థితి లయ కార్యాలు మూడూ స్త్రీ జాతిలో కేంద్రీకరింప బడ్డాయి. ఈ విచిత్రమైన భాండారం నుంచి ప్రజలు ఏంకావాలన్నా కొనుక్కోవచ్చు. జ్ఞాపకం పెట్టుకో, చంద్రుడినీ, జాతిరత్నాన్నీ ప్రసాదించిన సముద్రం నుంచే హాలాహలం ఉద్భవించింది. ( మహాభారతంలో చెప్పబడ్డ దేవాసుర క్షీరసాగర మధనానికి సంబంధించిన ఇతి వృత్తం ) నీ ముందు అతడు రత్నాన్ని విషాన్నీ రెంటినీ ఉంచాడు. ఏది కావాలో తీసుకో, దేవతగానో,

రాక్షసిగానో ని భార్యని ఎలా చేస్తావో అది నీమీదే ఆధారపడి ఉంది. అందరికీ మాతృస్థానంలో స్త్రీ లుంటారు. అలావారూ గౌరవింపబడాలి. విషం కూడా నిధే. కాని, కొన్ని సందర్భాల్లో మాత్రమే శివుడివికా, దేవతలూ, రాక్షసులూ సమానంగా నిన్ను సేవిస్తారు. ప్రతి ఒక క్రియకీ ఒక ప్రతిక్రియ ఉంటుంది. కనుక ఒక ప్రేమ వీక్షణం వాళ్ళపై ఉంచు, తిరిగి వాళ్ళు నీపై ప్రేమ సారిస్తారు. తల్లిదండ్రుల సేవతో ప్రారంభించి, ఆర్తులందర్నీ ఆదుకోవటం నేర్చుకొనే టట్లుగా నీ భార్యని తర్ఫీదు చేయి. ఈ జగత్తు శాశ్వతంగా ఉండవచ్చు. కాని, నీ కది శాశ్వతమని భావించటం ఘోరమైన తప్పిదం. ఈ జగత్తుకి సంబంధించిన వాళ్ళెవర్నీ అన్యులుగా భావించకు. అందరినీ నీ వాళ్ళుగా భావించి గౌరవించు. పొందిన ఉపకారానికి ఎవరైనా అపకారం చేశారా బాధపడకు, క్షమించు. అతని మేలుకోసం హృదయపూర్వకంగా భగవంతుణ్ణి ప్రార్థించు. నీ ప్రేమకి కట్టుబడి క్రూరాతి క్రూర జంతువులు కూడా నిన్ను తిరిగి ప్రేమిస్తాయని కాలక్రమేణా గ్రహిస్తావు. నా కృష్ణుడు ప్రేమసామ్రాజ్యంలో నివసిస్తాడు. అక్కడ ప్రేమ మినహా మరేమీ ఉండదు. వృక్షాలూ, వాటి పత్రాలూ, అన్నీ పూర్తిగా ప్రేమ మయాలు. కనుక ఎలా ప్రేమించాలో నేర్చుకో. చెట్లన్నీ చేమల్నీ, పశువుల్నీ పక్షుల్నీ, నీవు ప్రేమించి వాటి ప్రేమని ప్రతిగా పొందగలిగినప్పుడు ఆ సామ్రాజ్యానికి దోవ దొరకిందని గ్రహించు. నీ కష్టాలు గట్టెక్కుతాయి. అనురాగం గాఢానురాగాన్ని కలిగిస్తుంది. గాఢానురాగం ప్రేమని, ప్రేమ ప్రేమహరినీ అందిస్తాయి. నామాన్ని మరువకు, దాని నుంచి ప్రతిదీ నీవు పొందుతావు.

నీ
హర

## 23వ పత్రము

ప్రియమైన ఉపేన్,

నీ ఉత్తరం క్రొత్తవన్నె పులుముకుంది. తేనెకంటె మధురంగా ఉంది. ఆ కృష్ణుడు ఈ మాధుర్యాన్ని శాశ్వతం చేయుగాక ! ఇది దయామయుడైన ఆ కృష్ణునికి నా ప్రార్థన. ఇంతవరకు నీవు మాత్రమే ఆ కృష్ణ ప్రేమలో మునిగిపోయావు. ఇప్పుడు మీ ఇద్దరూ కలిసి మునిగి ఈదులాడండి. ఎంత మధురమో రుచి చూడండి. శాశ్వతానందంలో తన్మయులైన రెండు ఆత్మలూ కలిసి ఏకమవ్వాలని మాత్రమే నేను కోర్తాను. నీ క్రొత్త జీవితం ఇప్పుడు ప్రారంభమవుతుంది. కనుక హరి మధురనామాన్ని నవ్యోత్సాహంతో స్మరించు. నీ జీవిత భాగస్వామిని కూడా దాన్ని

ˌరించమని చెప్పు. నీ భార్యపట్ల తగిన ఆదరంతో సాగిపో. కేవలం ఒక ఆటవస్తువనే 'వనలో మోసపోకు. ఆ ఏకైక దంపతులు రాధాకృష్ణుల పాదాల వద్ద ఇప్పటి ంచి పడు. నీవు మరువకు, ఆమెను మరువ నీకు. ఈ ఆనందపు సుదినాన్ని ˌష్ణుడు శాశ్వతంగా నిలుపుగాక! ఇంతదూరం నుంచి నారాక నీవెలా నిరీక్షించగలవు! 'రీరకంగా ఇక్కడ ఉన్నా నేను, ఆత్మలో మీ సమక్షంలో ఉన్న ఆనందం ునుభవించాను.

నీ

హర

# 24వ పత్రము

ప్రియమైన రశిక్ ( రశిక్‌లాల్‌డే )

నీ అనుబంధంతోనే నాకెక్కువ ఆనందం. నిన్ను గురించి ఆలోచించినప్పుడు ఉవ్వెత్తుగా పాత జ్ఞాపకాలు నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. తమ్ముడూ! నీతో గడిపిన క్షణాలు నీ జీవితంలోని మహదానంద మధురక్షణాలని నేను చెప్పాలా? నా హృదయమెప్పుడూ నీ సాంగత్యాన్ని అభిలషిస్తుంది. తమ్ముడూ, నాకిది అలభ్యమవటానికి కారణమేమిటో చెప్పగలవా? ఆనందదాయకమైన విషయం నిరంతరానుభవంతో ఆకర్షణ పోగొట్టుకుంటుంది. అని నేనను కుంటాను. అందుకని ప్రేమ ఎప్పుడూ విరహంతోకూడి ఉంటుంది. తమ్ముడూ, కొన్ని విషయాల్ని కొన్ని చోట్ల ఒక పద్ధతిలో సమకూర్చటంలో ప్రభువు ఏ ఆనందం పొందుతాడో ఎవరికి తెలుసు ? అది అవును కాదు అనటానికి మన మెవరం ? ప్రతి ఆచరణలోనూ ప్రతి సందర్భంలోను అ నిర్వి కల్పుడికి సర్వసమర్పణ అవ్వటం తప్ప మరేయితరాన్ని చేయటం అసమంజసమూ, అసంగతమున్నూ. అతని సంకల్పాన్ని తెలిసినవాడు అతడే, అతడొక్కడే. తన స్వల్ప సుఖానికై అనంతానందానికి కంటకంగా ఉండాలని ఎవ్వరూ అభిలషించకూడదు. జనులు ఇది ఇమ్మని, అది ఇమ్మని ప్రార్థిస్తూ అతణ్ణి ఇబ్బంది పెట్టడం కేవలం అవివేకం. అయ్యో తమ్ముడూ, అతన్నేది అర్థించాలో మనకు తెలియదు. ఏ అమూల్య రత్నాలు మనకోసం అతని ధనాగారంలో ఉన్నాయో మనకు తెలియదు. అవివేకంతో కోరుకున్న కేవలం కొన్ని ఆటబొమ్మలు చేతితో పట్టుకొని తిరిగి వస్తాము - ఇంతకంటే హాస్యాస్పద మింకొకటి ఏమున్నది? అర్థంచేసుకోలేక ఆ బ్రహ్మాండ నాయకుణ్ణి కేవలం అశాశ్వత లౌకిక సుఖాన్ని అర్థించి మోస పోతున్నాము. ఆ అబోధ్య, అగాధ భాండాగారంలో రత్నాల సంగతి మనకేమి

తెలియనప్పుడు అందులో అత్యుత్తమ రత్నాన్నిమ్మని అతణ్ణి ప్రార్థించటం యోగ్యం. అప్పుడు తన అన్ని రత్నాలలోనూ విలువైన అతడు అన్నిటి కంటే ఉన్నతమైనదిగా భావించే 'ప్రేమ' మనం పొందుతాము. కనుక తమ్ముడూ, కృష్ణ ప్రేమ కాంక్షించే ఎవరైనా, అతన్నింకేమో అర్థించవద్దని చెప్తాను. ఆ ప్రేమహరి ప్రేమలబ్ధిపొందిన వారికి దూరంగా ఉండలేడు. సాఫల్యమైన భక్తుని సాధన కృష్ణుణ్ణి అతని ముందు సాక్షాత్కరింపజేస్తుంది. సర్పం తన శిరోరత్నాన్ని ఎలా నిజప్రాణాధికంగా భావిస్తుందో అలాగే నా కృష్ణుడు తన ప్రేమని అలా భావిస్తాడు. ఈ ప్రేమ అందర్నీ ఉన్మత్తుల్ని చేసి ఇవన్నీ చెప్పిస్తుంది. తన్మయుల్ని చేస్తుంది.

నీ
హర

# 25వ పత్రము

ప్రియమైన ద్విజేంద్రనాథ్

నీ ఉత్తరమూ, నీ భార్య ఉత్తరమూ రెండూ అందాయి. నా అన్ని ఉత్తరాల్లోనూ నీ యోగక్షేమాలు విచారిస్తున్నా నీ భార్య నన్నెందుకు నిందిస్తున్నదో అర్థం కావటం లేదు. ప్రతి రోజు నేను చదివే, వ్రాసే ఉత్తరాల్ని చూస్తే నన్ను నిందించదు. జాలిపడుతుంది. ఈ వృద్ధాప్యంలోనూ, నా కాళ్ళూ చేతులూ వెనకటి శక్తిలేక బలహీనమైన ఇప్పుడూ అన్ని ఉత్తరాలూ వ్రాయకుండా ఉండలేను. ఏమైనా నేనెప్పుడు వారి (స్త్రీజనం) ముందు దోషినేననీ, నన్ను మన్నించమనీ చెప్పు. గయ్యాళి ఆడబిడ్డలా ఆమె నాతో ఎందుకు ఎప్పుడూ అలా పోట్లాడుతుంది? నిజంగా నా కళ్ళతో నేనామెను చూడలేదు కాని ఇంకా స్పష్టంగా చూసే పద్ధతి ఉన్నది. నన్ను మీ వాణ్ణిగా భావించి సర్వదా నా మీద ఒక దయాదృష్టి ఉంచండి. కొంచెం ఇదివరకటి కంటే బాగున్నావని విని సంతోషించాను. క్రమ క్రమంగా కృష్ణుడు మిమ్మల్ని ప్రశాంత స్థితికి తీసుకుని వెళ్ళాలని నిర్మల హృదయంతో అతని నామ స్మరణంతో ఆనందించాలని నా ఆకాంక్ష. నీవు నామాన్ని మరువకు. అలాగే నీ భార్యనూ మరువ నివ్వకు. మీ ఉభయుల ఆత్మలూ ఏకమై నామ స్మరణ చేస్తుండండి. మీ అమ్మగారికి మారేడాకుల రసం అంత రుచిగా ఉండకపోవచ్చు. ఉదయం సాయంత్రం ఒక కప్పు మారేడాకుల కషాయం ఆమెకు చాలా మేలు చేస్తుంది. కానీ, ఇది జ్ఞాపక ముంచుకోవాలి. "హరినామం ప్రధానౌషధం" హరి భక్తితో నిర్మల హృదయంతో ఒక పాడుబడ్డ

పవిత్రమౌతుంది. మరి నీ పాడుపడ్డ గుడిసె గురించి భయపడుతున్నావెందుకు? రాజమందిరం కన్నా ఆనంద నిలయం చెయ్యి. పాల రాయితో కట్టినా పాయఖానా ప్రక్కనుంచి పోయేటప్పుడు కళ్ళకీ ముఖానికి అడ్డుగా గుడ్డ పెట్టుకుని పోతారు. కాని అడివిలో ఉన్నా, శిథిలమైనా, దేవాలయం ముందు తలవంచి నమస్కరించి ధన్యుణ్ణి అనుకోవటం యదార్థం కాదూ! కనుక నీ వేమాత్రం ఆతురత పడనక్కరలేదు. "మనసా వాచా [illegible] దేవాలయంవలె అవుతుంది". హరిని మరచిన దేవతల శరీరమైనా నరకం వంటిదే. హరిని ప్రేమించు. అతని సర్వాన్నీ ప్రేమించు. హరికి చెందిన వాటిని ప్రేమించకుండా హరినిమాత్రమే ప్రేమించటం ప్రేమని పరిపూర్ణం చేయదు. ఒక ఆంగ్లవనిత అనుకుంటాను, ఒకసారి ప్రియుడికి వ్రాసింది "నన్ను ప్రేమిస్తే నా కుక్కనీ ప్రేమించు" అని. కనుక నీవు కృష్ణుణ్ణి ప్రేమిస్తే అతనిది కనుక సర్వ సృష్టిని ప్రేమించు. ఈ ప్రపంచాన్ని దానికి సంబంధించిన వాటినీ కృష్ణుడి కోసం ప్రేమించు. కేవలం వాటికోసం కాదు. 'ఎవరైనా శాశ్వతానందాన్ని పొందాలనుకుంటే గుప్తనిధిలా నిండు హృదయంతో కృష్ణనామాన్ని ప్రేమించమను. ఇతరులు చూస్తారనే భయంతో గుప్తనిధిని నిరంతరం చూస్తూ ఉండాలని ఇష్టపడకపోయినా నిద్రలో కూడా దాన్ని గురించి ఎలా ఆలోచించకుండా ఉండలేరో అలా కృష్ణుణ్ణి ప్రేమించి హృదయపూర్వకంగా ఆరాధించు, దోచుకు పోగలరు కనుక ఇతరులకి బహిర్గతం చేయకు. ఈ కృష్ణ ప్రేమ ధనం చాలా సంపాదించిన తర్వాత ఏమాత్రం భయం లేకుండా రాజుగారి ఖజానాలాగా అందరిదృష్టికి తేవచ్చును. నిజమైన కృష్ణ ప్రేమికుడవయ్యే వరకూ రహస్యంగా ఉంచాలి. ఎన్నో ఇంటిపనులలో నిమగ్నమై ఉన్నా ఒక కన్య తన ప్రియుని ఆలోచనలను తన మనసు నుంచి ఎలా తుడిచి వేయలేదో అలాగే ప్రాపంచిక కార్యక్రమాల గడబిడలో ప్రియమైన కృష్ణనామాన్ని మరువకు. కృష్ణనామం మినహా మిగిలినదంతా విషమూలమని తెలుసుకో. నీ అంతట నీవు నామస్మరణ చేయి. నీ వాళ్ళందరికీ చెయ్యమనీ చెప్పు. ఒక మధుర పదార్థం ఒంటరిగా తింటే ఇతరులతో కలిసి తిన్నప్పుడు ఇచ్చినంత ఆనందం ఇవ్వదు. ప్రియ సోదరీ, చక్కని వంటకం చూసినప్పుడు నీ కిష్టమైన వాళ్ళని జ్ఞాపకం చేసుకుంటావు కదా! అటువంటప్పుడు నీ కొక్కదానివే ఈ మధుర నామాన్ని స్మరించవచ్చా? అందరికీ చెప్పు, ఆ నామస్మరణ చేయమని. వాళ్ళంతా నీతో సమానంగా ఆనందిస్తారు. సోదరీ, నా శారీలా నీవు కూడా నాకు ప్రియమైన దానివే నమ్మా. శారీని గారవించినట్లు నన్ను గారవిస్తావో లేదో అది నీ మీద ఆధారపడి

ఉంది. శారీలా నీవుకూడా పేదలకి తల్లివి కావాలి. వాళ్ళ కష్టసుఖాల్లో పాలు పంచుకోవాలి. ఆమెలా నామాన్ని ప్రేమించు. అప్పుడు నన్ను ప్రేమించటంలో కూడా ఆనందిస్తావు. లేకపోతే నేను నిన్నెంత ప్రేమించినా నీవు వేరయినట్లు భావించి ఆనందాన్ని పొందలేవు. శారీలా ఉంటావో ఉండవో ఇప్పుడు నీపైనే ఉన్నది. నీవు నన్ను తప్పుపట్టకూడదు. నేను నీ వాడిని. నీ ఇష్టం వచ్చినట్లు ఉపయోగించుకో. నాకందరూ సమానంగా ప్రియులే. ఎవ్వరూ ఎక్కువ కాదు. ఎవ్వరూ తక్కువా కాదు. ప్రాపంచిక దృష్టితో చూస్తే నా ప్రేమలో ఎక్కువ భాగమే పొందావు. శారీకి ఒక కుమార్తె నిచ్చాను. నీకు ఒక కుమారుడి నిచ్చాను. శారీ నా రాయిమతి (నా కుమార్తె) తల్లి, నీవు నా కృష్ణుడి(నాపుత్రుని) తల్లివి. నీకూ శారీకి గల తేడా నీ విప్పుడు గ్రహించగలవు. 'నా పట్ల నీ ప్రేమ శారీ ప్రేమతో సమాన' మని మరెప్పుడూ అనకు.

నీ
హర

# 26వ పత్రము

ప్రియమైన జతీన్,

ఈ రోజు నిన్ను క్రొత్తరకంగా సంబోధించాను. నిన్నేరకమైన సంబోధన ఆనందపరుస్తుందో తెలియదు. నీ ప్రశ్నలకెలా సమాధానం చెప్పాలో నాకు తెలియదు. నిజం చెప్తే నీవు బాధపడ్తావు. నీ చెవుల కింపుగా చెప్పటం కల్లలాడటమే అవుతుంది. ఈ రెండు సంకటాల మధ్య ఉన్నాను. ఏమైనా నీకొక మాట చెప్పనివ్వు. సృష్టిలో అటువంటి ఇతర వస్తువులకన్నా శిలా ఖండాల్లో ఎక్కువగా భగవంతుడి అంశేమీలేదు. మరి శివలింగాలు ఎందుకంత పూజనీయాలైనాయి? తన భక్తుల్ని రక్షించటానికి శివుడు త్రిశూలంతో లింగం నుండి సాక్షాత్కరించాడని నీవు వినలేదా. జగత్ప్రాణుడైన హరి ఒక రాతి స్తంభం పగులగొట్టుకుని ఆవిర్భవించి భక్తుని మర్యాద కాపాడాడు. ఇప్పుడు చెప్పు. ప్రభుని సాక్షాత్కారం రాతికిగల ఒక విధమైన లక్షణమా, లేక భక్తుడి విశ్వాస ఫలమా? ఇది కొంచెం ఆలోచిస్తే, నిజం గ్రహిస్తావు. ఘనత నాదా, అటల్, రాధ మొదలైన వాళ్ళదా? ఒక విలువలేని వాణ్ణి అసలు కనీసం ప్రాణంలేని వాణ్ణి- నన్ను 'ఠాకూర్' లాగా చేయగలిగారు వాళ్ళు. శక్తి వాళ్ళది, నాది కాదు. ఆటబొమ్మలాగా వాళ్ళాడించే పద్ధతిలో ఆడతాను. అందరి ఎదురుగా అన్ని స్థలాల్లోనూ కనిపించగల శక్తి నాకు లేదు. కాని దాన్ని కోరుకున్న వాళ్ళు కోరుకున్న ఎక్కడైనా సరే నన్ను చూడగలరు. నేను వైద్య శాస్త్రజ్ఞుణ్ణి కాదు, వైద్యుణ్ణి కాదు.

ఒక్క మందు గుణమూ నాకు తెలియదు. తెలుసుకోవాలనీ నాకు లేదు. కాని ప్రజలు వాళ్ల యత్నాలతో ఎన్నో భయంకర వాధ్యుల్ని పొగొట్టుకున్నారు. పొగొట్టుకుంటున్నారు. ఘనత వాళ్ళది, నాది కాదు. నా మాటల్ని గుర్తించు, నా గురించి గాని చెప్పవలసి వచ్చినప్పుడు ఇప్పుడు చెప్పినదానికన్న ఎక్కువ ఏమీ చెప్పలేను. బహుశఃనా స్నేహితులు వేరే రకంగా చెప్తారు. కనుక, నేను చెప్పేదీ, ఇతరుల నుంచి నా గురించి నీవు వినేదీ పూర్తిగా భేదిస్తుంది. నేను వంచకుణ్ణనీ, పాపాత్ముణ్ణనీ నా నుంచి నీవు వింటే నీ మనస్సులో అనుమానాలు వస్తాయి. కాని నేనేమి చేయగలను? నాలో ఏమైనా మంచి గుణాలున్నాయేమో అసలు నాకే తెలియదు. ఈ విషయాన్ని గురించి ఆలోచించినప్పుడు మంచిదని పిలవబడేదీ నాలో నాకు కనిపించదు. పైగా నేను చూచేవన్నీ చెడ్డవే. నేను ప్రతివాళ్ళనీ కృష్ణ నామం చేయండని చెప్తాను. కాని నీవెప్పుడైనా నా సంగతి గమనించావా, అసహ్యించుకుంటావు. రోజు కొక్కసారైనా అతని నామస్మరణ చేయటానికి నాకు నేను బుద్ధి చెప్పుకో లేకుండా ఉన్నాను. ప్రతివాడికీ మంచి చేయమని చెప్తాను. కాని, నా విషయంలోనా, అది పూర్తిగా భిన్నం. నేను ఇతరుల సహాయంపై బ్రతకాలని రాసి పెట్టి ఉంది. ఎవరికీ సహాయపడటానికి కాదు. నా గురించి ఇంతకు మినహా నీవేమీ నానుంచి వినవు. మీ బలమే నా బలం. అసలు మీరందరే నా అండా, బుద్ధీ, గౌరవమూ, ఆగౌరమున్నూ. అందుకని నిరంతరం నేను ప్రార్థించే దేమంటే - నేను లక్షణంగా ఉండాలంటే మీరంతా లక్షణంగా ఉండాలి. వికారంగా ఉండే వస్తువైనా అందాల అద్దాల పెట్టెలో పెట్టి చూస్తే అందంగానే కనిపిస్తుంది. అందుకే, ఆ దయామయుణ్ణి ప్రార్థించేదేమంటే - నన్ను అపవిత్రుణ్ణిగానూ, అసహాయంగానూ ఉంచినా, మిమ్మల్ని పవిత్రులుగానూ, అందంగాను ఉంచమని. ఇప్పుడు నన్ను నీవు పూర్తిగా అర్థం చేసుకున్నావని ఆశిస్తాను. నేను నీ చేతిలో ఉన్నాను. నన్ను నీవెలా తయారు చేస్తే అలా నేను కనిపిస్తాను. ఇది మనసులో పెట్టుకో.

నీ

హర



# 27వ పత్రము

అటల్, నా ప్రాణమా!

తమ్ముడూ, నిన్ను నొప్పించానని నీవు వ్రాసిన ఉత్తరం చదివి చాలా బాధపడ్డాను. నా జీవితాన్ని గురించి ఆందోళనకి అస్కారమే లేదు. ఇంకా నేను చాలా కాలం బ్రతకాలి, కాని ఇప్పుడు నేను వృద్ధాప్యపు భృతి (పెన్షను)తో బ్రతికేవాడినని గ్రహించాను. ఏ పనీ చేయకుండా కాలం గడిపే అసంఖ్యాక ప్రభు సేవకులలో నేను ఒకడిని. దీనికి బాధపడను. నీవూ బాధ పడనక్కరలేదు. అయితే నీ ఆశ్రమంలో నేను బృందావనంలో ఉండవలసి రావచ్చు. నా శరీరంలో ఏ భాగమూ చెడిపోలేదు. పైగా రోజు రోజుకీ బాల్యపు పొంకం పొందుతున్నది. అందుకే ఆతురతకి ఆస్కారం లేదంటున్నాను. అతని కోసం పని చేయకుండానే నా ప్రభువు నుంచి, నా భృతి నాకు వస్తోంది. కనుక అలా వ్రాశాను. ఆ ఆలోచనే నన్ను బాధిస్తున్నది. ఏమైనా బాధపడకు. నేను హఠాత్తుగా చావబోవటం లేదు. కాని, నా జీవితంలో గత సంతోషం లేదు. గతంలో ఉన్నట్లుగా నా హృదయం ఉల్లాసంగా లేదు. ప్రభు నామస్మరణలో నేను ఇదివరకు మామూలుగా పొందే ఆనందాన్ని ఇప్పుడు పొందలేకుండా ఉన్నాను. అందుకే మృత్యుభీతిని మించిన అత్యధిక భయాన్ని అప్పుడప్పుడు పొందుతున్నాను. ఒకప్పుడు నేను నిజంగా గొప్పవాడినీ. వారి గత అనుభవాల మధ్యంలో ఎంతో మంది నిస్సహాయులు, ఆర్తులూ నాచుట్టూ జేరుతున్నారు. నా చేతిలో ఏమీలేక వారి కోరికల నేమీ తీర్చలేక పోతున్నాను. నాకై నేను చింతించటం లేదు. కార్యార్థులుగా వచ్చే వారు వ్యధిత హృదయాలతో వెళ్ళవలసి వస్తోందే అని చింతిస్తున్నాను. ఇది నా బాధకి ఒక నిజమైన కారణం. ఏమైనా తమ్ముడూ నన్ను వదలివేయకు, నీ వాడినిగా చేసుకో. నన్నీ స్థితిలో తిరస్కరించితే నీవు నాకు విపరీతమైన బాధ కలిగిస్తావు. ఇది మనస్సులో పెట్టుకో. నేనిప్పుడొక క్రొత్తరకం జీవిత రంగంలోకి అడుగుపెట్టున్న క్రొత్త మనిషిని. నీ వల్ల నేను నిర్భయుణ్ణి. నా మీద ఒక దృష్టి ఉంచు. నేనిప్పుడొక నిస్సహాయ స్థితిలో ఉన్నాను. మనిషిని సేవించటం నాకిప్పుడు ఆకర్షణ కాదు. ఏమైనా కృష్ణుని ఇచ్ఛ బలవత్తరమైనది.

మీ

హర

యజమానిని సేవించటం నిజంగా బాధాకరం. మీ కుల గురువును కృష్ణతత్త్వంలో ఉపదేశం యివ్వమని అడుగు, అది నీకు మేలు చేస్తుంది. ప్రియాతి ప్రియుడు, దయామయుడు అయిన కృష్ణుణ్ణి విడిచి ఇంకెవర్ని ఆరాధిస్తావు? నీ మనస్సులో ఏ సందేహానికి తావివ్వకు. దైత్యకులంలో ప్రహ్లాదునిలాగా 'హరీ' అను. నన్ను విననీ, ఆనందభాష్పాలు వర్షించనీ, హరినామస్మరణ చేస్తూ రాత్రింబవళ్ళు ఆనందంగా ఉండు, ఇతరులందర్నీ అతని భక్తుల్నిచేయి. మరి ప్రధానాలంబనం, గొప్ప ఏడు గడ, వెన్నంటి కాపాడే అనుచరుడు. చెల్లీ, తన్మయురాలివై ఒక్కసారి 'హరి' అనమని చెప్తాను. హరిభక్తులకు ఆపద అంటే ఏమిటో తెలియదు. నిరంతరం సంతోషంగా ఉంటారు. నీవాతని ముఖ్య భక్తురాళ్ళలో ఒక దానిని . కనుక నీకు పాప ప్రసక్తి ఎక్కడ? హరినామం చేయండని నీ బద్ధ శత్రువులకి బోధించు. నితాయిలాగా అవమానింపబడ్డా దయ గలిగి ఉండు. అడగని వారి హృదయాలలో (కూడా) హరి ప్రేమనాటు. సంకోచించకు. పరుష వాక్యాలకు బాధపడకు. శాంతంగా సహించు, ప్రతివారినీ నీవు స్వాధీన పరచుకొన్నట్లు ఒక రోజు నీవు చూస్తావు. అన్యమైన సర్వాన్నీ ఉపేక్షించి, రాధాకృష్ణ చరణార విందాల్ని ధ్యానించు. ఇటు చూడు, చెల్లీ, కుండలోని నీళ్లు చెడిపోతాయి. బావినీళ్ళు, చెరువునీళ్లూ కూడా వాటిలో ఒక ప్రాణి పడి చచ్చిపోతే పాడైనట్లు భావించ బడతాయి. కాని అనంతమైన సముద్రం అసంఖ్యాకులైన పాపాత్ముల నిరంతర సంగంతో కూడా కలుషితం కాదు. నీ దాతృత్వము, ప్రేమ సముద్రపు చల్లదనంలో ఊరట పొందవచ్చు. ఇందుకే, నీ నిర్మల హృదయంలో ఒక్కింత స్థానం సంపాదించాను. ఇప్పుడు నీవు నన్ను స్పృశించావు. నీ వర్ణంతో నాకు రంగు పూయమని ప్రార్థిస్తున్నాను.

ఏ క్రొత్త పాఠం నేర్చుకోవాలను కుంటున్నావు? నేర్చుకోవలసి వస్తే, నీవెవరవో, నీ ధర్మాలేమిటో, నీ ఉనికితో పవిత్రం చేయబడ్డ ఈ భూమిపై నీ ధ్యేయం ఏమిటో మాత్రమే నేర్చుకో. నీ కర్తవ్యాన్ని గురించి విచారించి తెలుసుకున్న తర్వాత ప్రపంచమంతా ఆతురతతో నీ ముఖం వంకనే చూస్తున్నట్లు గుర్తిస్తావు. నీవా ముఖాల్ని చూడగానే నీ మృదు హృదయం కరిగిపోతుంది. వారి దుఃఖాల్ని రూపుమాపుతావు. నీవీ జగత్తుకి గురువువి, జగన్మాతవి, కృపాభాండానివి, దృశ్యాదృశ్య జగత్తులకి ఆశ్రయానివి. నిరంతరం నీ బాధ్యతల్ని యోచించు. నీవు పెంచి పోషిస్తున్న ఒక శిశువు ప్రేమగా నీచేత పోషింపబడకపోతే - ఏఇతర లోకంలో కూడా బ్రతకటం దానికి సాధ్యంకాదు. కేవలం నీ దయతోనే ఈ జగత్తు వర్ధిల్లుతున్నది. ఇకముందూ వర్ధిల్లగలదు. నీ కోసం కాకపోయినట్లైతే ఈ సుందరమైన సృష్టి తక్షణమే కకావికలై

ుమరుగయ్యేది. కనుక చెల్లీ, నీయీ గురుతరమైన కర్తవ్యాన్ని ఎప్పుడూ మనస్సులో ుట్టుకో నీ కర్తవ్యాన్నివివరంగా చూపేందుకే మూల కారణుడైన ప్రభువు కాళీ,తారా, ుత్రి, రాధా రూపాల్లో భూమి మీద అవతరించాడు. ఇప్పుడు తదనుగుణంగా వరించు.

మీ
హర

# 30వ పత్రము

కృపామయీ చెల్లీ,

అనురాగ పూరితమైన నీ ఉత్తరం నాకందేలోగా చాలా చోట్ల తిరిగి తిరిగి నాకు ిింది. అమ్మ చెప్పినదాన్ని కోపగించుకోకు. ఒక పరీక్ష మాత్రమే. అమ్మ ఎప్పుడూ చెడ్డ) నిష్ఠూరంగా ఏమీ చెప్పదు. అయ్యాన్ తల్లి శ్రీమతి రాధికతో అనేక మార్లు మాట్లాడింది. కాని ఎప్పుడూ అంత నిష్ఠురంగా మాట్లాడలేదు. ఇవన్నీ కృష్ణుని ఖేలలు. ని అత్తతో నీవు ఏకాంతంగా మాట్లాడటంలో పొందే ఆనందం ఇతరుల ఎదుట బహిరంగంగా మాట్లాడటంలో ఎప్పటికీ పొందలేవు. ఏకాంతంలో కృష్ణుని గురించి సంభాషణలో అనుభవించే ఆనందం జనం మధ్య ప్రసంగంలో లభించదు. వివాహమైన క్రొత్తలో సిగ్గుతో మునకలైన నీ భర్తని కలుసుకొనేటప్పుడు పొందేటంత ఆనందం ఇప్పుడు నీవు పొండటం లేదని నీవు గుర్తించటం లేదూ? నీ మార్గానికి ున్ను యధేచ్ఛగా అమ్మవదిలేస్తే ఏకాంతంలో కృష్ణుని నుతిలో పొందే అసాధారణానందం పూర్తిగా మరుగవుతుంది. కృష్ణుని గూర్చిన సంభాషణ అప్పుడు బహుశః పూర్తిగా నిస్సారమవవచ్చు. గతంలో నా మనుమడు ప్రతిక్షణం క్రొత్తక్రొత్తగా నీకు కనిపించేవాడు. రోజుల తరబడి ఇప్పుడు నీవుచూడక పోయినా నీ దృష్టిపథం నుంచి అతడు తొలగడు, అమ్మ చెప్పేది విని బాధపడకు, సంతోషపడు, అప్పుడు అతి తొందరగా విశ్వాత్ముని కృష్ణుణ్ణి పొందుతావు. నీ ఏకాగ్రత, ఉత్సాహము కృష్ణుని కోసం ఇంకా ఇంకా నిశ్చలమై నిరంతరం నిన్ను ఆనందంగా ఉంచుతాయి. నీవప్పుడు మహోత్తమమైన సంతృప్తి పొందుతావు. మందు ఎప్పుడైనా రుచికి బాగుంటుందా? రుచి బాగుండలేదని మందు తీసుకోకపోతే వ్యాధి నయమవుతుందా? తీసుకుంటే నిశ్చయంగా ఉపయోగకారి అవుతుంది. అమ్మ అభ్యర్ధనలు ఔషధంలా ఆదరింపబడాలి. శ్రద్ధగా అంగీకరించాలి. అప్పుడు నీ కోరికలన్నీ తీరినట్లు గ్రహిస్తావు. అప్పుడు నీ హృదయ నాథుణ్ణి పొందుతావు. తల్లి ఎప్పుడూ నిర్దయురాలు కాలేదు.

కనుమరుగయ్యేది. కనుక చెల్లీ, నీయీ గురుతరమైన కర్తవ్యాన్ని ఎప్పుడూ మనస్సులో పెట్టుకో నీ కర్తవ్యాన్నివివరంగా చూపేందుకే మూల కారణుడైన ప్రభువు కాళీ,తారా, సావిత్రి, రాధా రూపాల్లో భూమి మీద అవతరించాడు. ఇప్పుడు తదనుగుణంగా ఆచరించు.

మీ
హర

# 30వ పత్రము

కృపామయీ చెల్లీ,

అనురాగ పూరితమైన నీ ఉత్తరం నాకందేలోగా చాలా చోట్ల తిరిగి తిరిగి నాకు చేరింది. అమ్మ చెప్పినదాన్ని కోపగించుకోకు. ఒక పరీక్ష మాత్రమే. అమ్మ ఎప్పుడూ (చెడ్డ) నిష్ఠూరంగా ఏమీ చెప్పదు. అయ్యన్ తల్లి శ్రీమతి రాధికతో అనేక మార్లు మాట్లాడింది. కాని ఎప్పుడూ అంత నిష్ఠురంగా మాట్లాడలేదు. ఇవన్నీ కృష్ణుని ఖేలలు. మీ అత్తతో నీవు ఏకాంతంగా మాట్లాడటంలో పొందే ఆనందం ఇతరుల ఎదుట బహిరంగంగా మాట్లాడటంలో ఎప్పటికీ పొందలేవు. ఏకాంతంలో కృష్ణుని గురించి సంభాషణలో అనుభవించే ఆనందం జనం మధ్య ప్రసంగంలో లభించదు. వివాహమైన క్రొత్తలో సిగ్గుతో మునకలైన నీ భర్తని కలుసుకొనేటప్పుడు పొందేటంత ఆనందం ఇప్పుడు నీవు పొండటం లేదని నీవు గుర్తించటం లేదూ? నీ మార్గానికి నన్ను యథేచ్ఛగా అమ్మవదిలేస్తే ఏకాంతంలో కృష్ణుని స్తుతిలో పొందే అసాధారణానందం పూర్తిగా మరుగవుతుంది. కృష్ణుని గూర్చిన సంభాషణ అప్పుడు బహుశః పూర్తిగా నిస్సారమవవచ్చు. గతంలో నా మనుమడు ప్రతిక్షణం క్రొత్తక్రొత్తగా నీకు కనిపించేవాడు. రోజుల తరబడి ఇప్పుడు నీవుచూడక పోయినా నీ దృష్టిపథం నుంచి అతడు తొలగడు, అమ్మ చెప్పేది విని బాధపడకు, సంతోషపడు, అప్పుడు అతి తొందరగా విశ్వాత్ముని కృష్ణుణ్ణి పొందుతావు. నీ ఏకాగ్రత, ఉత్సాహము కృష్ణుని కోసం ఇంకా ఇంకా నిశ్చలమై నిరంతరం నిన్ను ఆనందంగా ఉంచుతాయి. నీవప్పుడు మహోత్తమమైన సంతృప్తి పొందుతావు. మందు ఎప్పుడైనా రుచికి బాగుంటుందా? రుచి బాగుండలేదని మందు తీసుకోకపోతే వ్యాధి నయమవుతుందా? తీసుకుంటే నిశ్చయంగా ఉపయోగకారి అవుతుంది. అమ్మ అభ్యర్ధనలు ఔషధంలా ఆదరింపబడాలి. శ్రద్ధగా అంగీకరించాలి. అప్పుడు నీ కోరికలన్నీ తీరినట్లు గ్రహిస్తావు. అప్పుడు నీ హృదయ నాథుణ్ణి పొందుతావు. తల్లి ఎప్పుడూ నిర్దయురాలు కాలేదు.

అమ్మ ఏదైనా నీకు చెప్తే అది నీమంచికే అని నీవు గ్రహించాలి. ఆమె మాటల్ని పాటించి, జాగ్రత్తగా , మౌనంగా ఆమె మాటల్ని అర్థం చేసుకొంటే, ఎంత అభివృద్ధి సాధించావో అర్థం చేసుకోగలవు. దీన్ని వ్రాస్తున్నప్పుడు చండీదాసు వ్రాసిన ఒక కీర్తన జ్ఞాపకం వస్తోంది. రాధికని గాఢ విచారంలో చూసి విశాఖ " అదుపు తప్పిన హృదయం సిగ్గునీ మర్యాదనీ పోగొట్టుకుంటుంది" అని హెచ్చరించింది. 'హరి' అంటే ఏమిటో - తెలుసుకోవాలంటే నీవు సహనంగానూ శాంతంగానూ ఉండాలి. సహనం లేని వారు కృష్ణుణ్ణి వారి అందుబాటులోనికి ఎన్నడూ తెచ్చుకోలేరు. స్థాణుని కంటె అతడు నిశ్చలుడు. ప్రశాంతంగా ఉండు అతనిని చూడగలవు. కదులుతున్న జలాల్లో చంద్రుని ప్రతిబింబం నిశ్చలంగా.కనిపిస్తుందా? నిశ్చలమైన నీళ్ళలోనే చంద్రబింబం నిశ్చలంగా స్పష్టంగా చూడవచ్చు.యమునా జలంలో కృష్ణుని రూపం నీవు దర్శించాలంటే ఏ మాత్రం అసహనంగా ఉండకు. నీ ఆశలూ, నా ఆశలూ, పూర్తిగా నెరవెరుతాయి.

మీ
హర

## 31వ పత్రము

తమ్ముడూ, రాధా (శ్రీ రాధా వల్లభశీల్)

నీ ఉత్తరం అందింది, అమ్మ అనారోగ్యంగా ఉన్నదని విని బాధ పడ్డాను. విచారపడకు. ఈ మాయా ప్రపంచంలో అందరూ ఒక కోవకి చెందిన వాళ్ళే. అదే పద్ధతిలో ప్రవర్తిస్తున్నారు. ప్రవర్తిస్తారు. దృశ్యాన్ని చూచి ఆనందించు. నిజమని భావించి ఏ ఒక్క విషయం వైపు మొగ్గకు. నీ తత్త్వం తెలిసీ అలా ఎందుకు వ్రాశానో చెప్పలేను. ఏమైనా నన్ను పట్టించుకోకు. పిచ్చివాడి మనసు ఏసమయంలో ఏనాడిలో చలిస్తున్నది గ్రహించటం కష్టం. సర్వదా ప్రేమలో మునిగి ఉండు. అందర్నీ ప్రేమించు. ప్రేమతత్త్వాన్ని ఎంత పెంచుకుంటే నీ ఆనందం అంత అధికమవుతుంది. కైజరు లాగా రోజులు గడుపుతావు. ఎంత సంకుచితంగా చేసుకుంటావో అంత క్లిష్టమూ, దయా శూన్యమూ ఆనంద రహితమూ అవుతుంది. ప్రేమ వృక్షం ప్రేమ ఫలాన్ని కాస్తుంది. ఏ వివక్షతా లేకుండా అక్కడ హిందువులు, ముసల్మానులు, క్రైస్తవులు సమానాధికారాలు కలిగి వున్నారు. అందుకని ప్రేమించు. పూర్తిగా స్వార్థాన్ని విస్మరిస్తే గాని, నిజమైన ప్రేమ ఉండదు. తల్లి తన బిడ్డని చూసిందా ప్రేమ పొంగి ఇంకా దేన్నీ ఆలోచించదు. అక్కడ ప్రేమ కొంత మోతాదులో ఉన్నది. ఇతరుల కోసం నీవు పూర్తిగా అర్పణ కాకపోతే ఈ ప్రేమ ఏమిటో ఏమి మాధుర్యం దానిలో

ఉన్నదో నీ కర్థం కాదు. అందుకని వ్రజగోపికలు వ్యక్తీకరించిన ప్రేమ - ఆ ప్రేమకి ఒక ఉదాహరణ. వారి ప్రేమ పూర్తిగా స్వార్థ రహితమైనది. పరస్పర ఆనందానికి తమ జీవితాన్ని వెచ్చించారు. కనుక ప్రేమ నర్థించేవారు నిస్వార్థంగా ప్రేమించటం నేర్చుకోవాలి. ప్రేమని విరిచివేసే స్వార్థ వాసనని ప్రేమ భరించలేదు. ప్రేమ లబ్ధికై ప్రేమించు. ప్రేమతో ప్రేమ వ్రజాన్ని చేరగలవు. మోడు వారిన హృదయంతో ఎవరూ అక్కడకు వెళ్ళలేరు. ఆ రాజ్యానికి స్రామాజ్ఞులు, ప్రజలు, రక్షకులు పూర్ణ ప్రేమమయులు. ప్రేమ పరిపూర్ణులు కానిదే ఎవరూ దాని ప్రవేశానికి అనుజ్ఞాతులు కారు. ఒకవేళ ఎలాగో లోపలికి వెళ్లగలిగినా అక్కడ ఉండటానికి అర్హులు కారు. కనుక మూల్యాన్ని లెక్కించకుండా ఎప్పుడు అవకాశము వస్తే అప్పుడు ప్రేమని కూడ బెట్టడం లక్ష్యంగా పెట్టుకో. ప్రతిరోజూ ప్రేమకై నీ కోరిక అధికం చేసుకో. ఎందుకంటే రత్నాన్ని కొనగలిగే మూల్యం తీవ్ర వాంఛ మాత్రమే. తపస్సులు, పూజలు మొదలైనవి ఆ రత్నాన్ని కొనగలిగే మూల్యంగా అంగీకరింపబడవు. అంగీకరించటానికి, కనీసం వాటివైపు చూడటానికి ఎవరూ పట్టించుకోరు. అక్కడి ప్రతి వస్తువు సరళమైనది. నిర్మలమైనది. కల్తీలేనిది. ప్రతి వస్తువూ దానంతట అది పరిపూర్ణమైనది. నిర్మలమైనది, ఆ రాజ్యంలో ధ్యానాలు, నియమాలూ విలువలేనివి. వాటిని సాధన చేయటానికి సమయమూ లేదు. అటువంటి చోట సరిపడి ఉండాలంటే సరళంగా తనని తాను తీర్చిదిద్దుకోవాలి. ఏ మాత్రం మలినమైనా నిష్ప్రయోజనమవుతుంది. ఆ ప్రేమ బృందావనం పూర్తిగా ఒక విలక్షణమైన రాజ్యం. అక్కడి నియమాలు కూడా మామూలివి కాదు . చెప్పటానికి కష్టం. తీవ్ర వాంఛ, ధ్యానము క్రమంగా దీన్ని స్పష్టం చేస్తాయి. ఎక్కడపడితే అక్కడ దీన్ని గురించి మాట్లడగూడదు. ఎవరైనా అలా దాన్ని గురించి మాట్లాడ వలసి వస్తే విశ్వసనీయుడు కాకపోగా పిచ్చి వాడిగా భావింపబడతాడు. పిచ్చివాడి ఈ మాటలు పిచ్చివాళ్ళకే బాగా అర్థమవుతాయి. వాళ్ళే ఆనందిస్తారు. వాదన, యోచన అనే తిరగలిలో పాడిచేస్తే దాని ఆస్తిక్యమే లుప్తమవుతుంది. విద్యలూ సిద్ధులూ అక్కడ గౌరవించబడవు. పైగా విలువలేక నిర్వీర్యమవుతాయి. తమ్ముడూ, రాధా, నీకు అన్నీ తెలుసు. నీకు ఇంకా నేనేం చెప్పాలి ? సదా నామం చేయి. ప్రాపంచిక క్లేశాలకి భయపడి నీ లక్ష్యాన్ని జారవిడువకు. విషయాలు వాటి మానాన వాటిని ప్రవర్తించనీ, వాటి వంక చూడకు. పిచ్చిగా పరుగెత్తు. నీకు చాలా సంగతులు చెప్పాలనుకున్నా, వ్యక్తం కావటం లేదు. మళ్ళీ మనం కలుసుకుంటే, ఈ ఉత్తేజం వస్తే నిన్ను నేను అట్టడుగుకు తీసుకువెళ్లి ఏ రత్నాలు, ఏ ఆనందాలు అక్కడ ఉన్నాయో చూపిస్తాను.

నీ

హర

# 32వ పత్రము

తమ్ముడూ, రాధా (రాధా వల్లభశీల్)

నీ టెలిగ్రాము, రెండు ఉత్తరాలూ నన్ను చాలా దుఃఖ పెట్టాయి. నీ సోదరుడు కృష్ణ నుంచి విన్నాను. అతనికి సమాధానం వ్రాశాను. మొదట మంచం (శరీరం) బలహీనంగా ఉన్నది. ఇంకా దరిద్రంతో కప్పబడి ఉన్నది. ఎవరు అంత యిబ్బంది పడుతూ దానిలో పడుకోవటానికి (వసించటానికి) సిద్ధపడతారు ? మరి ఎందుకు అది అద్దెకి గాను ఉన్నదీ అని నీవడిగితే కేవలం ఆ స్థలాకర్షణ వల్ల మాత్రమేనని చెప్పాలి. కృష్ణుని హృదయంలో శ్రీకృష్ణుడు నిరంతరం ఉంటాడు. అందుకే అది ఒక బృందావనమైంది. అందుకే జీవుడు అక్కడ అంత యిబ్బందికి ఓర్చుకుంటూ కొట్టుమిట్టాడు తున్నాడు. అది పవిత్ర స్థలం కానట్లయితే చాలా కాలం క్రిందే పారిపోయి ఉండేవాడు. కనుక, ఉన్నా, పోయినా విచారించకు. ఉభయత్రా లాభమే. వెళ్ళినా మంచిదే, ఉన్నా మంచిదే , ఏమైనా , భగవన్నామ స్మరణ వినటానికి ఆ పవిత్ర ఉపాధిలో ఒక క్షణం ఉండటానికి ఇష్టపడుతోంది. బాధపడకు. కృష్ణుడు నీ వాంఛల్ని ఈడేర్చుతాడు. కృష్ణలాల్ ఉత్తరము, నీ టెలిగ్రాము వచ్చినప్పటి నుంచి నా మనస్సు మహాదుఃఖంలో ఉన్నది. శ్రీ కృష్ణుడు అది పోగొడతాడో, లేదో తెలియదు అతని దివ్య పాదాల్ని ఆశ్రయంగా చేసుకున్నవారు పోవటం రావటం గురించి ఎందుకు భయపడాలి ? క్రమంగా ఉత్తమ ఉపాధి నివసించటానికి వారికి లభిస్తుంది. వారెప్పుడూ మరణించరు. శ్రీ కృష్ణుడే స్వయంగా చెప్పాడు. " తెలుసుకో అర్జునా, నాభక్తుడు నశింపడు " (నమే భక్త ః ప్రణశ్యతి - గీత) అతని భక్తుల్లో ఎవరూ మరణించరు. ఒక ఉపాధి నశించిన తర్వాత ఇంకొకదాన్ని పొందలేకపోతే, లేక నీచమైనది మరొకటి పొందితే మరణించాడని అనబడతాడు. కాని, ఉత్తమ ఉపాధులు, ఉత్తమ సాంగత్యం లభిస్తే మరణించాడని అనవచ్చా? కృష్ణనామం ఒకసారి స్మరించినవాడు దుస్సాంగత్యం పొందడు. అతడెక్కడికి వెళ్ళినా కృష్ణదాసులతో వసించే ఆనందాన్ని అనుభవిస్తాడు. తృప్తి పొందుతాడు. సర్వదా క్రొత్త, ఉత్తమ మిత్రులను పొందటం అభిలషణీయం కాదా? భయం ఎందుకు మరి? మీరు కృష్ణ దాసులు. మీ ముఖాలు పేలవంగా ఉండటం చూసి (కృష్ణుడు) చాలా బాధపడ్డాడు. అందుకని ఎప్పుడూ సంతోషంగా ఉండండి. మీ హృదయ పెన్నిధానాన్ని సంతోషపరచండి అని అంటాను. తమ్ముడూ. సంకుచిత దృష్టి గలవారు వ్రజలీల దర్శించి, మధుర వరకూ (అతని కృత్యాల్ని అక్కడ చూడటానికి) కళ్ళతో అతని

వెన్నంటుతారు. కాని వ్రజానికి చెందినవారు నిరంతరం వ్రజలీల దర్శిస్తారు. వారు మధుర ఎఱుగరు (మధురలో ఏం చేశాడో ఎఱుగరు) పైగా విరహవేదన భరించలేరు. (బృందా వనంలో నుండి కృష్ణుడు వెళ్ళటం వలన) తమ అస్తిక్యాన్ని మరచి వారు నిరంతరం మహారాసానందంలో మునిగి ఉంటారు. మధురకు శ్రీకృష్ణ నిష్క్రమణం గురించి ధ్యానిస్తూ నిన్ను నీవు వేధించుకోకు. కృష్ణుడు ప్రేమ మయుడు. అతని రాజ్యము ప్రేమమయము. అతని దాసులు ప్రేమ పూర్ణులు. అక్కడి క్రీడలు ప్రేమ క్రీడలు, లీలలు ప్రేమ లీలలు. ప్రేమ తప్ప అక్కడ మరొకటి దొరకదు. ప్రేమే ఆహారం, పానీయం, వేషమూ, అలంకరణమున్నూ, గుర్తించదగ్గ ఒక్క తేడా ఏమిటంటే ప్రేమ వివిధాకృతులతో మూర్తీభవించి ఉన్నది. ప్రతిమూర్తీ స్వయం సంపూర్ణమే. తన పరిధిలో ఏదీ కోరటం లేదు. ఎక్కడ పచ్చిగడ్డికూడా రాజుచేత రాణిచేత శ్రద్ధగా చూడబడుతుందో అటువంటి అతని ఉద్యానవనంలోని ప్రతి వృక్షపు కుసుమాలూ వివిధ వర్ణాలవీ, వివిధ వాసనలవీ, ఉద్యానవన శోభను పెంపొందించేవే అన్నీ. అక్కడ అన్నివస్తువులు తమదృష్టిని (లక్ష్యాన్ని) పంచుకొంటాయి. మర్యాదలో భేదంలేదు. అంతా సమానమే సమానంగానే అంతా కృష్ణునికి ఆనందాన్ని కల్గిస్తున్నాయి. కనుక భయాలకి విచారాలకి ఆస్కారంలేదు. నవ్య నూతన వస్తువుల్ని దర్శిస్తూ క్రొత్త ఆటల్ని ఆడుతూ సాగిపో. ఆడటానికి వచ్చిన వారు ఎందుకు బిడియపడి వెళ్ళిపోవాలి? వారు స్వతంత్రులు, స్వీయ సంకల్ప పర్యవేక్షితులు. వాని సుఖం ఆనందిస్తున్నారు. కనుక ఈ ఖేలలో వారు అలసిపోరు. విడిపోతున్నారు. మళ్ళీ మళ్ళీ కలుస్తున్నారు. రోజూఒకే ఆట ఆనందాన్ని యివ్వదు. కనుక కృష్ణ భక్తులు ముక్తి నర్థించరు. ముక్తి విసుగు గలిగించే ఒక ఖేల. నీరసపు సమభావము.

కృష్ణభక్తులు అటువంటి ఆట ఆడటానికి ఇష్టపడరు. వారు క్రొత్తవీ విభిన్నమైనవీ అయిన క్రీడలు వాంఛిస్తారు. ఆనందంతో ఆడతారు. నీకు భయంలేదు. పడవమీదికెక్కావు. కనుక తాత్కాలికమైన యిబ్బందిని పట్టించుకోకుండా ఒక్క క్షణం ప్రశాంతంగా కూర్చో. తొందరలోనే ప్రేమ సామ్రాజ్యాన్ని జేరతావు. ఆ ప్రేమ మేళాలో ఆల జన సమూహంలో నీ అస్తిక్యత మర్చిపోతావు. అక్కడికి జేరాక ఈ దిక్కులేని వివిని అప్పుడప్పుడు జ్ఞాపకం పెట్టుకోవటం మర్చిపోకు. నేను పడవలోకి ఎక్కటానికి ర్ఫుణ్ణిగాను. అందుకని నీపై ఆశపెట్టుకొన్నాను. నాచుట్టూ వాతావరణం పడవని ఖంచగలదు. ఇక్కడ నాకొక పాట జ్ఞాపకం వచ్చి నన్ను నిరుత్సాహపరుస్తున్నది. ానిలో వ్యక్తీకరించబడిన నమ్మకాలు సరైనవని నీవు గ్రహిస్తావు. ఆ పాట యిది ఈ నాప్రియమైన పడవలో ప్రేమ పూర్ణుడు కాని వాడినెవడినీ ఎక్కనివ్వను. ప్రేమ

లేనివాడు ప్రవేశించటానికి అనుమతింపబడడు. ఎందుకంటే ఏ మాత్రపు బరువుకైనా పడవ మునిగిపోవటం ఖాయం. మొదట మీ హృదయాన్ని పరీక్షించుకోండి. మీరు ప్రేమగలవారైతే రండి, ఎక్కండి. ఈ సరుకు వ్యాపారులు రావచ్చు. ఎక్కవచ్చు. వెంటనే అవతలి ఒడ్డుకు కొనిపో బడతారు. పడవ ప్రేమధనిని చూడగానే ఒడ్డుని సమీపిస్తుంది. ఆ కెరటాలకి భయపడనివారు తప్పకుండా అవతలి ఒడ్డుకి జేర్చబడతారు.'' ఈ మాటలు ఎంత ఆకర్షణీయాలో అంత యదార్థాలు. కనుక నన్ను తాకగానే పడవ మునిగిపోతుందేమోనని నేను విపరీతంగా భయపడతాను. నా దగ్గర ప్రేమ నిధులు లేవు. దయచేసి నీతోబాటు తీసుకెళ్ళు. ప్రయాణపు ధనం (పడవఛార్జీ) కొరకు ఒక సారి నాకు ఒక అవకాశము సంకల్పముకలిగాయి. కాని, ఎదురుగాలులు వీచి జలదాల్ని ఏదో మరో దిశకు తరిమాయి. మేఘాలు కనిపించాయి. కాని, దురదృష్టవశాత్తు తక్షణం అదృశ్యమయ్యాయి. ఈ బేరంలో నేను నిర్జీవంగా మిగిలాను. "చూడనప్పుడు చాలా బాగున్నాను'' అన్న సామెత నాకు సరిగ్గా సరిపోయింది. ఏమైనా నీవు సుఖంగా ఉన్నావని వింటే నా కష్టాలన్నీ తొలగి పోతాయి. నేను కూడా ఆనందంగా ఉంటాను. నీ కష్టభారాన్ని నా తలపై వేయి. ఓటి పడవల సాయంతో ఆనందంతో కేరింతలతో అవతలగట్టుకి జేరు. ఇది నన్ను చూసి ఆనందించనీ .

మీ
హర

# 33వ పత్రము

అటల్, నా ప్రాణమా!

నీ ఉత్తరమూ, ఖాన్ బహదూర్ నుండి ఒక ఉత్తరము అందుకోగానే అనేక ఆలోచనలు నా మనస్సును కలచివేశాయి. సోదరా!నా ఆట చివరి దశలో ఉన్నది. నేనిప్పుడు ప్రభువు యొక్క పెన్షన్‌దారును. నా మాటలు, సిఫార్సులు ఇప్పుడు నిరుపయోగాలు. మరి ప్రజలు ఇంకా నా దగ్గరకెందుకు వస్తున్నారని నీవు ప్రశ్నిస్తే సమాధానం ఇది - నేనాతని సేవలలో ఉన్నప్పుడు నేనాతని ప్రధానాభిమానులలో ఒకడిని. ఇది జ్ఞాపకం పెట్టుకొని ప్రజలు నేనింకా అదే స్థితిలో ఉన్నానని అనుకుంటున్నారు. ప్రభువు ఇంకా నా యెడ అదే దయతో ఉన్నాడు. కాని, అతని ఆంతరంగిక విషయాలలో నాకేమాత్రము సంబంధము లేదు. వాటి నుంచి నన్ను నేను అల్లంత దూరాన ఉంచుకుంటాను. ఇదేమీ పర్వాలేదు. నాపెన్షను

ఎక్కువకాలం అనుభవించాలనే కోరికలేదు. నామనస్సు క్రమేణా తన శక్తిని కోల్పోతోంది. నా హృదయము ఐహికానంద రహిత మౌతోంది. ఒకానొకప్పుడు ఇంద్రుని స్వర్గాని కన్నా మనోహరంగా కనిపించిన ఈ భూమి ఇప్పుడు నాకు ఆకర్షణీయంగా లేదు. ఈ లోపం భూమిది కాదు. ఈ వార్ధక్యములో నా దృష్టి, నామనఃస్థితి ఇందుకు కారణాలు. ఈ భూమి ప్రభువుది. ఈ భూమి ప్రభావం ఇది వరకు ఎలా ఉన్నదో ఇంకా ఇప్పుడూ అలాగే ఉన్నది. మార్పునాకు మాత్రమే వచ్చింది. ఏమైనా నా గురించి చింతించకు. ఇటీవల నేను విపరీతంగా బాధపడుతున్నాను. శూన్యం తప్ప ఏ వైపూ నాకేమి కనిపించటంలేదు. పచ్చనిపంట కంకులు పుష్కలంగా ఉన్న ధనికుల పొలాల్ని చూసి నా స్వంత భూమిలో కలుపు మొక్కలే విపరీతంగా ఎదిగాయే అని విచారిస్తున్నాను. ఇది ఇలా ఉంటే- భయంకర క్రూర మృగాలకి తగిన ఆవాసంగా మారింది. నిజంగా సోదరా! నేను పూర్తిగా మోసగింపబడ్డాను. ఇప్పుడు పూర్తిగా సమయంమించి పోయింది. నీ దయ మినహా నా స్వంతమని చెప్పుకోవటానికి ఏమీ లేదు. నేను సర్వం పోగొట్టుకొని ఇప్పుడొక భిక్షుకుడనయ్యాను. తమ్ముడూ, ప్రభువు యొక్క పరిపూర్ణాదరాన్ని అనుభవించి తర్వాత నిరాశలకి లోనవటం నిజంగా చాలా బాధాకరం. నారోజులన్నీ సమాన ఆనందదాయకాలే అనుకున్నాను. భవిష్యత్తు కోసం ఏమీ ఏర్పాటు చేసుకోలేదు. ఇప్పుడు నా గత కర్మ ఫలితాన్ని మార్చటం ఏమాత్రం సాధ్యంకాదు. ప్రభువు ఎప్పటిలాగానే ఇంకా ప్రేమిస్తున్నాడు. కాని, నా ప్రస్తుత స్నేహితులు తమ దురుద్దేశాలతో అతనిని సమీపించనీయటం లేదు. అతనిని గురించి ఎన్నో విషయాలు చెప్పి నన్ను మోసగిస్తున్నారు. తమ్ముడూ, ఆశ్చర్యపోయినా మోసగింపబడ్డా నా మంచి తనము నా తప్పులు దిద్దుకోవటంలో పూర్తిగా నిష్ఫలమైనదని అర్థం చేసుకోగలను. మాయా ప్రభావం అంత బలీయమైంది. నా ఖేల అంతమైనదని తలుస్తాను. ఒక్క మనవి. కాల మాసన్నమైనప్పుడు అతని మాటలు, అతని దయ గుర్తు చెయ్యి. పశ్చాత్తాప హృదయంతో నాతప్పులు ఒప్పుకుంటే ఇంకా అధికంగా నన్ను ప్రేమిస్తాడని నా నమ్మకం. అతడు ఎలా పూర్ణ ప్రేమమయుడో అలాగే పరిపూర్ణ దయామయుడు తమ్ముడూ, అతని దయని తలుచుకున్నప్పుడు నన్ను నేను సంభాళించుకోలేను. పుణ్యాత్ములకై ఇతరులని నియోగిస్తాడు. వారి యోగక్షేమాలు చూడమనీ, మార్గం చూపమనీ, కాని, పాపులకై, పతితులకై స్వయంగా తానే కావలసినదిచేస్తాడు. పతితులు అతని నుండి పొందే క్షమ మరేచోటా ఊహించలేరు. ఏమైనా నా జీవితం ఆఖరి దశకు త్వరగా సమీపిస్తోందని తలుస్తాను. దానికి విచారపడకు. తమ్ముడూ

తనపని చేసిన తర్వాత మనిషి సుస్వార్జిత విశ్రాంతి నభిలషిస్తాడు. అతని తాలూకు వారు ఏరకంగానైనా బాధపడతారా? అందుకని బాధపడవద్దంటాను. నా కార్యం ముగిసింది. అనుమతి రాగానే విశ్రాంతి తీసుకోవటానికి వెళ్తాను. ఇందులో విచారించటానికి నాకేమైనా ఉన్నదా? బహుశా ఈ మాటలు నీకు రుచించటం లేదు కాబోలు, అయితే ఇంకేమి చెప్పను. నీ స్వంత ఆశ్రితుడిగా నా యెడ దయగా ఉండు. ఈవెఱ్ఱివాడు మళ్ళీ పిచ్చివాడయ్యాడని, ఇతని మాటలతో ఇతనిని అంచనా వేయవద్దని శారీతో చెప్పు. నా భార్య బాగానే ఉన్నా అంత సుఖంగా లేదు. ఇప్పుడు కలహం ప్రశాంతి స్థానాన్ని ఆక్రమించుకున్నది. మిఠాయిలు నాలికకి అల్లంత దూరంలో ఉంచాలి. దాని(నాలిక) తాకుడుచే మాధుర్యాన్ని కోల్పోతాయి. అతిసారము (విరేచనాలు) అయ్యేటట్లు చేస్తాయి. బహుశా దాహోపశమనముకన్న, దాహోద్రేకమే ఆనందాన్నిస్తుంది. యాత్రికుడు తీర్థయాత్రలకి బయలుదేరినపుడే పుణ్యస్థలిని సమీపించినప్పటికన్నా ఎక్కువ ఆనందిస్తాడు. బహుశా రాజు వైభవాన్ని చూడటం, రాజుకావటంకన్నా ఎక్కువ ఆనందాన్నిస్తుందేమో. ఏమైనా, తమ్ముడూ కృష్ణుని మధుర నామాన్ని విస్మరించకు. ఎందుకంటే నేను మర్చిపోయాను. నీవే రాజుగా ఉండు. నాయాత్రకి కావలసింది మాత్రమేనాకివ్వు. శారీతో కూడా అలా చేయమని చెప్పు. నా ఆదాయవ్యయపట్టిక అప్పు చూపిస్తోంది. ఇది ఒక వినూత్న ఆనందం. నేను చాలా సంతోషంగా ఉన్నాను. నేల విడిచి నిరాధారమైన శూన్యంలో తిరగగలగటం ఉపశమనం కాదూ? ఇప్పుడు నేనలాగే చేస్తున్నాను. (నా ఆదాయ వ్యయ పట్టికలో సున్నాతో)

నీ
హర

# 34వ పత్రము

ఓ తమ్ముడూ (బాబూహరన్ చంద్రశేన్)

ఒక రాజుకి ఒక రాజు స్నేహితుడు. ఒక ఆసామికి ఒక ఆసామి స్నేహితుడు. ఒక సాధువుకి ఒక సాధువు స్నేహితుడు. నాలాంటి పాపి నిస్సందేహంగా నీకు సరైన అనుయాయి అవుతాడు. ఒక చిల్లర దొంగ గజ దొంగకి తన రహస్యాన్ని తెలియపరచటంలో భయంగాని, సిగ్గుకాని చెంద నక్కరలేదు.రా. నిన్ను అక్కున చేర్చుకోనీ, నా హృదయాన్ని నగ్న పరచి ( విప్పి ) ఒకటి రెండు మాటలు చెప్పనీ, తన మనస్సుని ఒక దొంగ ఎవరికీ బహిర్గతం చేసి ఊరట చెందలేడు కనుక అంతగా

అతడు వ్యాకుల పడతాడు, కాని అదృష్టవశాత్తూ మరొక దొంగని చూస్తే ఊరట చెందినట్లు ఊపిరి పీల్చుకుంటాడు. ఈ రోజు నా స్థితి సరిగ్గా అలాగే ఉంది. దొంగలకెప్పుడూ ఒక ఉమ్మడి కూటమి ఉంటుంది. అలా వ్రాసి నన్నెందుకు అవమానం పాలు చేశావు? నీ స్థితి నా స్థితి కంటె దారుణం. అవును, నిజం, ఒకప్పుడు నా ప్రభువుకి ప్రియాతి పియుణ్ణి. కాని మతాంతరీకరణ పరుల మోసంలో పడి మరొక ప్రభువు కోసం ఆశపడ్డ క్షణం, నా ఆత్మేశ్వరుని పట్ల శ్రద్ధాసక్తుల్ని విడిచి పెట్టాను. ఇప్పుడు ఒక వీధి బిచ్చగాడిగా నా దురదృష్టానికి రోదిస్తూ, గత మహాదృష్టాన్ని జ్ఞాపకం చేసుకుంటూ నేను బ్రతికుండటం కంటె మించి చస్తున్నాను. నా వంటి దురదృష్టవంతుడింకొక డుండడు. నా అనుభవం స్వకీయం, బాధలు పడి గ్రహించినది, కనుక శాస్త్రవిహిత ధర్మాల కంటె, గొప్ప అగ్ని పరీక్షలకు తట్టుకొనేవి, అంతకంటె నిర్వివాదమైనవీ అయిన నా మాటలను గ్రహించి , ఎవ్వరూ, ఎప్పుడూ ఎటువంటి ఘోరమైన దుఃఖాలలోనూ మతాంతరీకరణ చేసేవారి మోసపు ప్రభావానికి లోనై తన ప్రభుని విడిచే యోచనే చేయకూడదు. నీ హృదయాన్ని ఎవరికి సమర్పించావో అతనికి అనువర్తించి కూడా ఉండు. రెండు రోజుల కష్టాలు ఎలాగో అంతమవుతాయి. ఆ తర్వాత అతని ప్రేమాస్పదుడవై మహదానందంలో నీ జీవితం గడుపుతావు. అలా కాకపోతే నాలాగా వీధులలో బిచ్చగాడివవుతావు. నిజం. నా ప్రభువుకి విశ్వాసపాత్రుడిగా ఉన్నప్పుడు కామితార్థ ప్రదాయిని అయిన కల్పవృక్ష ప్రసాదంలా నేనేది తలిస్తే అది పూర్తిగా ప్రాప్తించేది. ఆ రోజు గతించింది. అందం ఉన్నప్పుడు గౌరవింపబడలేదు, ఆదరింపబడలేదు, అందుకని నే నీ స్థితికి దిగజారి పోయాను, విశ్వాస హీనుడిని ఎవరు ఆదరిస్తారు ? నేను బిగ్గరగా ఏడ్చినా ఎవ్వరూ చూడను కూడా చూడరు. పైసాలేక, పరులపై ఆధారపడ్డవాణ్ణి, కనుక దయచేసి నన్ను క్షమించు , పతితుణ్ణి కనుక నన్ను ఏవగించుకోకు. నా కృత్యాన్ని ఏవగించు . నా పట్ల దయాళుడివికా, పతితుణ్ణి కనుక చేతనైతే ఉద్ధరించు. నీ సాంగత్యంలో నేను నిర్మలుణ్ణి కావచ్చు. కనుక నన్ను నీ స్నేహితుణ్ణి చేసుకో. కాని నీ జీవితంలో నా కృత్యాన్ని సాంగత్యంలోకి తీసుకోకు. పాపాన్ని ద్వేషించు, కాని పాపిని కరుణించు, ద్వేషించకు, రారాణిగా అన్నీ ఉన్న రోజున అడిగినవన్నీ సంకోచం లేకుండా ఇచ్చాను. ఎందుకంటే అప్పుడు అవసరం లేదు కనుక. ఈ రోజు ఒక వీధి బిచ్చగాడిలా ప్రతివాణ్ణి సంతృప్తి పరచలేకుండా ఉన్నాను, క్షమించ ప్రార్థన. నీవు కూడా నా మార్గాన్ని అనుసరించు. ప్రభు కృపకి పాత్రుడివవుతావనే ఆశతో - ఆ రోజుల్లో అలా ఎందుకున్నానో ఒకటి రెండు కారణాలు చేప్తాను. ఒక వందమంది ప్రవక్తలు ఏక కంఠంతో ఏదైనా చెప్పితే, అది ఒక పాపి తన ఆత్మకథ చెప్పటం కన్నా వందరెట్లు తక్కువ సాఫల్యాన్ని తక్కువ ప్రయోజనాన్ని కలిగిస్తుందని భావిస్తాను. ఇదే నన్ను

బహిరంగంగా చెప్పిస్తోంది. నా స్వీయ పురోగతికీ పతనానికీ కారణం, నేను చెప్పబోయే విషయం నుంచి ప్రతివాడూ జాగ్రత్త పడాలి. ఎందుకో తెలియదు. జీవితపు తొలి దశలో శ్రీకృష్ణ నామంస్మరించటానికి బలమైన ఇచ్ఛ ప్రబలింది. ఆ మహాసముద్రంలో చుక్కాని లేకుండా సాగిపోయాను. మొదట్లో చిన్న కష్టాల్ని ఎదుర్కొన్నాను. అవి నన్ను మరలించలేక పోయాయి. నా మార్గంలో రెట్టించిన ఉత్సాహంతో పురోగమించాను.క్రమేణా ఎంతో బృహత్తరమైన ఆటంకాలు, ప్రమాదాలు నాకు మహత్తర సహకారులుగానూ, సదుపాయాలు గాను కనిపించాయి. అజ్ఞానంతోనూ, అవ్యక్తంగానూ అప్పుడు నా హృదయేశ్వరుణ్ణి ప్రేమించాను. ఈ నా ప్రేమ తొలిదశలో ఈ ప్రపంచంలో ఉన్న ప్రతిదాన్ని నా ప్రభువుకి సంబంధించిన దానిలా ప్రేమించాను. సర్పాలూ వ్యాఘ్రాలూ ఆఖరికి మత్తేభాలూ అతనివేనని ప్రేమించాను. తిరిగి వాటి ప్రేమను పొందాను. అప్పుడు నేను బ్రతికున్నానో చచ్చిపోయానో తెలిసికోలేక పోయాను. తిండీ, తీరికా లేకుండా ప్రాపంచిక సుఖాలన్నీ వదలి, అటువంటి సుఖాల పట్ల కామితం కూడా నా హృదయంలో వర్జించి అపారానందం అనుభవించాను. ఈ రోజు అన్ని రకాల సుఖాలలోనూ మునిగి గత ఆనందంలో అణువంతరుచి చూడటానికి కూడా పూర్తిగా విఫలుణ్ణవుతున్నాను. దుశ్శీలవతియైన స్త్రీ తన విటుని వ్యామోహంలో అతని సాంగత్యంలోనే సదా ఉండాలని ఇంటినీ కుటుంబాన్నీ విస్మరిస్తుంది. అచిరకాలంలోనే ఆనందానికి బదులు దురంత దుఃఖంలో మునిగిపోతున్నట్లు గ్రహిస్తుంది. నా స్థితి సరిగ్గా ఆ స్త్రీ స్థితిలాగా ఉన్నది. కులీనులైన స్త్రీలను నా వలె మోసపోవద్దనీ కష్టమైనా సుఖమైనా ఎటువంటి పరిస్థితులలోనూ ఆత్మేశ్వరుణ్ణి విస్మరించవద్దని హెచ్చరిస్తున్నాను. మన మార్గాన్ని అవమాన పరచే మోసగాళ్ళైన ఆవశ్యగాళ్ళెవరో నన్ను చెప్పనీయి. ఆదరణ ప్రేమ అభిలషించేవారూ, ఆత్మేశ్వరుని ఆనందం చూసి ఆనందించేవారూ ఇతరులు తమ తమ ఆత్మేశ్వరులను స్తుతించటం వినరాదు. నగల మోజున్న స్త్రీల సాంగత్యం త్యజించాలి. తమ తుచ్ఛ సుఖాలకై పరువులెత్తి తమ ప్రభుసేవని నిర్లక్ష్యం జేసే వారి నీడని సైతం దరికిరానీయరాదు. కఠినమైన పురుష స్వభావం వంటి స్త్రీ ముఖాన్ని చూడరాదు. తమ ప్రభువు దూషింపబడే చోటుని పొరపాటుగానైనా త్రొక్కరాదు. తమ భర్తల్ని లక్ష్యపెట్టని వారిని, స్వీయ సౌందర్య యౌవన గర్వితుల్ని దరిజేరరాదు. భర్తప్రేమకి బదులు వ్యర్థ ప్రాపంచిక వస్తువుల్ని తమ తృప్తికోసం తరచుగా అడిగేవారిని అనుసరించరాదు. తమ తమ భర్తల్ని గురించిన విషయాల్ని ఆడిపోసుకోవటానికి ఒక చోట జేరే వారి సాంగత్యం విసర్జించాలి. వీరిని త్యజిస్తూ ఈ మార్గంలో నిజమైన సహకారుల సహవాసం అభిలషించితే అనురాగం దిన దినం గాఢమై ప్రేమగా పరిణతి చెందుతుంది. ప్రేమ ద్వారా కృష్ణుడు సంప్రాప్తిస్తాడు. సహకారుల్ని గూడా

నేను ఎరుగుదును. నేనిప్పుడు వారిని పోగొట్టుకున్నాను. కాని వారి పేర్లు చెప్తాను. వారిని ఎరిగి ఉండటం నీకు లాభదాయకం. అందులో ముఖ్యులు ప్రేమ పూర్ణులు, ఉత్కంఠతో వారి సాంగత్యాన్ని ఆశ్రయించటం ప్రతివారి కర్తవ్యం. వారు జాలి పడితే రాతిలో కూడా ప్రేమ సృజించగలరు. రెండవది నీవంటివారు, ఆత్మేశ్వరుల ప్రియతములు, ప్రేమోన్మత్తులు, వారి కులాన్ని పట్టించుకోకుండా వారితో కలిసే అవకాశం జారవిడుచుకోకు, నిద్రాహారాలు మాని ప్రభు సంకీర్తన అతని మాహాత్మ్యపారాయణం ఎక్కడ జరుగుతుందో అక్కడ అంటి పెట్టుకుని ఉండు. ఈ ప్రేమ దృఢమయ్యే వరకూ ఇతరుల సాంగత్యం జాగ్రత్తగా పరిహరించు. అతని నామస్మరణమూ, జపమూ, శ్రవణమూ సర్వదా అవసరము . నీ కోసం గాని ప్రపంచకోసంగాని క్షణ భంగురాలైన ప్రాపంచిక విషయాలు ప్రేమాస్పదాలు కారాదు. భూమి మీద ప్రతి జీవి పట్లా సమానంగా దయగల్గి ఉండాలి. ఇతరమైన అన్ని విషయాల మీద అనురాగాల్ని ఉపసంహరించి దాన్ని నీప్రభువుపైన నిలిపి దృఢంగా అతణ్ణి ఆశ్రయించి ఉండు. సంపూర్ణ హృదయ సమర్పణం కాకపోతే ప్రేమరాదు. ప్రేమలేకపోతే ప్రేమహరి లభ్యమవడు. అన్ని సాధనల లోనూ ప్రాముఖ్యంలో ప్రథమమైనది నామము. మౌనంగా అతని నామ స్మరణ చేయటం, పెద్దగా నలుగురితో భజన చేయటం ప్రేమకి సోపానాలు. సర్వాన్నీ మరచి అతని నామాన్ని స్మరిస్తే నిస్సందేహంగా కృష్ణుడు దయ జూపుతాడు. నా నిజ జీవితంలో చేసిన ప్రయోగాల ననుసరించి నేనిది చెప్తున్నాను. ఒకప్పుడు నేనేస్థితిలో ఉండేవాడినో ఇప్పుడు ఊహాతీతము రూఢిగా మరణించిన నేను నామస్మరణ ప్రభావం వల్ల తిరిగి బ్రతికాను. నిర్లక్ష్యంగా, చికిత్స చేయకుండా తగ్గని అతి భయంకర వ్యాధి “థైసిస్ ” నిదానించింది. భయంకర విష సర్పం కరిచినా పెద్దపులి దోవలో పడ్డా బ్రతికి బయటపడ్డాను. శ్రీకృష్ణుడికి ఆప్తుణ్ణి కనుక అప్పుడు అతని సృష్టిలోని ప్రాణులన్నీ స్నేహితుడుగా నన్ను చూశాయి. ప్రేమించాయి. అందువల్లే నేనింకా బ్రతికి ఉన్నాను. చెట్లూ, శిలలూ ఒక రోజు నాతో మాట్లాడాయి. నేనింకా అదే వ్యక్తిని, కాని నా స్థితి మాత్రం విరుద్ధం. నా విషయం దృష్టిలో పెట్టుకుని మీరంతా హెచ్చరికగాను, తెలివిగాను ఉండమని నా ప్రార్థన. నీ గత జీవితం జ్ఞాపకం రావటంతో నేను విపరీతంగా వ్యాకులపడ్డాను. ఇంకా వ్రాయలేను. నా ఉదాహరణతో మీరంతా హెచ్చరింపబడాలని నన్ను మళ్ళీ చెప్పనియ్యి. కృష్ణుణ్ణి పొందాలంటే అతని నామ స్మరణ మరువ వద్దు. నీ ప్రాణానికీ ఆత్మకీ నామాన్ని పెన్నిధిగా చేయి. ఏకాంతంగా నివసించటానికి అభిలషించు. వాచా మనసా కర్మణా ఇతరులకి మేలు చేయటానికి ప్రయత్నించు. చెడ్డ ఆలోచనలు చెడ్డ పనుల కంటె నీచతరమైనవని గ్రహించు. నీ శత్రువుల శ్రేయస్సు నాకాంక్షించు. ఎంత

స్వల్పలాభాలకైనా సంతృప్తిపడు. డబ్బు చేసుకొనటానికి అవినీతి మార్గాలను అనుసరించకు. నీ ఆర్జనలో కొంతభాగం మంచి పనులకి వినియోగించు. ధనాఢ్యత మనిషికి విలువ నివ్వదు. సత్కార్యాచరణకి, వినియోగించటం విలువనిస్తుంది. ప్రాపంచిక సుఖసంతోషాలకి వెంపరలాడకు. నీ తల్లిదండ్రుల్ని భూమి మీద దేవతలుగా గౌరవించు, ఆదరించు. విశ్వంలోని స్త్రీలను ప్రధాన జాతిగా గుర్తించు. నీ భార్యను అప్రధానమైన తాత్కాలికమైన దానిగా భావించి ఎన్నడూ మోసపోకు. పాపుల పట్ల దయగా ఉండు.

నీ
హర

## 35వ పత్రము

ప్రియమైన అమ్మా ( బృందావన గోపాలుని భక్తురాలు )

ఈరోజు నీ ఉత్తరమూ, రాఘవ పంపిన ఝూలీ (రకరకాల ఆహారం ఉంచిన సంచుల సముదాయము) నిన్న అందుకున్నాను. నేనంత అనుగ్రహమునకు పాత్రుడినా? పార్శిలు చూడగానే కన్నీళ్ళు వచ్చాయి. ప్రతి వస్తువూ ప్రేమపూరితంగా కనిపించింది. ప్రతిదాని కమ్మదనము మనస్సుని కదలించివేసింది. ఇక్కడున్న ప్రతివారూ చూచి, పంపిన వాటిని ఆస్వాదించి పొందిన ఆనందం నేనేం చెప్పను? లిచీలు, మామిళ్ళూ , తదితరాలూ అన్నీ సరిగ్గా చేరినాయి. నేను చెప్తున్నానమ్మా నేను నీతోనే ఉన్నాను. ప్రతిరోజూ నాకు పెట్టున్నావు. ఇంకా పంపించట మెందుకు? నావంటి దురదృష్ట జీవిపై ఎందుకంత దయ, ప్రేమాభిమానాలు చూపిస్తావో నాకర్థమవటం లేదు. నిన్ను నిరంతరం బాధ పెట్టే ఈ అల్లరి పిల్లవాడిపై ఎందుకంత శ్రద్ధ? ఆరాటం? మనోహరాలు (ఒక రకమైన మిఠాయిలు) నిజంగా మనోహరంగా ఉన్నాయి. చంద్రపురీలను గురించి ఏం చెప్పను? వాటి అసామాన్య మాధుర్యానికి నీ అపారానురాగమే కారణం. అమ్మా మిఠాయిలతో పాటు గోపాలుని కాళ్లను కట్టివేసే త్రాడు కూడా అందింది. ఇది నన్ను భయపెట్తోంది . మళ్ళీ ఆశపెట్తోంది. అత్రాడుని భద్రంగా ఒక పెట్టెలో పెట్టి తాళం వేశాను. దాన్ని అప్పుడప్పుడు చూసి నా దుర్మార్గాన్ని విడిచి పెట్టేందుకు ప్రయత్నిస్తాను. అందుకే నీ గోపాలుడు బుద్ధిగా నీ ఒడిలో కూర్చుంటాడు. నయానా, భయానా అతన్ని పూర్తి అదుపులోకి తెచ్చావు. అమ్మా అటువంటి గారాబాలతో గోపాలుడిని ఆశపెట్టకు. మళ్ళీ అతను అల్లరివాడవుతాడు. గోపాలుడు పాలు, పెరుగులతో పూర్తిగా సంతోషిస్తాడు.

అమ్మా బృందావనం గురించి నిన్ను నీవెందుకు బాధ పెట్టుకుంటున్నావు? బృందావనం నీ వల్ల ఏర్పడింది. నీవెక్కడుంటే అదే బృందావనం. అమ్మా నీ ఒళ్ళో కూర్చోవాలనీ అందరితో పొట్లాడాలనీ నాకోరిక. నిఖిల కామజనకుడు నిశ్చయంగా మన కామితాలీడేర్చుతాడు. నాగురించి అంత ఆతురతపడకు. అమ్మమ్మతో గూడ అతురపడవద్దని చెప్పు. అమ్మా, అక్క నీ బిడ్డతో పరిహాసమాడింది. ఆమె మాటలతో ఉద్రేకపడవద్దు. నేను నీ ముద్దుల బిడ్డని. నేను నిస్సహాయుణ్ణి కనుక ప్రతివారూ నన్నభిమానిస్తారు. నేను నిస్సహాయుణ్ణయిన పేదని కనుక ప్రతివాడూ దయతో చూస్తాడు. దీని ద్వారా నాయందు ఏదో యోగ్యత ఉన్నదని భావించకు. ఉన్న యదార్థం నీ సుగుణాలనే ద్యోతకం చేస్తాయి. నా ఆశలూ, ఆకాంక్షలూ అన్నీ నీ పాదాల మీద, దయమీద కేంద్రీకరింపబడి ఉన్నాయి. నీ కృష్ణుడు కూడా నాపై దయ జూపుతాడని నేనిప్పుడాశించగలను. అమ్మా, నీ రాజగోపాలుడితో నా పట్ల దయజూపటంలో పిసినారి కావద్దని చెప్పు. ఆలకాపరి కనుక, చమత్కారికాడు. నా తరపున నీవు వాదించే బాధ్యత వహిస్తే బహుశా నా పట్ల అతడు దయగా ఉండవచ్చు. ఒకసారి ప్రాప్తించిన అతని దయ ఎప్పటికీ లుప్తమవదు. అది ఈ లౌకికమయినది కాదు కనుక అశాశ్వతం కాదు. "ఒకసారి బంధం నెలకొన్నదా, ఎప్పటికీ తెగదు. ఒకవేళ విచ్ఛిన్నమైతే ఆ సంబంధించినవారు ఘాతానంతరం బ్రతకలేరు". అని చెప్పబడింది. అమ్మా, అందుకే ఆ గోపాల బాలుడిని ఒకరు తమ స్వంతం చేసుకోగలిగారా, అతణ్ణి పోగొట్టుకోవటం అసంభవం. నీ వటువంటి ఆటలు ఆడతావు కనుక ఆతడు ఈ దాగుడు మూతలాట అప్పుడప్పు డాడతాడు. అతడు లీలా వినోది; ముఖ్యంగా దాగుడుమూతలాట. అతని ఆటలో నన్ను జతగాణ్ణి చేసుకోమని కూడా చెప్పు. అతడు నీ మాట వింటాడు. నీ అభ్యర్థన అంగీకరిస్తాడు. ఆమె ముద్దుల మనమడిపై ఒక దృష్టి ఉంచమని నా నమస్కారములతో అమ్మమ్మతో చెప్పు. అమ్మా, ఇంత దూరం నుంచే అనురాగ భాష్పాలు పొంగిపొరలుతున్న ఆమె కళ్ళని చూడగలను. అనురాగ పూర్ణమయిన ఆమె మాటల్ని వినగలను. ఆమె నన్నింకా పిచ్చివాణ్ణి చేసింది. నిరంతరం నేనామెతో ఉన్నానని అమ్మమ్మతో చెప్పు.

ఇప్పుడు నా శరీరం చూసి నేను మురిసిపాయేటంత ఆరోగ్యం పుంజుకున్నాను. బహుశా అమ్మమ్మ స్పర్శ ఈ మార్పు తెచ్చి ఉంటుంది. స్పర్శ ప్రభావం నీవు కాదనలేవు. కృష్ణుని నల్లరంగు రాధాకుండంలో మునగగానే బంగారు కాంతికి మారింది. అందువల్లనే అపరిచిత స్త్రీవలె బయటపడగలిగాడు. ఇందుకే కృష్ణుని చెలియలు తమను ముట్టుకోవద్దని వారించేవారు. అతని స్పర్శవారిని నల్లపడేటట్టు

చేస్తుందేమోనని. ఈ రోజు ఇటువంటి ఆలోచనలు నా మనస్సులో మెదలుతున్నాయి. చెల్లికి నా ప్రేమ అందించు. నల్లనయ్యని పొంది కూడా ఇంకా ఆమె ఎందుకు విచారిస్తోంది? అనేక మంది కేవలం నల్లనయ్యని పొందటానికి తపశ్చర్యలలో నిమగ్నులై ఉంటారు. ఆమె మనుమరాలు నల్లనిది. మధురానగరి వంకలవలె (మనోహరమైన మూడు వంకరలు గల కృష్ణుని వివిధ మూర్తులు) ఈ నల్లని వారిద్దరూ సరిగ్గా సరిపోతారు. నా గురించి అతురత పడవద్దు. అలా అని విస్మరించనూ వద్దు.

మీ
హర

## 36వ పత్రము

ప్రియాతి ప్రియా, (శ్రీ ఠాకూరు హరనాథుని భార్యకు)

నీ ఉత్తరం నిన్న అందటంతో పొందిన మహదానందం నీకెలా తెలుపగలను! వర్ణించగలిగినదయితే వ్రాయటంలో నీకొక "ఊహ" యిచ్చి వుండేవాడిని. ఈ ఆనందం హృదయపరమైనది. వర్ణనాతీతం. స్పందించే హృదయం మాత్రమే ఆనందిస్తుంది.ఇతరులు పొందలేరు. నా ఉత్తరాల కోసం ఎదురు చూసేమాట నిజమే. కాని, మన పరిస్థితుల భేదాన్ని కొంచెం గమనించు. నా మీద నుంచి దృష్టి మళ్ళించటానికి నీ చుట్టూ జనం ఉన్నారు. నీ మనస్సు బాధ పడ్డప్పుడు నీ పిల్లల పాలన పోషణలలో ఊరట పొందవచ్చు. నా విషయమూ, రావణకాష్టంలా మండుతోంది. ఒక పక్షి తన కూనలకు ఆహారం పెట్టటం చూస్తే తక్షణం మా అమ్మని గురించి ఆలోచిస్తాను. కళ్ళ నీళ్ళుపెట్టుకుంటాను. ఏ వస్తువు మీద నా దృష్టిపడ్డా దానిలో తన సంతానం మీదగల తల్లి ప్రేమని చూస్తాను. ఆ అనురాగమే లేకపోతే ఒక్కక్షణం కూడా ఈ ప్రపంచం ఉండేది కాదు. పైరులు నీళ్ళు లేకుండా ఎలా బ్రతకలేవో అలా తల్లి ప్రేమ లేకుండా ఈ ప్రపంచం ఉండదు. తప్పని సరిగా తల్లికి దూరంగా ఉండవలసిన స్థితి కంటె దయనీయమైన స్థితి ఇంకొకటి ఉంటుందా? తల్లి పాదాలని సేవించుకొనే అవకాశాన్ని పోగొట్టుకోవటం కంటె నికృష్టమైన దురదృష్టం బహుశా ఇంకొకటి ఉండదు. నా బదులు మా అమ్మని నీవు సేవించి నన్నానందపరుస్తావని ఆశిస్తాను. నేను నీ నుంచి మరొకటి కోరను, కోరబోను. మా అమ్మను సంతోషపెట్టగలవని, నీ సేవలవల్ల ఆమె సంతృప్తి పొందాలని నిన్ను ప్రార్థిస్తున్నాను.

దూరపు కొండల్లో సాయంత్రంపూట గుడ్డి దీపాలు వెలగటం చూసినప్పుడు బోలెడు జ్ఞాపకాలు నా మనసులో ముసురుకుంటాయి. పగటి కాయకష్టం పూర్తయిన తర్వాత అప్పుడప్పుడు తమ మెడల చుట్టూ చేతులు వేస్తూ చుట్టూ చిన్న పిల్లలు ఆడుకుంటూండగా ఈ చిన్ని దీపాల ప్రక్కన కూర్చున్న తల్లిదండ్రుల్ని గురించి ఆలోచిస్తుంటాను. ఈ దీపాల దృశ్యం నన్ను బాధ పెట్టుంది. ఇప్పుడు ఆలోచించు. ఇది నిజమే, కాని నాబాధలు ఎంతో ఎక్కువ జటిలమైనవీ, దుర్నివారమైన వీను. ఇప్పుడు చెప్పు, నేనా, నీవా ఎవరు మంచి స్థితిలో ఉన్నది? నీ వంత దుఃఖాన్ని భరించగలిగే దానివా? లేదు. మేము మగవాళ్ళము. సహజంగా కఠినులం. కనుక కొంతవరకు తట్టుకోగలం. నీ దగ్గరనుంచి సమాచారం అందనప్పుడు ఎంత బాధపడ్డానో ఒక్క ఉత్తరంలో చెప్పలేను. నీకు తీరికలేదని తెలిసి నీ ఉత్తరం కోసం ఓపిగ్గా ఎదురు చూస్తాను. లేకపోతే అది అసాధ్యమయ్యేదికాదు. ఏమైనా అప్పుడప్పుడు, నీవు వ్రాయగలిగినప్పుడు వ్రాయి. నేను కూడా నీకు వ్రాయటం మర్చిపోను. నన్నేది బ్రతికిస్తుంది? కృష్ణుడు జాగ్రత్తగా చూసి, అభ్యుదయం కలిగించుగాక! ఈతడవ, నాకోసం, కొంచెం జాగ్రత్తగా ఉండమని చెప్తున్నాను. ఎంతో గౌరవానికి అర్హురాలవైనా నీకేమి గౌరవం చూపలేక పోతున్నాను. ఇప్పుడు అలా చేయటం ఏదో కొంచెం నేర్చుకున్నాను. నేనేమైనా కాశ్మీరులో లబ్ధిపొందానా అని నీ వడిగావు. నేను నీకిదివరకే చెప్పాను, నేను క్రొత్త జీవితం, క్రొత్త ప్రేమ పొందానని, మళ్ళీ ఎందుకు అడుగుతావు ? నిజం, నేను పొందాను. కాని (నిన్ను) మర్చిపోలేదు. నీవు నా జ్ఞాపకం నుంచి తప్పించుకొనే విషయానివి కాదు.

నీ
హర

# 37వ పత్రము

ప్రాణాధిక ప్రియా,

నీ వద్ద నుంచి చాలాకాలం నుంచీ ఉత్తరాలు అందుకోకపోయినా రోజూ నీ గురించి వింటూనే ఉన్నాను. నూత్న ఖేలలు క్రొత్తవేషాల్లో భిన్న రూపాలలో నీవు ప్రదర్శించటం చూడటంలో నేను పొందే ఆనందం నాకూ ఆ కృష్ణుడికీ మాత్రమే తెలుసు. ఈ రకంగా తిలకించటం ప్రత్యక్షంగా కంటితో చూడటం కంటె ఎంతో ఉత్తమం. మొదటిది స్వార్థ రహితం. రెండవది అలా కాదు. దృశ్యాన్ని అల్లంత దూరంలో ఆనందించటంకోసం కృష్ణుడు మధురకు వెళ్లాడు. దాని మాధుర్యాన్ని

అనుభవించటానికి కృష్ణుడు గౌరాంగుడుగా అవతరించాడు. రాగ వస్తువు సమీపాన ఉంటే వ్యామోహయుతమైన రాగము కామ మని పించుకుంటుంది. కాని, విషమైనా, ఆ రాగవస్తువు అల్లంత దూరాన ఉంటే - అమృతంలా మారుతుంది. ప్రేమగా రూపొందుతుంది. అందుకనే కృష్ణుడు మధురకు వెళ్ళినప్పుడుశ్రీమతి కన్నీళ్ళు పెట్టుకుంది. గౌరాంగుడి కళ్ళు ఎప్పుడూ పొడిగా లేవు ప్రియా, చెప్పు, ఇదిలా కాకపోతే నా హృదయానికి అతి ప్రియమైన నీ నుంచి ఎడబాటు సాధ్యమయ్యేదా? ఎవరిని ఒక్కక్షణమైనా ఎడబాయటం నేను భరించలేనో నాకు ప్రియమైన ఆ నా ప్రేమ లక్ష్యాన్ని నా హృదయంలో ఒక మూల ఏకాంతంలో ప్రతిష్ఠించి సాధ్యమైనంత పూర్ణశ్రద్ధతో ఆరాధిస్తే ప్రాప్తించే ఆనందం, ప్రేమ వస్తువుకి అల్లంత దూరంలో ఉన్నప్పుడు మాత్రమే అవగతమవుతుంది. దీన్ని ఎరుగని వాళ్ళు ప్రేమ అంటే ఏమిటో ఎరుగరు. వాళ్ళు దేనిని ప్రేమ అని అంటారో అది ప్రేమ కాదు. వాళ్ళు ప్రేమని అర్థం చేసుకోరు. ఎన్నటికీ అర్థం చేసుకోలేరు. కృష్ణ కృపతో ఈ ప్రేమ వాసన పొందినవారు బాహ్య దృష్టికి కనిపించే కుహనా ప్రేమ అని పిలవబడే ప్రేమపట్ల విరక్తులై వైదొలగుతారు. యదార్థమైన ప్రేమ ఏమిటో వారు తెలుసుకుంటారు. సంతృప్తి చెందుతారు. ఇప్పుడు నీవు ఎడబాటు ఎంత లాభకరమో గ్రహించావు. అది కృష్ణుణ్ణి సామీప్యానికి తెస్తుంది. ఎందుకంటే అది కామాన్ని ప్రేమగా మారుస్తుంది. మరి ఆ గోపబాలుడు ప్రేమకే లోలుడు. చెఱుకురసం కలకండగా మార్చాలంటే అగ్ని అవసరం. అలాగే కామాన్ని ప్రేమగా మార్చాలంటే విరహాగ్ని అవసరం. మరేదీ అలా చేయలేదు. కృష్ణుడు ప్రేమికుల విరహానలాన్ని ఒక ఆప్తమిత్రుడిలా గౌరవించమని మనకి బోధిస్తాడు. కాని, ఇక్కడ ఒకమాట. కేవలం నిప్పు చెఱుకురసాన్ని కలకండగా చేయలేదు. మొట్టమొదట పాలూ, నీళ్ళూ ఆ మధురరసాన్ని శుద్ధి చేయటానికి కావాలి. తర్వాత సెగపైన కలియతిప్పటం. కామాన్ని ప్రేమగా మార్చటానికి ఈ విరహాగ్ని కాక మరొకటి అవసరం, కాని ఈ వేరొకటి పొందటం చాలా కష్టం. మనం ఎప్పటికైనా దాన్ని పొందుతామో లేదో చెప్పలేను. అది ఇలా చెప్పబడింది. "ప్రతి ఒక్కరూ ఎదుటివారి హృదయంలో దాగి ఉండాలి. ఇద్దరూ ఒకటిగా మారాలి. పురుషుడు స్త్రీలా, స్త్రీ పురుషుడిలా" బహుశా ఇప్పుడు నీవు బాధాకరమైన విరహం ఈ స్థితి తెస్తుందని గ్రహిస్తావు. నీ ప్రేమ లక్ష్యం నీ ప్రక్కనే ఉంటే ఆ లక్ష్యాన్ని నీ హృదయంలోకి స్వీకరించలేవు. ప్రేమైక మూర్తి కృష్ణుడే అలా చేయలేకపోయాడు. వ్రజ గోపికల్ని తన వేణుగానంతో అరణ్యానికి ఆకర్షించి అప్పటివరకు వాళ్ళ ఎడబాటుతో ఎంతో బాధ అనుభవిస్తున్న కృష్ణుడు

వాళ్ళకి కళ్ళలో నీళ్ళు వచ్చేటట్లు, దారుణంగా నొచ్చుకునేటట్లు పరుషంగా దుర్భాషలాడాడు. భక్తాగ్రణ్యులు అందుకే అన్నారు. "రాగ వస్తువుని నేస్తంగా చేస్తే ప్రేమ బలహీనమౌతుంది." అని, ఇప్పుడు చూడు ప్రేమిక శిఖామణులేం చేశారో. బృందావనం నుంచి మధుర ఏమీ ఎక్కువ దూరం కాదు. అయినప్పటికీ కృష్ణుడు తన ప్రేమ మూర్తుల్ని దగ్గర ఉంచుకోలేదు. గౌరాంగుడు దగ్గర ఉండనీయలేదు. నితాయి ఉండనీయలేదు. నీకు తెలుసా ఎందుకో? ఏకాంతముగా - తమ ఉనికినే విస్మరించి సాటిలేని ఆప్రేయసి సౌందర్యాన్ని ఏకాంతంలో తల్చుకుంటూ రోదించటానికి, కృష్ణుని అభిమానులికి ద్వారకలోగాని, మధురలోగాని లోటులేదు. మరి ఎందుకు దుఃఖించాడు. ఇది యోచించు. ఒక మర్త్యుడు శివధ్యాసతో శివత్వం పొందుతాడు. ధ్యాస పురుషుణ్ణి స్త్రీగాను, స్త్రీని పురుషుణ్ణిగానూ మార్చుతుంది. ధ్యాస కృష్ణుణ్ణి గౌరాంగుడిగా మారేటట్లు చేసింది.ఆ ధ్యాస ద్వారానే శివుడు గోపీశ్వరుడయ్యాడు. శ్రీ రాధిక ముఖ్య చెలికత్తెలైన ఆరుగురు మంజరీలు వైష్ణవ గురువులైన ఆరుగురు గోస్వాములయ్యారు. బహుశా ధ్యాసవల్ల ఒకరోజు నీవు నేనవుతావు నేను నీవవుతాను. అర్థం లేని వాగుడుగా తీసుకొనవని నమ్మకుండా తోసివేయవని విశ్వసిస్తున్నాను. ఎంతకాలం నుంచో నా హృదయంలో దాచుకున్న నా అంతరాంతరాలలోని ఆలోచనని నీకు చెప్పాను. జాగ్రత్తగా నీ హృదయంలో దాచుకొని ఉంచుకో. జాగ్రత్త, మమ్మల్ని హాస్యాస్పదుల్ని చేయకు. నాకు మరణకారకమైన ఆయుధం ఇది. దీన్ని శత్రువుల చేతుల్లో పెట్టకు. ఈఉత్తరాన్ని జాగ్రత్తగా పెట్టు. నా ఆలోచన గుప్తంగా ఉంచుదామని ప్రయత్నించాను. కాని ఉంచలేకపోయాను. ఇది వ్రాసిన తర్వాత భయపడుతున్నాను. అలా నాచేత ఎందుకు వ్రాయించాడో (ఆకృష్ణుడికే) వాడికే తెలుసు. ఈ మాటలన్నీ బాగా మననం చేసుకుంటావనీ, వాటి పూర్తి అర్థం గ్రహిస్తావనీ, నీ అంతరాంతరాల్లో అలంకరించు కుంటావనీ ఆశిస్తాను.

ఈ రోజు శ్యాముని (ఠాకూరు కుటుంబానికి కులదైవం) రథోత్సవం కనుక అందరూ నగదు కానుకల్ని అందుకుంటున్నారు. బీదవాణ్ణి కనుక, నేను హృదయ సన్నిధానాన్ని నీ కివ్వటానికి కనిపించాను. ప్రేమతో స్వీకరిస్తావనీ భద్రంగా ఉంచుకుంటావనీ ఆశిస్తాను. ఈ ఉత్సవ సందర్భంగా ప్రతిగా నాకేమైనా ప్రసాదించు. ఆ కానుక కామితానికి అతీతంగా నన్ను ఉంచుతుందని ఆశిస్తాను.

నా తరఫున నా తల్లిని సేవించు. నేను దగ్గరలేకపోయినందుకు ఆవిడ బాధపడకుండా చూడు. నాపెళ్ళిరోజున పెళ్ళి ఊరేగింపు ముందు పల్లకీ ఎక్కబోతున్నప్పుడు వారందరికీ ఒక సేవకురాల్ని తెస్తానని నా తల్లి తదితర పెద్దలముందు చేసిన వాగ్దానాన్ని వమ్ము చేయకు. పెండ్లి ప్రమాణాల్ని నిలబెట్టుకొనేటట్లు భర్తకి సాయం చేసే భార్యే నిజంగా అతని సహాయకారిణి. నీవు చాలా పనిలో ఉంటావు. కనుక ఇంకా నీ సహనాన్ని విసిగించను.

నీ
హర

# 38వ పత్రము

ప్రియతమా,

నీవు నిప్పుమీద నీళ్ళు పోశావు. నా హృదయంలో అమృతం కురిపించి నీ ఉత్తరం అనంతమైన ఊరట కలిగించింది. నీవలా చేయకపోతే అంతమంది నా గురించి అనుకునేవారా ? ప్రియతమా, నాకిప్పుడర్థమయ్యింది, శాస్త్రాల్లో భార్య సహధర్మిణి అని ఎందుకన్నారో! కర్తవ్య పరాయణి అయిన భార్యని పొందిన భర్త నిజంగా సుఖి, ధన్యుడు. స్వర్గాన్నిగాని, ముక్తిని గాని ఆశించడు. అతణ్ణి పొగిడేందుకు ప్రపంచంలో భాషలేదు. అతనికి ఈ నరక సమానమైన ప్రపంచాన్ని గౌరవించనవసరం లేదు. ప్రపంచం చెడ్డదైనా అతనికి రాధాకృష్ణుల ఖేలావని బృందావనం , ప్రశాంతత, పవిత్రతా నిత్యమూ సర్వదేవతలూ సందర్శించే అతని నివాస గృహాల్లో ఉంటాయి. నీవటువంటి భార్యవి, నేనటువంటి భర్తని అవ్వాలని ప్రార్థిస్తాను. ధర్మచారిణి అయిన భార్యను పొందే అదృష్టం లేనివాడికి వైకుంఠం ఒక నరకం. అతని జీవితమే చావు, చావే జీవితం .... ఎన్నటికీ అటువంటి స్థితి మనకి కలగకూడదని ప్రార్థన. ఈ ప్రపంచ నాటకశాలలో మనకిచ్చిన సమయంలో మన మిత్ర బృందమందరితో కలిసి సంతోషంగా ఆడుదాం. తదుపరి మరొక చోటుకి సాగిపోదాం. కృపామయుడైన ప్రభువు మన ప్రార్థన మన్నిస్తాడు. మనం యింటివద్ద మొదలు పెట్టిన ఆట విడిచి యిక్కడికి వచ్చినందుకు బాధపడకు. ఇది సృష్టిన్యాయం. కొంచెం చూడు, ఎంతోమంది ఆడటానికి గుమిగూడతారు. వర్గాలుగా విడిపోయిన తర్వాత, ఆట రసవంతంగా ఉన్నప్పుడు ఒక్కొక్కరూ క్రొత్త రంగాల్లో క్రొత్త ఆటల్లో జేరటానికి ఈ లోకం నుంచి జారిపోతారు. ఇక్కడ మిగిలిపోయిన వారు బాధపడి వాళ్ళకోసం ఏడుస్తారు. సుఖం కోసం నిన్ను నేను విడిచిపెట్టలేదు. నీవు నాకోసమెందుకు

శోకించాలి? ఈ భూమి మీద నేనెక్కడున్నా, నీ జతకాడినే, ఒకరోజు కాకపోతే మరొకరోజు మనం కలిసి మళ్ళీ ఆడతాం, సందేహంలేదు. భవిష్యత్తులో సర్వదా నీవు నా జత ఆటకత్తెవి కావాలిగాక.

నీ
హర

# 39వ పత్రము

ప్రియతమా,

నీలేఖ నాకెంతో ఆందోళన కలిగించింది. కొంచెం, ఒక్కక్షణం నా మాటవిను, హృదయానికి అతి ప్రియమైన వస్తువు నుంచి దూరంగా ఉండటం, అల్లంత దూరం నుంచి దానిని ధ్యానించటం అభిలషణీయం, తద్వారా సమీపంలోనే ఉంటూ ఆశించేదాని కంటె ఎంతో మహదానందం పొందవచ్చు. అవునా! నీ సమాధానం 'అవును' అవ్వాలి. నాకు చెప్పు. ఒక వస్తువు దూరాన ఉండకపోతే అందంగా కనిపిస్తుందా? ఇప్పుడు నీ వర్థం చేసుకుంటావు ఎందుకు నేను నీ నుంచి అంతదూరంలో ఉన్నానో. భార్యా, బిడ్డలు, భర్త, తల్లీ, తండ్రీ మొదలైన వారంతా చాలా కొద్ది కాలం కలసి ఉండేవారు. కాని, నిరంతరం ఎవరితో మన సంబంధం నిలిచి ఉంటుందో ఆ కృష్ణుడు మన నుంచి అనంతమైన దూరంలో ఉన్నాడు. నీ కోసం తపించే ఆవేదనలో వందవ వంతైనా అతనికై తపించకపోవటం ఆశ్చర్యకరం. మనం ఏమాత్రం అసౌకర్యంగా ఉండటం చూసినా అతడు, విపరీతమైన బాధపడవచ్చు. మనది ఎంత ఘోరమైన తప్పు! మన ఆలోచనలు అతనిపై మరల్చే బదులు నిరంతరం మనం బొమ్మలతో బొంగరాలతో తలమునకలయి అప్పుడప్పుడు మనస్సులో దాని అనిశ్చిత అధిగమిస్తామో, మన గురించి మనం చూసేది గారడీవాని మాయ మాత్రమేనని ఎప్పుడు గ్రహిస్తామో, ఎప్పుడు కృష్ణుడు మాత్రమే శాశ్వతము, తక్కినవన్నీ అశాశ్వతమనీ, ఆ కృష్ణుడే మనవాడు మిగిలిన వారంతా ఆగంతుకులనీ మన హృదయాలలో భావిస్తామో, ఆతరుతతో నే నారోజు కోసం ఎదురుచూస్తున్నాను. నేను కోరేది ఎందుకు నేను పొందను? ఈ ప్రపంచంలో మీ స్త్రీలు శక్తి మూర్తులు. పూర్ణ హృదయంతో ఆశీర్వదించు, నేను వ్రాసింది నా స్వంత ఊహ వల్లకాదు. నేను వ్రాసినట్లుగా అనుభూతి పొందేవారు శివుని వంటివారు. వారు వైష్ణవోత్తములు. అత్యంత పూజనీయులు, తిండికై తిప్పలుపడే అశుద్ధంలో పురుగుని నేను. కాని విచారించటం లేదు. ఎందుకంటే కృష్ణుడు ఎవరికేది తగినదో అదే ఇస్తాడని నాకు తెలుసు.

అక్కడ పుట్టిన పురుగులికి అశుద్ధమే సరియైన ఆవాసం. తేనెలోకి జేరిస్తే తప్పకుండా చస్తాయి. అటువంటి పురుగుల్లో నేనొకణ్ణి. ఎందుకు అమృతం నాకాకర్షణీయ మవుతుంది! కృష్ణుడు నాకేది ఆమోద యోగ్యమో అదే యిచ్చాడు.

నా హృదయంలో తచ్చాడే వ్యక్తిని గురించి మాట్లాడావు. అటువంటి వ్యక్తిని పొందటం కష్టం. అదృష్టం వల్ల అటువంటి స్నేహితుణ్ణి పొందినవాడు సరాసరి బృందావనం వెళ్తాడు. నా హృదయానుగుణమైన ఆ వ్యక్తిని ఎక్కడ చూస్తానో! లేక అసలు చూసే అదృష్టమున్నదో లేదో ఎరగను. ఓ! అతడు తటస్థపడేటట్లు నా కోసం ప్రార్థించు.

నీ
హర

# 40వ పత్రము

ప్రియా,

నాగురించి నీవు బాధ పడనవసరం లేదు. నీకు చెప్పిన ఆ అతిశీతల వాతావరణానికి గురికాగా ఈ మధ్య చేసిన సుస్తీనుంచి నేను కోలుకున్నాను. అమ్మకు నా గౌరవ పూర్వక ప్రణామాల్ని అందించు. తల్లి ఆశీర్వాదం పొందిన వాడికి కష్టమంటే ఏమిటో తెలియదు. ఇందుకే అమ్మని ఆనందంగా ఉంచటానికి ప్రయత్నించమని పదే పదే నీకు చెప్పాను. మహా మహా భాగ్యవంతుడు కూడా తల్లిని ఏడిపిస్తే తక్షణం తన యింటి నుంచి భాగ్యం తొలగిపోతున్నట్లు గ్రహిస్తాడు. ఆధ్యాత్మిక సాధకుడైతే తనకి తగిన ఆవాసం నరకమేనని గ్రహిస్తాడు. అందుకని అమ్మని నిరంతరం ఆనందంగా ఉంచు. ఇంకోమాట, తన ఉపాస్యదైవమే అసలు దైవమని, ఇతరులు ఆరాధించే దైవాలని కించపరచేవాడు అపరాధం చేస్తున్నాడు. తర్వాత,ప్రపంచంలోని స్త్రీలంతా నిశ్చయంగా ఎవరికో ఒకరికి తల్లులే కనుక, ఎంతో పూజనీయులు. అందుకని వాళ్ళని తగినట్లు గౌరవించటం నీవు నేర్చుకోవాలి. నీవు ధన్యురాలివి. అన్ని పెన్నిధులకన్న ప్రియతమానివి. నీవు అనుగ్రహిస్తేనే ఎవడైనా శాశ్వత బృందావనాన్ని సుఖంగా సంతోషంగా జేరగలడు. నిన్ను అర్థం చేసుకోవటం అతి క్లిష్టతరమైన విషయం. నీ నిరాదరణకు గురియైన వాడు అతి నిస్సహాయుడవుతాడు. అందుకే శాస్త్రాలు చెప్తాయి. స్త్రీలే స్వర్గానికి ద్వారాలు అని. నిరాదరణతో నన్ను చూడకుండా ఉండేటట్లు ప్రయత్నించు.

స్త్రీల హృదయాలు కఠినంగా ఉండటం సాధ్యమా? మూర్తీభవించిన ప్రాణమైన క్షీరం ఎక్కడ నుండి స్రవిస్తుందో ఆ హృదయం కఠినం కాగలదా? లేదు, ఎన్నటికీ కాలేదు . అవునన్నవాడు నిజం చెప్పటం లేదు. ఈ స్నిగ్ధ హృదయాలు కఠినాలైతే ప్రపంచంలో జనాభా ఉండేది కాదు. ఎవడూ బ్రతికి ఉండేవాడూ కాదు. మీరు అనురాగ రూపాలు . ఇంతవరకూ ఎవ్వరూ మీ పై పరిపూర్ణ ప్రశంసా బహూమానాల్ని సమర్పించలేకపోయారు. నేనెంత అది చేయటానికి? అనామకమైన అల్పుణ్ణి! కనుక, ఆత్మనిందమానుకొమ్మని, దానివల్ల పాపమనీ, అతిదూష్యమైనదనీ, అపర్ణ, పేనీలతో చెప్పు. వాళ్ళు పవిత్రులని వాళ్ళకి తెలియదా? తెలియక చేసిన కర్మలు కర్మలు కావు. కనుక అవి ఆందోళన కల్గించ కూడదు. పసిపిల్లలు తమ తల్లుల గుండెల్ని తంతారు. దాంతో వాళ్ళు తప్పు చేస్తున్నారా?

శ్యామ సందరుడు (కులదైవం) నీకు అమితానందాన్ని యిస్తున్నాడని భావిస్తాను. సందేహం లేదు. నీవు హారాలతోనూ, పుష్పాలతోనూ అతణ్ణి ఆరాధిస్తున్నావు. ఆదర్శనభాగ్యం పొందలేకపోతున్నాను. ఎంత దురదృష్టం!

నీ
హర

## 41వ పత్రము

ప్రియతమా !

సకాలంలో నీ ఉత్తరం ఇక్కడికి చేరింది. కానీ నీ వలె నీ ఉత్తరం కూడా దాగుడు మూతలాడింది. అయిదు రోజులు ఆలస్యంగా, ఈ రోజే నా చేతికి చేరింది అందువల్ల నేను ప్రత్యుత్తరము ఇవ్వటంలో ఆలస్యమైంది. దీనికి నేను ఏరకంగాను నింద్యుణ్ణి కాను. కానీ, ప్రియతమా ! ఒక విషయం నన్ను బాగా ఆశ్చర్యపరుస్తున్నది. నీవు నా అందాన్ని కాపాడుకొనమని వ్రాశావు. ఇది ఎటువంటి అభ్యర్థనో అర్థం చేసికొనలేకపోతున్నాను. అందాన్ని ఇచ్చేశక్తిని, నిలిపే శక్తిని కలిగి వున్నదానవు నీవు. సౌమ్యత, సౌందర్యము - నీవు ఏమి ఇచ్చావో అవే నాకు వున్నాయి. వాటిని నీవు తీసివేసుకుంటే నేను ఏమీ చేయలేను. నీవు దయతో ప్రసాదించిన నా అందం, నిర్దయతో నీవు తీసివేయకుండా ఉంటే అలాగే వుంటుంది. దాన్ని భద్రపరచటం నాలో లేదు. ఇది నిజమని ఒప్పుకుంటావు కదా ? ప్రియతమా! ' రాయి ' చేత ప్రసాదింపబడిన సౌందర్యంతో మాత్రమే నీలమేఘ శ్యాముడు ఎలా సువర్ణచ్ఛాయ గల గౌరాంగుడుగా మారినాడో, రాధా కుండంలో స్నానానంతరము కృష్ణుడు ఎలా

రాధవంటి మనోహర వర్ణాన్ని పొందాడో, రాముడు సీత సౌందర్యంతో దర్భాంకురాల వంటి వర్ణాన్ని ఎలా పొందాడో స్పష్టంగా విని ఉంటావు. ఇపుడు బహుశా సౌందర్య కారకమైన శక్తి నీలో ఉన్నట్లు తెలిసికొని ఉంటావు.

ఈ ప్రపంచంలో కనిపించే రూపాల వైవిధ్యానికి కారణం చెప్పగలవా ? మీరే దానికి మూల కారణాలు.మీరు అవ్యక్తులైతే ఈ ప్రపంచం కూడా ఉండలేదు. కనుక అందం నీమీద ఆధారపడి ఉంది. మీరు ఏ వేషాలనిస్తే, వస్తువులు, ఆ వేషాన్నే ధరిస్తాయి. వాటంతట అవి ఏ వేషం ధరించలేవు. నా కట్టి వేషం వేసింది మీరు. కనుక ఈ వేషం నీవు తీయనంతరవరకు అలాగే వుంటాను. ఈ విషయంలో నన్ను అర్థించటం ఒక నాటకం, వట్టి లాంఛనం. ఈ యంత్రాంగం మీది, మీకు ఇష్టమైతే ఒకరికి బంగారు పసిమీ పూయగలరు. లేదా మరొకణ్ణి దారుణ నరకానికి త్రోసి, కటిక నలుపు రంగు పూసి, ఈ జన్మలోనూ, వచ్చే జన్మలోనూ కూడా ఇలాంటి దురదృష్టవంతుణ్ణిగానూ చేయగలరు. ఏమైనా ఇదివరకు నేను మరొక విషయాన్ని గురించి వ్రాశాను. అది నిన్ను ఆనందపరచినట్లుంది. కానీ అది నేను మరచిపోయాను. జ్ఞాపకముంటే అలాగే వ్రాసి, అటువంటి భర్త పాత్రనటించి ఉండేవాణ్ణి. కానీ ప్రియతమా! మతి మరుపు మనిషిని, ఏమి చేస్తానో అప్పటి కప్పుడే మరచిపోతాను. అందుకు నేను నిందార్హుణ్ణికాదు.

నేను నీ యదార్థ స్వరూపాన్ని గుర్తించానని కూడా అన్నావు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఇది చేయలేక పోయినప్పుడు సర్వకారణ కారణుడు శ్రీ కృష్ణుడే ఇది చేయగలడో, లేదో అనేది సందేహాస్పందంగా ఉంటే, ఈ అసాధ్యాన్ని సాధించటం ఒక అల్పుడైన మర్త్యుడికి ఏమైనా సాధ్యమా? నీ హృదయాన్ని ఎప్పుడైనా ఎవరినైనా నీవు గ్రహించ నిస్తావా? నీ నైజ రూపాన్ని కప్పిపుచ్చి, మాయా రూపంతో లోకాన్ని మోహింప చేస్తున్నావు. జీవులు విరజానదిని దాటనంతవరకు నిన్ను తెలుసుకొనటం వారికి పూర్తిగా అసాధ్యం. (మాయా తీతమైన వైకుంఠానికి చుట్టూ ప్రవహించే నది విరజానది) దివ్య జ్ఞానసారాన్ని తెలియపరచటానికి నీకు దయగలగనంతవరకు దాన్ని అవగాహన చేసికొనటం ఎవరికైనా అసాధ్యమే. మీరు బంధించగలరు. విముక్తిని ప్రసాదించగలరు. సుఖ దు:ఖాలకి కారకులు మీరు, పాప పుణ్యాలకి ముఖ్యకారకులు మీరు, ఎలా కనిపించాలనుకుంటారో అలాగే కనిపిస్తారు. ప్రపంచాన్ని మీ యిచ్ఛాను సారం నాట్యం చేయించగలరు. ఏమిటి నిజంగా నీవు ముక్కోపితనం నేర్చుకున్నావా? తప్పులు వెదకేగుణం అలవడిందా? అని నాకు ఆశ్చర్యం కలుగుతోంది. మేము ఎప్పుడూ దోషులమని ఒప్పుకొంటూనే ఉన్నా,

అప్పుడు మేము నేరస్తులమని రుజువు చేయటానికి నీవు కష్టపడటం వలన ప్రయోజనమేముంది? మీరు మమ్మల్ని నిగ్రహిస్తే ఈ ప్రపంచంలో ప్రాణికోటి వుండగలదా? లేదు లేదు. అతనిని తూల నాడుతూ ఏమి వ్రాశానో తెలియదు. "అతి సర్వత్ర వర్జయేత్" అని శాస్త్రాలు చెప్తున్నాయి. గర్వాపహారి దేనినైనా దాని హద్దులు దాటి పోనీయడు. ప్రతి దానికి హద్దు ఉంది. నేనేదైనా తప్పుచేస్తే నా తరఫున అర్థించి క్షమించబడేటట్లు చూడు. నా కోసం బాధపడకు, నాకేది అవసరమో అది ఆ గోపాలుడు నిస్సంశయంగా చేస్తాడు. అతడు ఇచ్ఛామూర్తి. అతని యిచ్ఛ నెరవేరుతుంది. ఎవరికీ అతనిపై అధికారం లేదు. నిరంతరం నీ ధ్యాస అతనిపై వుంచు. ఇతర విషయాల మీద ఆలోచనలు మానాలి. ఇది అసాధ్యమంటే - అది మాకు కానీ, నీకు వర్తించదు. ఎవరి నుండి ఎడబాటు నీ కొక క్షణమైనా యిష్టముండదో అటువంటి తల్లిదండ్రులని అల్పాయుర్దాయం గల భర్త లభించినంత మాత్రాననే లెక్కచెయ్యవు గదా. అటువంటప్పుడు శాశ్వతుడు, నిత్యానందుడు అయిన ప్రభువు పై నీ ధ్యాస నిలిపినపుడు అన్ని ఇతర ఆలోచనలని ఆవలకి నెట్టగల సామర్థ్యం గల దానివి అనటానికి ఏమైనా సందేహం ఉందా? నీకంతా సులభమే.

నీ
హర

# 42వ పత్రము

ప్రియతమా,

ఈ రోజు అమేయానందాన్ని అనుభవించాను. కొన్ని రోజులుగా మనస్సులో ఎంతో వ్యాకుల పడుతున్నాను. శ్యాముని సాన్నిహిత్యంలో నా గురించి ఆలోచించటమే మానివేశావేమోనని భయపడ్డాను. కాని నేను అపోహపడ్డానని ఈ రోజు గ్రహించాను. మర్చిపోవటానికి బదులు, నా పట్ల ఎంతో శ్రద్ధ వహిస్తున్నావని అనిపిస్తోంది. నాతో కలిసి శ్యాముణ్ణి చూడలేక పోతున్నావని నిట్టూరుస్తూండవచ్చు. నా సాధన ఫలితాలు నాకు వ్యతిరేకంగా ఉన్నాయి నీ అదృష్టాన్ని పంచుకొనటం ఎలా ఆశించగలను ? కళ్లూ కాళ్ళూ నీకున్నాయి. వెళ్ళి చూడటానికి, నాకురెండూ లేవు. అందుకని, ప్రియతమా కుంటి, గ్రుడ్డి వాడి ఎదుట కనికరంతో కనిపించమనీ, నిరాశ పరచవద్దనీ నీ శ్యాముడితో చెప్పు. నా కర్మల ఫలితాలు అతణ్ణి నా దగ్గరకు తేలేవు కాని, నా తరఫున చేసే నీ అభ్యర్థనని అతడు నిరాకరించలేడు. అందుకని నిన్నాశ్రయించాను.

ఈ రోజు నీ ఆనందం అద్భుతం! అతడికి నీవు కోరిన వేషం వేస్తున్నావు. రహస్యంగా మాట్లాడుతున్నావు. నీ విలాసానుసారం నవ్విస్తున్నావు. లేదా నీ ఖేలతో అతణ్ణి ఏడిపిస్తున్నావు. నీ ఆనందాన్ని దర్శించలేకపోతున్నానే అని బాధపడు తున్నాను. ఏమైనా నీవు నాదానివని తెలుసుకనుక అన్ని ఆశలూ వదులు కోనక్కరలేదు. ఏదో ఒకరోజు అతణ్ణి చూడగలనని తప్పక ఆశిస్తాను. అదృశ్యంగా ఎంతకాలమతడు ఉండగలడు. నన్ను ఏడిపించగలడు? నీవు నా పట్ల దయగలిగి ఉన్నావు. కనుక శాంతంగా అతడు కూర్చోలేడు. భయంతోనైనా, తప్పక నాకు నిస్సంశయంగా కనిపిస్తాడు. ఇప్పుడు నాకు నీ ప్రేమ కావాలి. నేను పొందుతానా? నాకా అర్హత ఉందా? బహుశా, అందరి లాగానేను అనర్హుడనని అనుకోను. కాని అది సరిపోదు. నీవు ఆదరంతో నావంక చూడకపోతే నా భవిష్యత్తు ఎప్పటికీ అంధకారమయ మవుతుంది. ఇప్పుడు చెప్పు, నీ దయ నేనెలా పొందుతాను? మార్గాలు నీకే తెలుసు. ఇంకా నీవెవరికి చెప్తావో వారికీ తెలుస్తాయి. ఎప్పటికైనా నీవు నా పట్ల దయాళువు వవుతావా? లేక ఎలా వచ్చావో అలానే వెళ్ళిపోతావా? ధూళి ధూసరితమైన నేనెప్పటికైనా నన్నావరించిన మలినాన్ని శుభ్రం చేసుకోగలనా? ఇప్పటిలాగానే ఉంటానా? విముక్తి కోసం వ్రాశాను. అంతిమ నిష్క్రమణానికి మార్గం సూచించి నన్ను భయపెడ్దామనుకున్నావా? నేను నిజంగా నిస్సహాయుణ్ణి. నన్ను మోసగించటానికి ప్రయత్నించకు. నిష్కపటంగా ఉండు. నీ ఆధీనంలో ఉన్న నా మార్గాన్ని సుగమం చేయమని కోర్తాను. మీరు రాసమండలి ద్వార పాలకులు. నేనక్కడికి రావాలని, ఎప్పటికీ మీతోఉండాలని కోరుకొంటున్నాను. నిఖిల బ్రహ్మాండ ప్రజావళిని బద్ధుల్ని చేసి, రాసమండలిని విస్మరింపజేసిన నీ ఇంద్రజాలాన్నించి వైదొలగాలని ఆశిస్తాను. శాశ్వతానందాన్నుంచి వారిని దూరంగా తొలగించి , ప్రాపంచిక దుఃఖభారాల్ని వాళ్ళ తలలపై మోపి, వినోదిస్తున్నావు. నీ ఇంద్రజాల నైపుణ్యం అద్భుతం . నీ వంత ప్రజ్ఞావంతురాలివి కాకపోతే మహేంద్రజాలికుణ్ణి గెలవగలిగేదానివా? నా కళ్ళ ముందుంచిన విముక్తి వంటి దానితో నన్ను సమ్మోహ పరచకు. నీవు నన్ను పట్టుకొంటే ఉద్ధరించు. నిరంతర పతన భయం నన్ను అతి పిరికివాణ్ణి చేసింది. కనుక దయచేసి యింకా భయపెట్టకు. నన్ను ఒంటరివాణ్ణి చేయకు. నా ప్రగతిని అవరోధించకు. నీ వల నాపై విసరకు. నేను ఒకసారి తలపైకెత్తి నప్పుడు శాశ్వతంగా నేను సంతృప్తి చెందేటట్లు నీ యదార్థ రూపాల్ని నీ దయని చూపు.

"స్థిమితంగా అంతదూరంలో నీవు ప్రశాంతి పొందగలిగే దానివికాదు" అన్నాను. అలా చెప్పకపోతే నా మీద నీవు మోపిన భారానికి అణగారి చచ్చేవాడిని. అది విచిత్రం. గానుగెద్దు కేవలం ఒక ముక్క తెలగపిండి కోసం రోజంతా బండ చాకిరీ చేస్తుంది. నీ చోటి నుండి తెలగపిండి ఆశ చూపటంతో గానుగాడించటానికి అంటిపెట్టుకు పోతున్నాను. వడిసెలని (త్రాడు చివర కట్టిన రాతి ముక్కని) నేనుత్రిప్పి ఉండవచ్చు. తిరుగుతున్న రాతితో బాటు నేను కూడా తిరగనవసరంలేదు. నేను నిశ్చలంగా ఉంటాను. రాయి మాత్రమే చుట్టూ వలయాలు తిరుగుతుంది. నీవెప్పుడూ గడప దాటకపోయినా ఒకచోట కూర్చుని నీవానందిస్తావు. త్రాడు పట్టుకుని నీ ఇచ్ఛానుసారం నీవైపుకి లాగుకుంటూ నన్ను గింగిరాలు త్రిప్పుతున్నావు. త్రాడు నించి విడివడాలని, నా ఈ గుదిబండ చెరకి బాగా అలసిపోయాను. నీయదార్థ రుపాన్ని ప్రశాంతంగా చూడటానికి ఒక్కసారి విడిచిపెట్టు. నీవు సంకల్పిస్తే సర్వదా నీ కోసం పనిచేస్తాను. ప్రతిఫలం ఆశించకుండా పనిచేస్తాను. ఎలాగైనా నా యజమానిని చూడనీ, అప్పుడు సణగకుండా, నవ్వుతూ పనిచేస్తాను. నన్నావరించిన అంధకారాన్ని తొలగించు.

ఏమైనా నీవు అబలవు (మాట్లాడని దానివి) ఎందుకో తెలుసుకోవాలని ఉన్నదా? నీవు అవాక్కుగా ఉండకపోతే, ఇంత ఏడుపు, దుఃఖం నీ చుట్టూ ఉంటే కదిలిపోకుండా ఎలా ఉండగలవు? మూగవాళ్ళు చెవిటి వాళ్ళై కూడా ఉంటారనుకో. చెవులు పగిలేంతగోల వినవు కనుక నిన్ను శాస్త్రాలు 'అబల' అంటాయి. నీవు మూగదానివిగా దొంగవేషం వేసి ఉండకపోతే కఠినాత్ము రాలివని పిలవబడేదానివి. ఎందుకంటే అప్పుడు ప్రతివాడూ దారుణదైన్యం నిన్ను దయాళువుని చేయలేక పోయిందని అనేవాడు . నీవుఅబలగా నటించినా, నీవునిజంగా ధ్వనులన్నిటికీ మూలానివి. నీవు సరస్వతివికాదూ? నీవు కాకపోతే ఇంకెవరు? బహుశా నీవెప్పుడూ ఇంట్లోనే ఎందుకుంటావో ఇప్పుడర్థం చేసుకున్నావు కదా? నీకు వినేందుకు చెవులు లేకపోయినా, చూసేందుకు కన్నులున్నాయి. కఠినాత్ములని అనబడకుండా తప్పించుకొనేందుకు మా దైన్యాన్ని గ్రహించి కూడా మీరిండ్ల నుండి బయటికిరారు. మీ మార్గాలు నిగూఢాలు, మీ ముసుగు తొలగించుకోమని కోర్తాను. కాని మీరు నన్నర్థం చేసుకోనట్లు నటిస్తారు. ఇంకొక మాట. మేము అవివేకులం కాకపోతే, మీరా? ఇంత చెప్పిన తర్వాత కూడా నీవు మేము అవివేకులం అంటావు? మేము జ్ఞానులమా! ఎవరి మురియల్ని (మరమరాల్ని) తింటూ, మిమ్మల్ని సంతోషపెట్టేట్లు అతన్ని ఉబ్బేసి, మోసగిస్తారో, అతణ్ణి మీరు అవివేకిగా లెక్కగట్టరు. ఇది మోసం

కాదూ ? నిద్రాహారాలు లేకుండా ఇతరుల్ని తిడుతూ కాలం గడిపేవాళ్ళెవారో తెలుసుకోవాలని ఉన్నదా? వాళ్ళు నిరంతరం శ్రీరాధని తప్పుపట్టటానికి తయారయ్యే జటిల కుటిలలు. (రాధాదేవి అత్తా, ఆడబిడ్డలు) వాళ్లు కృష్ణ లీలల ముఖ్య సహకారులు, రాధాకృష్ణుల ప్రధానాంతరంగిక భక్తులు, బృందావనానందానికి మూల కారణలు. మీరు బియ్యం. మేము ఊక. మంటల్లో మమ్మల్ని మీరు తోస్తారు.. మేము దగ్ధమవుతాము. మీరానందిస్తారు. ఇప్పుడు చెప్పు. మీ మాయ ఎంత అద్భుతమో! ఇంకా నీ వంటావా మేము తెలివిగల సేవకులమని? నా గౌరవ పురస్సరమైన నమస్కారాల్ని అమ్మకి అందించు. నీకు మామిడి పండ్లు యిష్టమైతే చెట్టుపట్ల శ్రద్ధ వహించు. పండ్లు తేలికగా విడువగలవు. కాని, చెట్టుని కాదు. ప్రస్తుతానికింతే.

నీ
హర

# 43వ పత్రము

ప్రియతమా ,

ఒక్క ఉత్తరం నీ దగ్గర నుంచి రాగానే నేను పొందే ఆనందం ఇంతని వర్ణించలేను. అది కేవలం అసాధ్యం. నీ ఉత్తరాలకీ నా ఉత్తరాలకీ ఒక భేదం ఉన్నది. నా ఉత్తరాల్లో నా ఒక్కడి గురించి సమాచారాలుంటే, నీ ఉత్తరాల్లో నా వాళ్ళుగా నేను ఎరుగున్న ప్రతివాళ్ళ సమాచారాలూ ఉంటాయి. నావి ఒక పుష్పం వంటివైతే నీవి ఒక పూలతోట. ఇంకా, నావి ఎవరూ లేని ఒక గుడిసెవంటివైతే, నీవి సుఖసంతోషాలతోఓలలాడే ఒక ఆనందగృహం వంటివి. ఈ కారణాలవల్ల నానుంచి విని నీవు పొందగలిగే ఆనందానికంటే ఎంతో ఎక్కువ ఆనందాన్ని నీలేఖతో నే ననుభవిస్తాను. వర్షాకాలం గతించిన తర్వాత చక్రవాకం శరదృతువులో చంద్రుణ్ణి చూచి ఎంతో ఆనందిస్తుంది. ఒకక్షుధార్తుడు పుష్కలంగా ఆహారాన్ని తన ముందు చూచి మహదానందం పొందుతాడు. నీప్రస్తుత లేఖ నాకంతటి ఆనందాన్నిచ్చింది.

ఇందులో నా కోసం వ్యథ చెందే నా క్రొత్త తల్లిని గురించి ఉన్నది. ఆమె అన్ని విధాలా నాతల్లి.ఆమెనుంచి నేను శెలవు తీసుకొన్నప్పుడు చాలా దుఃఖించి వెళ్ళిపోయింది, కనుక ఇప్పుడు కుమిలిపోతూ కన్నీళ్లు పెట్టుకున్నా ఈ రోజు నేనామెను చూడలేను. ఎప్పుడు అమ్మని చూసినా రోదించు తున్నట్లుగా చూస్తాను. నా కొరకే

నన్నట్లుగా! ఇది నన్ను వెంటనే క్రుంగదీస్తుంది. తన తల్లి ఏడుస్తుంటే బిడ్డ ఊరుకోగలడా? ఎందుకామెను తల్లి అని పిలిచాను. నావంటి అపాత్రుడిపై పుత్ర వాత్సల్యాన్ని ఆమె ఎందుకు చూపింది? ఆమె అలా చేయకుండా ఉంటే, ఈ రోజు బహుశా సుఖంగా ఉండి ఉండేది. ప్రియా, నేను 'అమ్మ' అని పిలిచినవాళ్ళందరి కళ్ళ వెంటా నీళ్ళు తెప్పించాను. తల్లుల్ని ఏడిపించటం మహాపాపం అని తెలుసు. నేను మహాపాపిని. నేను నీ చేయూతకై ఎదురుమాత్రం చూడగలను. నన్ను ఉద్ధరించగలవు. ఇంకా, ఇంకా అగాధాలకీ త్రోయగలవు. నేను పూర్తిగా నీ చేతుల్లో వున్నాను కనుక సహధర్మిణిగా దయచేసి నన్ను ఆదుకో. ఇంత దూరం నుంచి అది నేను చేయలేకుండా ఉన్నాను. నాకోసం దయచేసి నీవు చెయ్యి. నా తల్లుల్ని సంతోషపరచటం నాశక్తికి పూర్తిగా అసాధ్యం. కనుక దయచేసి వాళ్ళని ఆనందపరచటం ఏమరకు. జాగ్రత్తగా, శ్రద్ధతో సత్వరం, ఏ మాత్రం నిర్లక్ష్యం చేయకుండా (హృదయపూర్వకంగా) వారి అజ్ఞల్ని నిర్వర్తించు. నీ పిల్లలకి అన్నం పెడ్తున్నప్పుడైనా సరే విడిచి పెట్టి, నా తల్లి అవసరాన్నిచూడు. ఏ రకంగా నీ ప్రవర్తన నాకు వర్తిస్తుంది? అని అడిగితే, నేను అనంతంగా లబ్దిని పొందుతాను అని చెప్పక తప్పదు. నీవు చేస్తే నేను చేసినట్టవుతుంది. ఇంకా సందేహిస్తే కొంచెం విను. కృష్ణుడు బృందావనం వీడనని బాస చేశాడు. కాని ఇది చెప్పిన కొద్ది కాలానికే మధుర వెళ్ళాడు. అబద్ధం చెప్పాడా? లేదు. శ్రీకృష్ణుడిలా మధుర వెళ్తే శ్రీ రాధ బృందావనంలోనే ఉంటూ వచ్చింది. ఆమె బృందావనం విడిచి మధురకు శ్రీకృష్ణుణ్ణి చూడటానికై ఎప్పుడూ వెళ్ళలేదు. ఇప్పుడు నీవు గ్రహిస్తావు నీ కార్యం నాదెలా అవుతుందో !కనుక నా శ్రేయస్సుకై సహాయం చెయ్యి. ఇంకా ఇంకా అగాధానికి కూరుకుపోకుండా, నిరంతరం నా తల్లుల్ని తుష్టుల్నిగా ఉంచు. ఈ రోజు తల్లి అంటే ఏమిటో సూటిగా చెప్తాను. దానిపాలు మనం త్రాగుతాం. కనుక ఆవు ఒకతల్లి. భూదేవి తన ఒళ్ళో మనల్ని ఆడిస్తున్నది. కనుక ఆమె ఒక తల్లి. అసంఖ్యాకులైన దేవతలు నిరంతరం మన క్షేమం చూస్తారు. కనుక వారు పూజనీయులు. సాధువులు సర్వదా మనకి మంచి మార్గాలు, చెడ్డ మార్గాలుచెప్తారు కనుక వాళ్ళు కూడా పూజనీయులు. గురువు మనం విముక్తిని ఎలా సాధించుకోవాలో చెప్తాడు. కనుక ప్రధానంగా పూజనీయుడు. ఇప్పుడు చూడు, తల్లి తన పాలతో పోషిస్తుంది. ఒళ్ళో ఆడిస్తుంది. సదా మన శ్రేయస్సు కోరుతుంది. ప్రాపంచికం నుంచి పారమార్థికం వరకూ అన్ని రకాల మంచి కార్యల్లోనూ శిక్షణ నిస్తుంది. ఏంచేయాలో ఏం చేయకూడదో చెప్తుంది. మన ఉజ్జ్వల భవిష్యత్తు నాశిస్తుంది. ఈ విభిన్న గుణాలు, అంటే - ఆవు, భూమి, దేవతలు, సాధువులు, గురువు, వీళ్ళందరి గుణాలు తల్లిలో కేంద్రీకరింపబడి

ఉన్నాయి. తల్లి తృప్తురాలైతే వాళ్ళంతా ఆనందిస్తారు. నేను అటువంటి తల్లిని సేవించుకోలేకపోతున్నాను కనుక, ఆమెను సేవించమని నిన్ను అర్థిసున్నాను.

నీ

హర

# 44వ పత్రము

ప్రియతమా,

లోకవృత్తాన్ని అనుసరించి క్రొత్తవారొస్తే పాత మిత్రులు విస్మరింపబడతారు. గర్భం ధరించకుండా ప్రసవవేదన లేకుండా పుత్రుణ్ణి పొందావు. నీ ముందటి సంతానాన్ని, ఇంకా ఈ దీనుణ్ణి మరచిపోలేదని ఆశిస్తాను. నా గురించి ఆలోచించక పోయినా ఫర్వాలేదు కాని, నీ పిల్లల్ని నిర్లక్ష్యం చేసుకోకుండా చూసుకో, విచిత్రలోక ప్రవృత్తిని చూడు.

కేవలం కొంతకాలం మునుపు మనం వేర్వేరువ్యక్తులం. ఒక పెద్ద సంసార వర్తన విధికి సహకరిస్తామని ఎవరికి తెలుసు! నాకు నేను ఒక బాలుణ్ణి, నీవొక బాలికవు. మనం పిల్లల్ని కంటామని ఎవరికి తెలుసు ? భగవత్ సంకల్ప గతులు ఊహాతీతాలు.అలాగే ప్రతివాడూ వివాహబంధాన్ని అత్యంతానందంతో మెడచుట్టూ వేసుకోనేటట్టు చేసే ఆ ఈశ్వర సంకల్పబలాలు మహా విచిత్రమైనవి. ఎవరి తంత్రం అంత అద్భుతమో, అతడు నిజంగా గొప్పవాడు. చూడు ప్రియా, ఎన్ని ఎక్కువ కాళ్ళు ఉంటే పురుగుకి, దాని గమనానికి అది అంత భూమిపై ఆధారపడి ఉంటుంది. రెండు కాళ్ళున్నందున మనిషి నిటారుగా నడవగలడు. కాని, జెర్రులూ మొదలైన అనేక పాదాలున్న ప్రాకే పురుగులు నేల మీద ప్రాకుతాయి. ఈ న్యాయమే మతంలోకూడా దర్శనీయం . మనిషి రెండు పాదాలే కలిగి ఉన్నప్పుడు అతడు స్వేచ్ఛాజీవి. ఏమి వాంఛించితే అది చేస్తాడు. వివాహంతో మరో రెండు పాదాలుపొందితే అతడు చతుష్పాద జంతువవుతాడు. అప్పుడయినా, అతడు వాంఛించితే న్యాయపథంలో నడవగలడు. కాని, కొడుకులూ, కూతుళ్లూ, అల్లుళ్ళూ , కోడళ్ళూ చుట్టూ జేరినప్పుడు ఎన్నో పాదాలు సంక్రమిస్తాయి. భారంతో క్రుంగుతాడు. అప్పుడతడు అనేక పాదాల మీద ప్రాకక తప్పదు. మళ్ళీ నిటారుగా నిలబడలేదు. కాళ్ళూ చేతులూ కట్టబడి మాయలో కొట్టుకుంటూంటాడు. ఈశ్వరుడు

కరుణామయుడైనా, అటువంటి దయనీయ జీవాల బాధలను పట్టించుకోడు.

ప్రియా, మనం బాల్యం నుంచే ఈ ప్రాపంచిక నాటకంలో జేరగూడదని నిర్ణయించుకున్నాం. కాని, క్రొత్త రకాలైన ఖేలలు మనని ప్రతిరోజూ ముంచి వేస్తున్నాయి. మన ఖేల అంతమవుతుందో లేదో మనకి తెలియదు. ఏమైనా విముక్తికై నిరాశ చెందనక్కరలేదు. ఇతరుల్ని అలా కానివ్వకూడదు. మనం ఆడేద్దాం. కాని, ఇవన్నీ విడిచి అనతి కాలంలోనే మనం వెళ్ళిపోకతప్పదని జ్ఞాపకం ఉంచుకోవాలి. ఈ జీవిత నాటకం నిత్యమని అనుకోకు. అలా నిన్ను నీవు బంధించుకోకు. నటిస్తూ, సాగు , కాని, ఆ శాశ్వత స్నేహితుని పాదపద్మాల మీద నీ మనస్సు లగ్నం చేయి, కరుణామూర్తీ, నీ యెదలోని అనుగు మిత్రుడూ అయిన హరిని - కూతురు, కొడుకు, భర్త వంటి నీ తాత్కాలికమైన తోటి ఆటగాళ్ళ సాంగత్యంలో విస్మరించకు. నీవతణ్ణి ఎలా నీ మనస్సులో పెట్టుకోవాలో తెలియదంటే - నా సమాధానం - నీవు నన్ను నీ మనస్సులో పెట్టుకున్నట్టుగా అని. తింటున్నప్పుడు, నిద్రపోతున్నప్పుడు, నడుస్తున్నప్పుడు, కూర్చున్నప్పుడు, లేస్తున్నప్పుడు, నా గురించి ఆలోచిస్తూ ఉంటావు. నన్ను గురించి ఆలోచించని దెప్పుడో చెప్పగలవా? అదే విధంగా అతణ్ణి గురించీ ఆలోచించు, ఏ ఆట ఇష్టమైతే అందులో జేరు, కాని, నిరంతరం అతణ్ణి మనస్సులో పెట్టుకో. నిరంతరం నన్ను గురించి ఆలోచిస్తున్నావు, కనుక నీ ఇంటిపనులు చక్కబెట్టుకోవటం లేదూ! వండుతున్నావు. తింటున్నావు. ఎన్నో పనులు చేస్తున్నావు. కాని నన్ను గురించి ఆలోచించని క్షణం ఒక్కటీ లేదు. అలాగే ఆతణ్ణి మనసులో పెట్టుకో. మాయ బంధాలు నిన్నంటలేవు. నీవు ప్రశాంతంగా ఉంటావు.

నీ
హర

# 45వ పత్రము

ప్రియతమా ,

నీవు నిజంగా నా శ్రేయోభిలాషివి. నీవు నాకు మహదానందాన్ని ప్రసాదించావు. యదార్థంగా నీవు నా సహధర్మిణివి. నీవు నిజంగా ఎవరో నేను తెలుసుకోవచ్చా? నా కామితాలను తీర్చమని నీకెవరు నేర్పారు? దేవతలచేత కూడా మన్నించబడే కృష్ణ ప్రసాదాన్ని ఈ దురదృష్టవంతుడికి పంపమని ఎవరు సూచించారు? నీవు ధన్యురాలివి. అనంతమైన అదిశక్తి నుంచి నీవు ఆవిర్భవించావు. నీ దయ ఎవరిపై

చూపుతావో వాడికి ఈ భయానక భవసాగరము భయంకరం కాదు. కాని ఎవడు నీతీక్షణ క్రోధానికి పాలవుతాడో, ఎవడికి నీవు భయంకరంగా కనిపిస్తావో వాడు ఈ మూడు (స్వర్గ మర్త్య పాతాళ) లోకాలలోనూ ప్రశాంతి పొందడు. వాళ్ళు మండుతున్న అగ్నిలో పురుగులవలె (మిడతలవలె) నశిస్తారు. అగ్నివేడి చిన్న పిల్లలు పెరగటానికి ఉపకరిస్తుంది. కాపడంగా ఎంతో ఎక్కువ ఉపయోగకారి. శీతాన్ని నివారించటంలో సహాయ పడుతుంది. ఆజ్యము, మధువు అగ్నిలో హవిస్సులుగావ్రేల్చినప్పుడు శ్రేయస్సును పెంపొందిస్తాయి. కాని, అటువంటి ఉపయోగకారి అయిన అగ్నితో చెలగాటమాడేవాడు దానిలో నశించి తన మూర్ఖత్వానికి ప్రాయశ్చిత్తం చెల్లిస్తాడు. ఆ ఆలోచనే హృదయంలో భీతిని కలిగిస్తోంది. నీ తీక్షణ దృష్టి పాలయ్యే దురదృష్టం నా పాలవకుండా , నీ దయ నిరంతరం పొందే యోగ్యతను ప్రసాదించమని ప్రార్థిస్తాను.

"వ్రాస్తావా , వ్రాయవా?" అని నీవడిగావు. కొంచెం యోచించు. మీ అందరికి నా ఉత్తరాలు ఆనందం కలిగించేమాట నిజమే. నేనొక్కడినే ఇక్కడ ఒంటరిగా ఉండటం వల్ల నీ సంతోషం నా సంతోషం కంటె ఎక్కువ అనుకుంటున్నావా? ఒకడు మామిడిపండో మరొక మధుర పదార్థమో మొత్తం అంతా తింటాడు. మరొకడు నలుగురికి దాన్ని పంచుతాడు. ఎవరి ఆనందం గొప్పదో నీవు చెప్పగలవా? పండంతా మొత్తం తిన్నవాడిదా, లేక అంతా కలిసి పంచుకుతిన్న వాళ్ళదా! ఒక దీపం బాగా వెలుతురు ఉన్నచోట వెలిగించబడింది. ఏది ఎక్కువ కాంతి విరజిమ్ముతుంది? పగటిపూట నీవు దీపం ఉంచుకోవచ్చు. కాని రాత్రి దీపం అవసరం. అలా కాదని చెప్పు. తల్లీ, తండ్రీ, అన్నా తమ్ముళ్ళూ, అక్కా చెల్లెళ్ళూ, స్నేహితులు, తదితరులు అనే వెలుగుల మధ్య తిరుగుతున్నావు. ఇంకొకదీపం కావాలనే కోరిక అంతగా ఉండదు. కాని ఉన్న ఒక్క దీపం చీకటి గదిలో తీసివేస్తే ఎంత దుఃఖంలో కూరుకుపోతాడో నీవు బాగా గ్రహించగలవు. దయచేసి నేనన్నదానికి విచారించకు. అమ్మ ముందు ఆహ్లాదకరంగా కనిపించేటట్లు జాగ్రత్తపడు. తన పిల్లలకోసం ఒక తల్లి ఎంత గాఢంగా కుమిలిపోతుందో పూర్తిగా ఇప్పుడు నీవర్థం చేసుకున్నావు. తన కొడుకు ఒక వస్తువు మీద ప్రత్యేకాభిమానం కలిగి ఉన్నాడని తెలిసినప్పుడు అటువంటి వస్తువును ఆమె చూడటం తటస్థించినప్పుడు, అది ఆమెకు తన కొడుకుని జ్ఞాపకం చేస్తుంది. మామూలు అల్ప వస్తువుల విషయంలోనే అలా అయితే,! తన భర్త అనురాగానికి పతాకగా నిలిచే, పత్నీ బాంధవ్యంలో ఉన్న వ్యక్తి మీద ఇంకా ఎంత అవాలి? తన కొడుకు భార్య సుఖసంతోషాలతో ఉన్నా, తల్లి దూరదేశ మేగిన

కొడుకు కోసం తపిస్తుందే! అటువంటప్పుడు కోడలు విచారంగా ఉండటం చూస్తే అత్త బ్రతకగలదా? స్థిమితంగా ఉండగలదా? అందుకని నేను చెప్పినట్లుచెయ్యి. ఆమెను నిరంతరం సంతోషంగా సంతృప్తిగా ఉంచగలిగితే నీకు నీవూ సంతోషంగా ఉంటావు.

బాల్యం నుంచీ నేను పాగల్‌నే. నేను చెప్పినదంతా పట్టించుకోకు, మంచిదేదైనా నేను చెప్పితే, మిగిలింది వదిలేసి, అదే మనసులో పెట్టుకో. తండ్రినీ, తల్లినీ, అన్నలనీ మిగిలిన పెద్దలనీ మానవ రూపంలో ఉన్న దేవుళ్ళలా సేవించు. వారి దయని సంపాదించు. యుధిష్ఠిరుడు ,అతని నలుగురు సోదరులు కృష్ణ కృపని అనంతంగా పొంద గలగటానికి కారణం వారివ్రతాలు, తపస్సులూ కాదు, కుంతీదేవి పట్ల గల వర్ణనాతీతమైన అనంతమైన మాతృభక్తి వల్ల శ్రీ కృష్ణుణ్ణి తమ స్నేహితుణ్ణిగాను, అండగానూ, పొందగలిగారు. కుంతీదేవి వారి నిర్బంధ అరణ్యావాస సమయంలో వారిని రక్షించమని అర్ధించింది. అతడు రక్షించాడు. తల్లి అభ్యర్థనలను ఎవరు నిరాదరించగలరు? మళ్ళీ లక్ష్మణుడు పధ్నాలుగు సంవత్సరాలపాటు ఆహారం లేకుండాను, నిద్ర లేకుండానూ అతని తల్లి అలా వాంఛించింది కనుక ఉండగలిగాడు. తల్లి ఏవి చెప్పితే అవి వేద వాక్యాలవలె గౌరవింపబడాలి. ఆమె మాటలు నిత్య సత్యాలవుతాయి. తల్లీ తండ్రీ భూమిపై దేవతలవలె గౌరవించబడాలి. ఉదయాన్నే మొట్టమొదట వారికి గౌరవంతో నమస్కరించాలి.

నీ
హర

# 46వ పత్రము

ప్రియతమా,

బాగా బాధపడుతున్నట్లున్నావు. కాగలదానిని ఎవరూ అపలేరు. విచారపడకు. మనిషి స్థితి ఒక్కలా ఉండదు. కాలానుగుణంగా సుఖమూ దుఃఖమూ వస్తాయి, పోతాయి. ఉద్రేకాలకు లోనుగాకు. నిర్వికల్పుడు . నిరంతర శ్రేయోభిలాషి అయిన కృష్ణుని పాదారవిందాలపైన నీ దృష్టి ఉంచు. నిరంతరము అతని నామాన్ని స్మరించు. హృదయ పూర్వకంగా అతణ్ణి నీ సహాయానికై అర్థించు. ఎందుకంటే అతడు మాత్రమే నీ బాధను తొలిగించగలడు. అతడునీకు ఉపశమనం కలిగిస్తాడు. చాలాకాలం క్రితమే నీకుచెప్పాను. కాని, అతనిపైదృష్టి మరల్చక అశాశ్వత శుష్కప్రాపంచిక బంధాలపై మనస్సు ఉంచావు. అలా అతణ్ణి మరిచిపోయావు. నన్ను గురించి

ఆలోచించావు. ఇంకా ఆలోచిస్తున్నావు. ఈ ప్రాపంచిక బంధాలన్నీ శుష్కాలు. ఈ జన్మకు పూర్వం అనేకసార్లు ఈ భూమిమీద పుట్టావు. ప్రతిసారీ ఒక క్రొత్త రూపంలో, పురుషుడుగానో, స్త్రీగానో, పశువుగానో, లేకపక్షిగానో. ప్రతిజన్మలోనూ ఇల్లుండేది. కొడుకులు, కూతుళ్ళు, భర్త, తల్లి, తండ్రి మొదలైన వాళ్ళంతా ఉండేవాళ్ళు. ఇప్పుడు వాళ్ళెక్కడున్నారు ? ఒక్కక్షణం కూడా వాళ్ళని గురించి ఆలోచిస్తున్నట్లు కనిపించవు. క్రొత్తగా ఈ జన్మలో కలిగిన సంబంధాల వల్ల నీవు ఆనందిస్తున్న ఈ ప్రేమాను బంధాలు ప్రతి నీ గత జన్మలోను నీవనుభవించావు. కాని కాలక్రమేణ పూర్తిగా వాటిని మరచిపోయావు. అలాగే ఈ ప్రస్తుత బాంధవ్యాలు ఆనందాలు మళ్ళీ నీవీ ప్రపంచం విడిచి పెట్టినప్పుడు నిశ్చయంగా మరచిపోతావు. చిన్న పిల్లల ఆటస్థలంలా మన కార్యస్థానం ఒకచోటి నుంచి మరొక చోటుకి మారుతూంటుంది. ఈ రోజు కొందరికి తోటి ఆటగాణ్ణి. రేపు వాళ్ళు పోట్లాడుతారు. నిన్ను నా స్థానంలో తీసుకుంటారు. ఈ ప్రపంచంలో అదే మనం చేస్తున్నాం. ఈ రోజు నేను నీ సహచరుడిని. రేపు నేను నిన్ను విడవవచ్చు. ఇంకొకరిని తీసుకోవచ్చు అందుకని క్షణ భంగురమైన శుష్క ప్రేమలాలసలో శాశ్వత కృష్ణ ప్రేమను మరువవద్దంటాను. కృష్ణుడు ఆత్మలకి ఆత్మ, సర్వకాలాలలోను సహచరుడు. గర్భంలోని పిండానికి నిరంతరం సన్నిహితంగా ఉంటాడు. అంత భయంకరమైన ఆవాసంలోనూ, ఆ పిండంతో అతడు ఆడతాడు. దాని శక్త్యానుసారం ఆనందంగా ఉంచుతాడు. ఆకలైనప్పుడు ఆహారం, దాహమైనప్పుడు పానీయం ఇచ్చి పోషిస్తాడు. ఇప్పుడు చెప్పు ఎవరైనా అతనికంటె ఎక్కువగా మనని ప్రేమించగలరా? అందుకని సర్వ ప్రాణులకు ప్రాణమైన అతణ్ణి ప్రేమించు. అతణ్ణి నీవానిగా భావించు. అతడు మనందరికి, తల్లి, తండ్రి, అన్న, స్నేహితుడు, ప్రభువు. అతణ్ణి ప్రేమించటమంటే ప్రతి జీవినీ ప్రేమించటమన్నమాట. దీంతో ఇక్కడ నేను ప్రియతమ స్నేహితులు బంధువుల పట్ల అభిమానంగా ఉండక విరుద్ధంగా ఉండమని అంటున్నానని నిర్ధారించుకోకు. వారిలో ప్రతి ఒక్కరూ ప్రేమతోనే ఆదరింపబడాలి. కాని నీవు వ్యామోహం చెందకూడదు. ప్రతిదానినీ ఇక్కడ విడిచి వెళ్ళక తప్పదు అని నీవు నిరంతరము జ్ఞాపక ముంచుకోవాలి. రాధా గోవిందుణ్ణి హృదయ పూర్వకంగా ప్రేమించు. అతనిపై మత్తిలి ఉండు. అతడు నిన్ను తనదానిని చేసుకొంటాడు. అతనితో ఎడబాటు లేదు. ప్రతి వస్తువూ నవనవోన్మేషంగా అతని సమక్షంలో కనిపిస్తుంది. అందుకని అతణ్ణి ప్రేమించు.

నీ
హర

# 47వ పత్రము

ప్రియతమా,

కృష్ణుడు నీకుంజంలో ఈ రోజు లేడని బహుశా నీవు అస్థిమితంగా ఉన్నట్లున్నావు. మరెక్కడో ఇంకా గొప్ప భక్తుని ఆకర్షణలకి వశుడై తన నూతనానందధామానికి వెళ్ళటానికి బహుశా నిన్ను విడిచి ఉంటాడు. దానికి నీవేం చేయగలవు ? భక్తులతనికనేకులున్నారు. తన శ్రద్ధని ప్రతివారిపట్లా సక్రమంగా చూపాలి. సకల చరాచర సృష్టిజాలానికి అతడు ప్రాణాధికుడు. అవన్నీ అతణ్ణి కాంక్షిస్తాయి. అతణ్ణి పూర్తిగా నీవే పొందాలని ఎలా ఆశించగలవు? ఏ పతివ్రత తన భర్తని పొందాలని ఆశించదు? అతడు ఈ సర్వ ప్రపంచానికీ నాథుడు. భాధపడకు. ఓర్పు వహించు. దృష్టిలో లేడని అతణ్ణి మనస్సులో నుంచి దూరం చేయకు. నిద్రపోతున్నా నీ మనస్సుని అతని పాదపద్మాలపై ఉంచు. అతని వినీల సుందర రూపాలని నీ హృదయాలంకరణగా చేసుకో. అతని నామాన్ని నీ జిహ్వకు బంధించు. అనంతమైన అతని లీలలను ధ్యానించు. అప్పుడతడు నిన్నెన్నటికీ విస్మరించడు. ఈ అభయశుద్ధిని నీవు శంకించలేవు. ఎందుకంటే. ఇది నీకు తెలుసు,మహా రాస రస పట్టులో ఉండగా గోపికల మధ్యనుంచి కృష్ణుడు అదృశ్యమయినప్పుడు అతణ్ణి వెదకటానికి చేసిన వారి ప్రయత్నాలన్నీ విఫలం కాగా అతని వివిధ లీలలపై వారి ఆలోచనలని సారించి, భక్తిగా అనుసరించారు. దీని వలన తిరిగి అతణ్ణి వారి మధ్య పొందగలిగారు, అదే చెయ్యి. అతణ్ణి నీవూ పొందుతావు. నా దౌర్భాగ్యం!. అతని అతి శీతల మనోహర మృదు విగ్రహాన్ని నా చేతులతో తాకి నా ఆత్మని తృప్తి పరచుకొనలేకుండా ఉన్నాను. భావాతీత దయాప్రపూర్ణమైన అతని రూపాన్ని కండ్లకు విందును కల్పించుకో లేకుండా ఉన్నాను. నీ వలె నా హృదయ నివేదనని రహస్యంగా నా ఆత్మేశ్వరుని చెవుల వేయ లేకపోతున్నాను. నీవు ధన్యురాలివి. నీ నేత్రాలు, శ్రోత్రాలు వాటిపని అవి చేశాయి. నీవు కృష్ణుని చూశావు. అన్నం పెట్టావు. అలంకరించావు, నీ చిత్తం వచ్చినట్లు. అతి నికృష్టుణ్ణి, నేనతణ్ణి చూడలేదు. అతని దేహాన్ని తాకలేదు. ఏమైనా, అతని దయకు పాత్రుడిని కావటానికి ఏమీ చేయని నా పట్ల దయతో ఉండమని నీ శ్యామునితో చెప్పు. ఒక దొంగ నాణెము మంచి నాణేలు చాలా ఉన్నప్పుడు (వాటిమధ్య) గుర్తించబడకుండా చెల్లుబడి అవుతుంది. తాలు ధాన్యంతో కలిసినప్పుడు ధాన్యంధరే గిట్టిస్తుంది. నీవు నా ఏకైక ఆధారానివి. నీకు వ్రాయకుండా నీకు బాధని కలిగించి శ్యామ విరహంతో బాధపడుతున్న నీ బాధని ఇంకా ఇలా

పెంచాను. ఇందుకు విచారించకు. నీకు దుఃఖాన్ని కలిగించే వాడెవడూ శాంతి పొందడు. రావణుడు, దుర్యోధనుడు ఇద్దరూ ఇది నిరూపించారు. కనుక ఏ రకంగానూ నన్ను కోప దృష్టితో వీక్షించవద్దని ప్రార్థిస్తాను. మీ స్త్రీ జాతి సుకుమార హృదయలు. మేము, పురుషులం, దారు సమాన శుష్క కఠిన హృదయులం.

ఇది వరకు నా యోగ క్షేమాలను గురించి వ్రాశాను. ఇప్పుడింకా చెప్పేందుకు ఏమీలేదు. నవనవోన్మేషంగానూ, జవంగానూ అనిపిస్తున్నది. హృదయంలో అశాంతి లేదు. క్రొత్త చోటికి వచ్చిన పిచ్చివానిలా ఉన్నాను. అల్లరి పిల్లవానిలా ఉన్నానని పిస్తున్నది. ఈ క్రొత్త భావాలు, ఈ క్రొత్తరూపం, అందం, అన్నీ కృష్ణుని కృపవల్లనే. ఇప్పుడు నేను ప్రార్థించేదంతా నీ కృపతో - పుంజుకున్న ఆరోగ్య జవసత్వాలతో కృష్ణుని పట్ల తపన తీవ్రం కావాలని

నీ
హర

# 48వ పత్రము

ప్రియతమా !

నీ ఉత్తరము అందింది. నీ గత ఉత్తరాల వలె హృదయానికి ఉపశాంతి కరంగా కాక, ఇది వర్షాకాలపు కటిక చీకటి అమావాస్య రాత్రి వలె వచ్చింది. నీ నుంచి ఒక విషయం దాచుదామనుకున్నాను, కాని అది సమంజసం కాదని భావించి ఇప్పుడు చెప్తాను. పురుషుడుగా నాకు బలిష్టమైన శరీరమున్నది కాని, నా ఆలోచనలూ అంతః కరణలూ స్త్రీకి వలెనే అతి సున్నితాలు. ఎంతో చిన్న కష్టం కూడా నన్ను ఎక్కువ బాధపెడుతుంది. నా కష్టాల కంటె ఇతరుల కష్టాలవల్లే నేను ఎక్కువ బాధపడతాను. నా గురించి నేనాలోచించుకోను. ఇతరులను గురించి అవిరామంగా ఆలోచించుతూంటాను. దైన్య దృశ్యాన్ని భరించలేను. బాధలూ కష్టాలు గురించి జనం చెప్పుకొనే చోటుకు నేనసలు వెళ్ళను. ఎవర్నీ ఏడుస్తూండగా చూడలేను. నీకు బాగా తెలుసు కనుక నేనింతకంటె ఎక్కువ చెప్పనవసరం లేదు.

చింతామయమైన ఈ ప్రపంచంలో బాధని మరచేందుకు ఒక అమూల్య రత్నాన్ని సంపాదించుకోవాలి. బాధని మరచిపోగలగటం నేర్చుకున్న వారంతా ప్రతిదీ తమవశంలోకి తెచ్చుకున్నారు. ఒక ప్రక్క విస్మరణ అంటే ఒక అమూల్య రత్న సంపాదనం. అలాగే మరొక ప్రక్క జ్ఞాపక శక్తి కూడా అమూల్యభాగ్యాన్ని సూచిస్తుంది.

కనుక ఎలా మరిచిపోవటమో ఎలా జ్ఞాపక ముంచుకోవటమో తెలుసుకో. ఏది మరచిపోవాలి, ఏది మనస్సులో పెట్టుకోవాలి అని నీవడగవచ్చు. విను. నీవు ఇతరుల చేత అవమానపరచబడ్డప్పుడు, బెదిరించబడినా దౌర్జన్యానికి గురి అయినా పొందిన బాధని మరచిపో. కాని, ఎవరికైనా బాధని కాని, దుఃఖాన్ని కాని నీవు కలిగించి నప్పుడు ఎప్పటికీ మరువక నీ దుష్కృత్యానికి విచారించు అగాధ సముద్రంలోని అమూల్యరత్నాలివి. ఇవి గ్రహించినవారు ప్రతిదీ వశీకరించుకున్నట్లే.

ఇది కొంచె విను. శ్రీకృష్ణుడు రాధికను విడచి వెళ్లిన రోజు చెలికత్తెలతో కలసి శ్రీ రాధిక విపరీతంగా శోకించింది. ఒక పెద్ద ఒట్టు పెట్టుకున్నది. శ్రీ కృష్ణుడు దుర్మార్గుడనీ, మోసకాడనీ, వారితో అన్నది. అతనితో సంబంధాన్ని తెగతెంపులు చేసుకుంటానన్నది. అతనిపేరు విననన్నది. ఎవరైనా అతని పేరు తలిస్తే వారి ముఖం చూడనన్నది. మరునాడు శ్రీ రాధిక చెలికత్తెల ముందు శ్రీ కృష్ణుడు వేడికోలుగా తన పనికి క్షమాపణ కోరుకోగా వారు శ్రీకృష్ణుని తన సన్నిధికి రానీకుండా ఆపటం చూసిన శ్రీ రాధిక శ్రీ కృష్ణునితో అలా ఎందుకు ప్రవర్తిస్తున్నారని వారిని అడిగింది. వారు శ్రీ కృష్ణుడు దుర్మార్గుడని చెప్పారు. క్రిందటి రోజు అతడు ఆమెకు దురంత దుఃఖాన్ని కలిగించాడు కనుక, తమకి అతనితో ఇంకా ఏమీ పనిలేదనీ చెప్పారు. అప్పుడు శ్రీరాధిక ఏడ్చి తనకేమీ జ్ఞాపకం లేదన్నది. సకల జగత్తుకు ఆనందాన్ని అందించిన శ్రీకృష్ణుడు తనకి దుఃఖాన్ని కలిగించటం అసాధ్యమన్నది. తన వలన అమితమైన దుఃఖాన్ని పొందాడని భావించి సిగ్గుచేటని నిట్టూర్చి హృదయ విదారకంగా రోదించింది. అలా శ్రీరాధిక కృష్ణుని తన ఆధీనంలోకి తెచ్చుకోగలిగింది. అలా ఆమె కాకపోతే ఆమె రాధిక అయ్యేదా? కనుక నేను పైన చెప్పిన రెండు అంశాలూ నిజంగా రెండు అమూల్యరత్నాలు.

మామిడి పండంటే ఇష్టపడేవాడు చెట్టుకొమ్మ గీసుకోవటం తటస్థిస్తే మామిడి చెట్టును నరికి వేస్తాడా? నిజంగా అతనలా చేస్తే అతనికి మామిడి పండంటే అంత యిష్టం లేదని నిర్ధారించుకోవాలి. పండు ఇష్టపడితే చెట్టు నింకా ఎక్కువ అభిమానించాలి. ఆ చెట్టుకు నేనొక పండుని మాత్రమేనని నీకు తెలియదా? ఆ కొమ్మ నుంచి నన్ను త్రుంచితే చెట్టు ఏమాత్రం బాధపడదు. పండ్లు రాలిపోతే చెట్టు ఎండిపోదు. అందువల్ల సహజప్రేమతో దాన్ని ఒక బంగారు సింహాసనంపై సాధ్యమైనంత జాగ్రత్తగా ఉంచినా, తాజాగా దాన్ని ఉంచేందుకు నీ ప్రయత్నాలు తట్టుకోలేక క్రమేపీ అది వడిలి ఎండిపోతుంది. అలాగే, ప్రియా, నిజంగా నీకేమైనా నా పట్ల ప్రేమ ఉంటే - నేనే చెట్టుకి ఒకపండుని మాత్రమేనో - ఆ చెట్టుని మరింత

ప్రేమించి తీరాలి. భక్తిగా దాన్ని పూజించాలి. అప్పుడు నా పట్ల నీకున్న ప్రేమను రుజువు చేసుకుంటావు. భగవంతుడు నీ యోగక్షేమాల్ని చూస్తాడు.

మనిషికి మనసులో అనేక యావలుంటాయి. పగలూ, రాత్రి 24 గంటలలో ఒక్క క్షణం విశ్రాంతి దొరకదు. అణగార్చివేసే అతని భారానికి తోడు మరికొంత భారాన్ని క్రొత్తగా వేయటం భావ్యమా? మరణ వేదన పడుతున్న వ్యక్తిని చూసి ఎవరైనా అతని బాధానివృత్తికి గొంతుపిసికి చంపుతారా! నేను విచారసముద్రంలో ఉన్నాను. పెను తుఫానుల్ని దానిపైకి పంపి మరింత భయంకరంగా మార్చటం భావ్యమా! నేను చెప్పేది కొంచెంవిను. నవ్వటం, నవ్వించటం నేర్చుకో, దుఃఖమయమైన ఈ ప్రపంచంలో నీ రోజులు ఆనందంగా గడపగలవు. అసలే ఈ ప్రపంచం సంతోషరహితమైనది. ఇంకా ఎందుకు బాధని పెంచుకోవటానికి శోకిస్తావు ? అసలే గాఢాంధకారం. ఇంకా ఎందుకు నీకళ్ళని మూసుకుంటావు. చీకటిని పెంచటానికి తప్ప! అన్నం నమలటానికే కష్టంగా ఉంటే పులుపు కొరికి ఇంకా పండ్లెందుకు పులవగొట్టుకుంటావు?

నీ

హర

# 49వ పత్రము

ప్రియతమా,

రేపు ద్వితీయ, లేకపునరాగమన రథోత్సవం, నీ రథం మీద నవజలధరం శ్యామసుందరుడు ఆశీనుడవుతాడు. నారథం శూన్యంగా ఉంటుంది. నా రథాన్ని ఎంతబాగా అలంకరించాను! ఇంకా ఆ నీలవర్ణుడు రాలేదు. పాపాత్ముని రథాన్ని ఎందుకు సమీపిస్తాడు! ఇప్పుడు చెప్పు, ప్రియా, నా రథాన్ని నీ రథం వలె ఎలా చేయాలి? నా ఆత్మేశ్వరుని పాదపద్మ సన్నికర్షతో పావనమయ్యేటట్లు నా యీ శుష్క కఠిన రథాన్ని ఎలా మృదుమనోహరంగా రూపొందించాలి? నీవు నా దానివి కనుక నా బాధ తొలగించటం నీ ధర్మం. ఇంకెవరు చేస్తారు? ప్రాణమిత్రుడు లేకపోవటంతో జీవితం ఎడారివలె, ఎండిన సరస్సులా నిస్సారంగా ఉన్నది. అతణ్ణి ఒక్క నిమిషం దర్శించిన వారైనా బ్రహ్మేంద్రాధిపత్యాల్ని సైతం లెక్కించరు. చెప్పు :ఎప్పటికైనా ఆ ప్రియమిత్రుని దర్శించగలనా? లేక, ఇలాగే వృధాగా జీవితాన్ని ముగిస్తానా? అతణ్ణి సేవించే నిమిత్తం ప్రపంచ విషయాలలో ప్రవర్తించకుండా మానుకున్నాను.

ఆత్మీయుల్ని బాధపెట్టాను. అమ్మకి దురంత ఆవేదన కలిగించాను. అయినా ఇంకా నా పథం గోచరించటం లేదు. విసుగు కలుగుతున్నది. పురోగ మించటానికి బదులు క్రమేణా రోజు రోజుకీ తిరోగమిస్తున్నాను. పతనమవుతున్నాను. ఈ పతనాన్ని నివారించట మెలాగో నాకు బోధించమని కోరుతున్నాను . నీ అండతో నా జీవితం విజయవంతం చేసుకోనీ. దయచేసి నీవలె మృదుమధురంగా ఎలా ఉండాలో చెప్పు. నీకు నా మీద ప్రేమలేదు. కాని, నేనెందుకు నిన్ను ప్రేమిస్తానో తెలుసుకోవాలని ఉన్నదా? నాలోసుగుణాలు లేవు. అన్నీ దుర్గుణాలే, ఇక నీవో, ఉత్తమ గుణాలంకృతవు . ఆకర్షణలేని, ఎవరూ కోరని పుష్పము వృధా. ఆకర్షణీయమైన సువాసనాభరితమైన, మనోహరమైన ప్రసూనం ఆతురతతో వాంఛించబడుతుంది. అలాగే సుగుణవంతుడైనవాడు అందరిచే అభిమానింపబడతాడు. బహుశా నేనెందుకు నిన్ను ప్రేమిస్తున్నానో ఇప్పుడు నీ వర్ధం చేసుకుంటావు. పశువులు బాహ్యా సౌందర్యంతో విర్ర వీగటం ప్రతిక్షణం ప్రమాదాన్ని ఎదుర్కోవటమే. సుగుణ ప్రశంస అనంతానందాన్ని, సంతృప్తిని కలిగిస్తుంది. సౌందర్యంతో కళ్ళుమూసుకొని పోయిన వారు బంధజీవులు. సుగుణాలే జీవులకు నిజమైన అందం. సుగుణవంతునికి అందంలో సమానుడు లేడు. ఇక్కడ ఇది నీ కొక్కింత చెప్తాను. చంద్రావళి శ్రీకృష్ణుని అతిలోక సౌందర్యానికి వశురాలైంది. శ్రీరాధ అతని సుగుణాలకి మోహితురాలయింది. ఇప్పుడు వారిద్దరిలో భేదం అర్ధమైందా? ఇంకా నేను చెప్పనక్కరలేదు. ఎవరికి వారు వారి సంస్కారానుగుణంగా ప్రవర్తిస్తారు. నేనిదిమాత్రం చెప్పవచ్చును. సౌందర్యం లాలనను పెంచితే, అంతస్సుగుణాలు అంతర్జనితానురాగాన్ని ప్రేమగా మార్చటానికి సహకరిస్తాయి. అప్రస్తుత ప్రసంగం చేశాను. మన్నించు.

నీ
హర

# 50వ పత్రము

ప్రియతమా ,

చాలా కాలం తర్వాత నిన్ను కలుస్తున్నాను. బహుశా నీవు. మరచిపోవటం నేర్చుకుని ఉంటావు. నేర్చుకొనగలిగావా? విస్మరణ సంతోషించటానికి, ఆనందంగా ఉండటానికి, మరణం విముక్తి కలిగిస్తుందని వినలేదూ? మరణంతో ప్రతిదీ విస్మరింపబడుతుంది, కనుక ఇలా చెప్పబడింది, గౌరవము, అవమానము, సుఖము

బాధ మొదలైనవి పూర్తిగా విస్మరించబడతాయి. ఏవీ అప్పుడు బాధ కలిగించలేవు. కనుక విస్మరణ ఆనందం. అందుకని ఆచరణలో పెట్టగలిగావా అని అడుగుతున్నాను. ఇతర దేవత లందరికంటె ఎక్కువ ఆనందం శివుడు పొందటానికి ఇది కారణం.

విస్మరించట మెలాగో నేర్చుకొమ్మన్నాను నిన్ను. కాని, నేనూ అదే నేర్చుకోవాలను కుంటున్నాను. ఎంతగానో ప్రయత్నించాను, కాని, ఏమీ చేతకాలేదు. ఆశ్చర్యపడకు. ఎంత ప్రయత్నం చేసినా ఎవరైనా ఒక ఇనుప ముక్కని నీటిలో కరిగించగలరా? కాని, కొంచెము ఒండుమట్టి గట్టిగా ఉన్నా కరిగించవచ్చు. చక్కగా నీళ్ళలో కలపవచ్చు. మేము ఇనుము, మీరు ఒండుమట్టి. ప్రయత్నాలన్నీ చేసినా, మేము ఏది చేయలేమో, అది మీరు తేలికగా చేయగలరు. ఇదీ భేదము స్త్రీ పురుషులకు.

ఎవరైనా పాపం చేస్తే, ఇతరులు దానిని గురించి మాట్లాడితే వారు కూడా తప్పు చేస్తున్నట్లు. ధృవ చరిత్ర, ప్రహ్లాద చరిత్ర వింటే ఎవరికైనా ఎందుకు పుణ్యం వస్తుందో చెప్పగలవా? సావిత్రి చరిత్ర వింటే ఎందుకు విన్నవారికి పాప విమోచనమవుతుంది? అవన్నీ, పవిత్రాలూ, నిర్మలాలూను. వారిని గురించి, వారికి సంబంధించిన విషయాలను గురించి మాటడటం చాలా ఉత్కృష్టం. అలా కాకపోతే శ్రోతలపై పుణ్యప్రభావమెందుకు ఉంటుంది? పవిత్రుల మయ్యామని వారెందుకు తలుస్తారు? దూషకులు సాధువులను పవిత్రుల్ని చేస్తారు. నిరంతరం వారిని దూషించి వారి పాపాలను గ్రహించి, తమనెత్తిపై వేసుకొని, పాపాత్ములై, సాధువులను పాపరహితులనుగా చేస్తున్నారు. కనుక ఇతరుల దుర్గుణాలను గురించి మాట్లాడకు. తలవను కూడా తలవకు. ఎవరైనా ఒకపాప కార్యం చేస్తే నీకతని సద్గుణమొకటి తెలిస్తే - రెండవదానిని గురించే మాట్లాడు. దానినే మనస్సులో పెట్టుకో. నీవు పవిత్రురాలివవుతావు. కృష్ణుని పరమ పవిత్రాశ్రితుల మధ్య ఉండే అర్హత పొందుతావు. ఆనందిస్తావు.

పరుల తప్పులెన్నటమే పనిగా గలవారు కృష్ణుని బంధు వర్గంలో జేరలేరు. బంధు గణంలో ఒకరిగా లెక్కగట్టబడాలంటే ఇతరుల తప్పు లెంచకు. నీ తప్పులే విమర్శించుకో. ఇది పుణ్యప్రాప్తికి అతిసులభమైన మార్గం. పూజలు, పారాయణలు, తీర్థయాత్రలు పుణ్యప్రదాలు కావు. దాన ధర్మాలు కావు. ఎవరైనా నిన్ను యాచిస్తే సాధువేషంలో ఉన్నా, యాచకుడు రాత్రులు దొంగతనం చేస్తాడనే భావంతో దానాలిస్తే నీదానము సఫలమవుతుందా? నీవతనికేమీ ఇవ్వకుండా ఉంటేనే బాగుండేది.

హేళనగా నవ్వకు. నేను కోరేదల్లా నీవొకమారు ఇది ప్రయత్నించు. మొదట్లో ఆచరణకి కష్టంగా కనిపించవచ్చు. కాని, నిజంగా ప్రయత్నిస్తే, హాయిగా, అత్యంతానందంగా భావిస్తావు. మానటానికి సుతరాము అంగీకరించవు. ప్రతివారు దీనిని గ్రహించే రోజు వస్తుంది.కాని అప్పటికి చాలా ఆలస్యమయిపోతుంది. పంచేంద్రియాలు కర్మ నిరాకరించిన రోజున ప్రియమైన బంధువులు, స్నేహితులు సుఖసంతోషాలతో అలరారే కుటుంబం ఒక ప్రక్క వ్యామోహపరుస్తుంటే, ఇంకొక ప్రక్క కఠిన కర్కశ కంఠంతో, సత్వర వినిర్గమనానికి యమదూత భయంకరమైన హెచ్చరిక - ఆ భయానకమైన రోజున నిస్సహాయుడనని గ్రహించుకొంటాడు. ఆ రోజు ఎప్పుడు వస్తుందో ఎవరికీ తెలియదు. అందుకని, అది రాకముందే ఏది అవసరమో అది చేయాలి. ఎందుకంటే అది రాక తప్పదు. ప్రాపంచిక విషయాకర్షణల శుష్క సుఖాలకు పొంగిపోవటం కంటె రత్నాలకు రత్నమైన కృష్ణుని వైపు దృష్టి సారించు . ఆనందిస్తావు.

నీ

హర

# 51వ పత్రము

ప్రియతమా ,

నీవేమి చేయాలని నేనుకొంటానో సరిగ్గా అదే చేస్తావు. నీవేమి చెప్పాలని అనుకొంటానో సరిగ్గా అదే చెప్తావు. అందుకే నిన్నంతగా ప్రేమిస్తాను. నీ మనస్సూ నా మనస్సూ ఏకం చేయాలని కృష్ణుని ప్రార్థిస్తాను. ఇద్దరూ ఏకీకృతం కానిదే వాంఛిత స్థలానికిపోయే అధికారం దక్కదు. ఒంటరిగా అక్కడికి జేరటము ఎవ్వరూ ఆశించలేరు. బహుశా , దీనితో నీవు అనుకోవచ్చు, తాము సర్వప్రయత్నాలూ చేసినా, జీవితమంతా ఒంటరిగా ఉన్నవారు అక్కడికి ఎప్పటికీ ప్రవేశించలేరు - అని. అలాకాదు జంటలు తేలికగా వెళ్తారు. ఒంటరివాళ్ళు శ్రమతో జేరతారు. అదే భేదం . ఒంటరిగా వెళ్ళటానికి సుదీర్ఘ వ్రతాలు. తపస్సులూ మూలాధారం. నీవు వినే ఉంటావు. అగస్త్యుడు మొదలైన పూర్వ ఋషుల ఆశ్రమాలుండేవి. అందులో వృక్షాలు వారు కాంక్షించే ఫలాల నిచ్చేవి. గొప్ప తపస్సులకి కఠిన వ్రతాలకి అది ఫలము. ఈ రోజులలో, నీవు విని ఉంటావు. అంట్లు త్రొక్కటంతో, వివిధ పలాలూ, పుష్పాలు ఒక వృక్షం పై కనిపించేటట్లు చేయబడుతున్నాయి. ఈరెండు పద్ధతులలోను భేదం గ్రహించు. ఒకటి మహత్తర ఏకాంతవాసము, చిరతపస్సులకీ ఫలమైతే -

ాలా సూక్ష్మమైన పద్ధతి.

వాళ్ళు (బ్రహ్మచారులు) మహత్తర ప్రయత్నంలో రెండుగా తమ్ముతాము ొంటారు, ఒకటి రెండవదానిని ప్రేమించటం నేర్చుకొంటుంది. ఒక జీవిని ండుగా - ఒకటి స్త్రీగా , మరొకటి పురుషునిగా విభజించటం ఎంతకష్టమో నుగ్రహించగలవు. కాని, అదృష్టవశాత్తూ ఆడామగా అయిన జంటకి లవటం ఎంత తేలిక! వారు వెంటనే ఆ శాశ్వతావాసాన్ని ప్రవేశించి త్రులవుతారు. నీవిప్పుడు, కృష్ణుడు దంపతులకే సాధ్యుడు - అని బహుశా అది కూడా కాదు. వివాహం ద్వారా వారు కలిశారు. కాని, ఒకటి కాలేదు, ్వరు వ్యక్తులుగానే ఉండిపోయారు. ఎంతవరకు ఒకటి అవలేరో అంత ం బహుశా స్ఫురించి ఉంటుంది. ఇందుకై, ప్రతివారూ తమ జంటను ని) గాఢంగా, స్వార్ధరహితంగా ప్రేమించటం నేర్చుకోవాలి. స్వార్ధం ాలి. మోసం స్ధానంలో నిష్కాపట్యాన్ని పూర్తిగా అలవరచుకోవాలి. తన రించి నిరంతరం ఆలోచించాలి. అదే సమయంలో ఆత్మేశ్వరుని ధ్యానిస్తూ తమని ఏకం చేయమని ప్రార్థించాలి. సహనం వర్ణనాతీతమైన కలిగిస్తుంది. ఆ ఆనందాన్ని వర్ణించి వ్రాయటం మానవశక్తికి అసాధ్యం.

ంచలేకపోయినా, అనుభవించి ఆనందించవచ్చును. కృష్ణ కృపాపాత్రులైన మైన ఆనందమో అది గ్రహించగలరు. చండీదాసకవి పూజనీయు రాలైన పూర్తిగా ఐక్యం కాగలిగాడు. అమరుడైన జయదేవుడు, అతనిభార్య ఏకమై పర్యవసానమైన ఆనందాన్ని అనుభవించారు. వందలాదిమంది డవచ్చు. వారిని గ్రహించటం మామూలు మర్త్యులశక్తికి అసాధ్యం. "ఒక ర్తించటం దేవతల శక్తికే అసాధ్యం" ఒకే కటుంబానికి చెందినవారు . గ్రహించవచ్చు ; ఇతరులకది అసాధ్యం. బజారులో చేతికందే దూరంలో ్నవరూ తెలుసుకోలేరు కాని ఇంత దూరంలో ఉన్నా నాకు తెలుసు, ుటుంబానికి చెందినవాడిని గనుక, ఇదే న్యాయం కృష్ణ పరివారానికీ అందులో ప్రవేశం పొందినవాడు ఇతరులని తెలిసికుంటాడు. క్రొత్త రు త్వరలోనే అత్తవారింటిలో అందరితోనూ తన్నుతాను పరిచయం ంది. కృష్ణుడెన్నటికైనా తన పరివారంలో ఒకడిగా చేసుకొంటాడో! లేదో! ఆ ఆనందం అనుభవిస్తానో! లేదో! తెలియదు. కురూపి, రోగిష్టి అయిన ృచేసుకొని, ఇంటికి తెచ్చుకోవటం ఎవరూ కోరుకోనట్లే - దుష్టుడూ,

మోసగాడూ, స్వార్థపరుడూ, మూర్ఖుడూ, కృతఘ్నుడూ అయిన వాణ్ణి తన పరివారంలో కృష్ణుడు జేర్చుకోడు.

స్ఫటికంవలె నిర్మలంగా, ధృవునివలె దృఢ విశ్వాసంతో ఉండు. కృష్ణుడు తన ఆత్మీయగణంలోనికి నిన్ను అనుమతిస్తాడు. మన మనస్సులు నిర్మలం గాను, నిష్కపటంగాను ఉండుగాక! మనకోసం ఎలా మనం ఆలోచిస్తామో అలాగే ఇతరుల గురించీ ఆలోదిద్దాం. కృష్ణుడు మన మనస్సు నావరించిన మాయను తొలగించి ఋజుమార్గాన మనలమునడిపించుగాక!

నీ
హర

# 52వ పత్రము

ప్రియతమా,

ఇద్దరికిద్దరమూ సమాధానం వ్రాయవలసి ఉన్నది , ఇద్దరమూ సమాధానం కోసం ఎదురుచూస్తున్నాం. ఈ నిశ్శబ్దాన్ని భంగం చేయటానికి వ్రాస్తున్నాను. విజయమెప్పుడూ మీవైపే ఉంటుంది. మేమెప్పుడూ మీ బానిసలం. వేదాలే మిమ్మ్మ విజయలని ప్రకటించాయి. ఈ నిర్ణయాన్ని ఎవరు మార్చగలరు? ప్రపంచానికి గుణపాఠంగా తన పరాజయాన్ని అంగీకరించి, వేదాలకు వేదం, దేవతలకు దేవుడు అయిన కృష్ణుడు ఇది ప్రపంచానికి నిరూపించి చూపాడు. ఉపదేశించటానికి అతడు తనకు తానాచరిస్తాడు. మీ విజయం అలా శాశ్వతంగా రూఢి అయింది. తులసి మొక్కలా, మీరంతా ఒక్కటే, గుణాల్లో ఎవరూ తక్కువ కాదు. మీ గుణమాహాత్మ్యాల్ని మీరే ఎరుగుదురు. మీరెవరికి చెప్తారో వారికే తెలుస్తాయి. నీవు త్రోసిన ఈ అగాధం నుంచి ఎలా బయటపడతానో తెలియదు. కూరుకుపోతానేమోనని నిరంతరం అనుకుంటున్నాను. ఈ దుర్భర వేదన గురించి ముందే తెలిసి ఉంటే ఎటువంటి పరిస్థితులలోనూ ఇందులో తలదూర్చేవాణ్ణి కాదు. నిప్పులో శరీరం కాలుతుంది. నిప్పు చల్లారినా నొప్పి, మంట ఉంటాయి. మనిషి గతిస్తాడు. బాధామయమైన జ్ఞాపకాలు మిగులుతాయి. స్మృతి నన్ను బాధ పెట్టటం మానలేదు. నేను నీ ప్రక్కన ఉన్నప్పుడు నీవు నాకు బాహ్యంగా ఉన్నావు. నేనిక్కడకు రాగానే నీవు నా హృదయమంతా ఆక్రమించావు. ఈ పాత్రే గౌరాంగుడు ధరించినది. అంతర్యంలో రాధ, కృష్ణుడు బాహ్యరూపంగానూ, అంతర్యంలో ప్రకృతి, పురుషుడు బాహ్యరూపం. బాధాకరమైన రాధా విరహం కృష్ణుని గౌరాంగునిగా చేసింది . ఇదే అతని కండ్లలో

నిరంతర భాష్పధారకి కారణం. నన్ను తిరిగి భయపెట్టకుండా కనికరించు. అగాధంలో తుఫాను సృష్టించకు. శాంతించు, ఒక్క క్షణం నిర్భయంగా ఊపిరి పీల్చుకోనీ.

నీ గత లేఖ మృదువుగానూ, కఠినంగానూ ఉన్నది . అది నన్ను సంతోషంతో గెంతించింది, ఏడిపించింది. నిన్న అపాయ సూచన హఠాత్తుగా నన్ను భయపెట్టింది. క్షేమంగా ఉంటే వెంటనే సమాచారాన్ని విపులంగా వ్రాయి. అమ్మ మరణంతో ఈ భూమిమీది బంధం ముప్పాతిక తెగిపోయింది. నీవు ఇచ్ఛిస్తే. మిగతాది వదిలించి నన్ను విముక్తుణ్ణి చేయి. నామాతృదేవతతో పాటు శాశ్వతంగా సుఖసంతోషాలు గతించాయి. శూన్య గృహం అత్యల్పా కర్షణీయం మాత్రమే. ఏమైనా ఉన్నదానితో సంతృప్తిపడు. ఎక్కువగా మరి, మనలను బాధ పెట్టుకొని, ఇతరులతో గిల్లికజ్జాలు పెట్టుకోవటం వల్ల ఏమి ప్రయోజనం? ప్రతివాడిని ఒకే కుటుంబంలోని వానిగా భావించి మనకాలాన్ని శాంతంగా గడపాలి. ఈ ప్రాపంచిక విషయాలపై వ్యామోహం ఎంత పెంచు కొంటే , విడిచి వెళ్ళేటప్పుడు అంత బాధపడాలి.కనుక ఈ ఐహిక విషయాలపై ఒక రకమైన నిస్పృహ పెంచుకోవటం మంచిది. నీవు కూడా అలా చేయి. అనవసరంగా నిన్ను నీవు హైరాన పెట్టుకోకు. మన గత దుష్కర్మల కనుగుణంగా బాధపడటానికి ఈ భూమి మీదకి వచ్చాము. భవిష్యత్తులో కూడా బాధపడటానికి ఇంకా ఎందుకు పాడు పనులు చేయాలి? కృపామయుడైన కృష్ణుని పైనే పూర్తిగా ఆధారపడి నీ కాలాన్ని ఆనందంగా గడుపు. మనవారని పిలిచేందుకు కృష్ణుడు తప్ప మరెవ్వరూలేరు. హృదయపూర్వకంగా అతణ్ణి ప్రేమించు. తాత్కాలిక బంధాలకు పొంగిపోకు. కృష్ణునివిస్మరిస్తే ప్రతి క్షణం ప్రమాదమున్నది. అయిన వారిని విడిచి ప్రతిరోజూ ఎంతమంది పోవటం లేదు? ఒకసారి పోయారా, తిరిగి జ్ఞాపకం రారు. రోజు రోజూ ఇది చూస్తాము. కాని, ఇది అర్థం చేసుకోలేము. ఇది మాయ, గాఢ తమస్సు. ఎందుకూ నిన్ను నీవు ఇబ్బంది పెట్టుకోకు. ప్రతివారూ నియమితమైన ఏదో పనికై వచ్చారు. ఆపని చేస్తారు.వెళ్లిపోతారు. ఎవరూ ఎవరికోసం ఆగరు. సర్వదా కృష్ణుడే శాశ్వత సహచరుడు, మనం మరచిపోయినా, అతడు మరవడు. అతణ్ణి విడిచి ఎవరిని ప్రేమిస్తావు? శాంతంగా అతణ్ణి ధ్యానించు, ఆందోళన వద్దు.

శ్యామసుందరుని కైంకర్యానికి దోరమామిడి పండ్లు ప్రతి రోజూ దొరుకుతున్నా యను కుంటాను. అతని సేవలో నిమగ్నురాలవై ఉండాలి. కనుక, నేను శలవు తీసుకుంటాను.

నీ

హర

# 53వ పత్రము

ప్రియతమా,

శ్యామునితో (కులదైవం శ్యాసుందరునితో) ఆనందంగా ఉన్నావని విని ఆనందిస్తున్నాను. సంవత్సరమంతా (నిరంతరం) అలా గడపగలిగితే నీకే కష్టాలూ ఉండవు. అన్ని బాధలకూ దూరంగా ఉంటావు. శ్యాముని వాంఛిస్తే శ్యాముడూ అతణ్ణి వాంఛిస్తాడు. ఒకసారి అతణ్ణి ఆకర్షించగలిగేవా, అతడు నీవేమి చెప్పితే అది వింటాడు. మనిషిని ప్రేమించటమెంత కష్టమో బాగా గ్రహించావు కనుక. మనిషిని విస్మరించు. హృదయపూర్వకంగా నీ అనురాగాన్ని శ్యామునివైపు మళ్ళించు. అతడు తిరిగి నిన్ను ప్రేమిస్తాడు.శ్యాముడు ప్రేమించగలిగినట్లుగా ప్రేమించటం ఎవరికైనా తెలుసా? గోలోకం విడిచి మనష్యుల మధ్య మనిషిగా అవతరించటం కేవలం వారిపై తన ప్రేమను వ్యక్తీకరించటానికి, ప్రేమించట మెలాగో బోధించటానికి మాత్రమే. చూడు, అతని ప్రేమ ఔన్నత్యం ఊహించు, మళ్ళీ అతని ప్రేమ తాత్కాలికమైనది కాదు, శ్వాశతమైనదీ, నిత్యనూతనమైనదీ, మర్త్యుల ప్రేమవలె అది ఎన్నటికీ పేలవం కాదు. కనుక మనిషిని ప్రేమించటం మరచిపో, శ్యాముని ప్రేమించటానికి ప్రయత్నించు. ఎలా ప్రేమించాలో అతనికెంత తెలుసంటే మర్త్యుల ప్రేమకి బదులుగా తన ప్రేమకి వశులై ఒడిలోని బిడ్డని విడిచి తల్లి అతని చెంతకు పరువెత్తుతుంది. భార్య భర్తను వదిలి అతని వద్దకు చేరుతుంది. అతని ప్రేమకి సర్వజీవులూ వశమౌతాయి. గ్రహించటానికీ, ఊహించటానికీ, నీకు ప్రియమైన వస్తువు పేరు ఉచ్ఛరించబడగా వినటం నీకెంత ఆహ్లాదకరమో నీకు బాగా తెలుసు. ఒక మనిషి (భర్తను) ప్రేమించినప్పుడు అతని పేరును ఉచ్చరించకూడదు. కాని, శ్యాముడు ఎంత దయాళుడంటే - అతణ్ణి ప్రేమించటానికి అనుమతినివ్వటమే కాక, అతని మధురనామాన్ని స్మరించటానికి అభ్యంతరం పెట్టలేదు కూడా. ఇప్పుడు చెప్పు - ఇంతకంటె ఇంత చక్కగా ప్రేమించటం ఇంకెవరికి తెలుసు? కనుక, మనిషి స్థానంలో శ్యాముని మనసులో నిలుపుకో - జీవితంలో సుఖిస్తావు. కడుపునిండా తిండికిగాని, వంటినిండా నగలకిగాని దేవిరించవు. గాఢంగా అతణ్ణి ప్రేమించగలవు. తనివితీరా అతణ్ణి దర్శించగలవు. నీ వతణ్ణి ప్రేమిస్తే ఎప్పటికీ అతడు నీ హృదయం వీడడు. తన నివాసంగా చేసుకుంటాడు. నీకు ప్రాప్తించబోయే అమేయమైన ఆ ఆనందాన్నీ సుఖాన్నీ కొంచెం ఊహించు. శ్యాముని సుగుణాలు అసంఖ్యాకాలైనా, ఇతనికొక లోపమున్నది. నల్లగా ఉంటాడు. అప్పుడప్పుడు కపటంగా ప్రవర్తిస్తాడు. కాని, మంచివాళ్ళకి మంచివాడే. సజ్జన సాంగత్యంలో వర్ణమూ

మారుతుంది. చాలా మంది నల్లని వాళ్ళున్నారు. ఈ విషయంలో నిరసింపబడ్డారా? నీలమణి విలువలేనిదా? శ్యాముడు నల్లనివారికి నల్లన, తెల్లనివారికి తెల్లన. క్రూరులకు కుటిలుడు, మంచివాళ్ళకి అతి మంచివాడు. ఇందుకని శ్యాముని ప్రేమించటం నేర్చుకో, మనిషిని విస్మరించు. నా బృందావనం తల్లి నా మీద ప్రేమని విస్మరించి శ్యామునితో కూడా అదృశ్యమైంది. నా ప్రేమశక్తి ఆమెని ఏమీ వారించలేకపోయింది. అలా ఆమె వెళ్ళిపోతుంది అని తెలిస్తే నేనామెను అమ్మా అని పిలిచే వాడినే కాదు. తల్లి అనురాగాల్ని నేననుభవించినంత అనుభవించటం ఏ మనిషికీ తరం కాదు. ఇంకా ఎవరినీ అమ్మా అని పిలవను. అసంఖ్యాకమైన నా తల్లులలో ఏ ఒక్కరూ సుఖంగా లేరు. నా అంత దురదృష్టవంతు డింకెవరు? నేనిలా ఎందుకయ్యానో చెప్పలేను. ఎవరు నన్ను ప్రేమిస్తారో వారు ఏడవ వలసిందే! నవ్వే అవకాశమే దొరకదు. అందరికీ చెప్పు నన్ను ప్రేమించవద్దని. నేను పుట్టిన క్షణం ఎంత విలక్షణమైనదంటే - సంతోషం కూడా నన్ను ఏడిపిస్తుంది. ఎవ్వరూ నన్ను ప్రేమించకూడదు. ఎవరన్నా ప్రేమించాలనుకొంటే వారించు. శ్యాముని ప్రేమించు, సుఖపడతావు.

శ్యామునికి పూజచేసి, ఎంతో దయతో నాకు పంపిన తులసిదళాలు అందాయి. శ్యాముని ముందు రోదించకు. ఆ దృశ్యం అతడు భరించలేడు. ఎక్కడ ఆనందం లభిస్తే అక్కడే ఉంటాడు. నిత్యానందుని పొందదలిస్తే నీవానందంగా ఉండు. అతడు కన్నీళ్ళను వాంఛిస్తాడు. దుఃఖాశ్రువులకంటే ఆనందభాష్పాలను కోరుకొంటాడు. నీ హృదయాన్నే నీవు పరిశీలించుకొంటే నేను సత్యం చెప్పినట్లే గ్రహిస్తావు. నన్ను విస్మరించమని నీ హృదయానికి చెప్పు. నీ హృదయం ఒకప్పుడు ప్రేమాశ్రువులను చిందిస్తోంది. మరొకప్పుడు చిందించటం లేదు. అలా దానిని నడిపించేవాడు ఆ మహాజగన్నాటక సూత్రధారి. నిరంతరం (సంవత్సరమంతా) సమభావంతో చరించు. నా శుష్క ప్రేమ యంత్రానికి (హృదయానికి) నూనె వేసి (ప్రేమ పూరితంచేసి) నడిపించగల సమర్థమైనది కాదుకాని, నీకు రవ్వంత ఉపయోగపడవచ్చును. నా ప్రేమ మడ్డినూనె - యంత్రభాగాలను జిడ్డు చేస్తుంది. కాని ఒకగుణం ఉన్నది. నలుపుఛాయ కలిగిస్తుంది. (కృష్ణవర్ణం) కనుకనే నీకు సమర్పించటానికి ధైర్యం చేస్తున్నాను.

నీ

హర

# 54వ పత్రము

ప్రియతమా

నీకు బాధ కలిగించానని చాలా విచారిస్తున్నాను. మీ స్త్రీ జాతి ఈ జగత్తుకి ఆభరణాలని చాలా కాలం నుంచి నాకు తెలుసు, కాని,ఈ రోజు ఆ ఉద్దేశం పూర్తిగా ధృవపడింది. ఈ దుఃఖమయ ప్రపంచానికి ఆనందాకృతి నిచ్చింది మీరు. మీ క్రియా శక్తి ఒక్క క్షణం స్థంభిస్తే ఈ జగత్తు అంతమవుతుంది. కేవలం పురుషశక్తి మాత్రమే పనిచేస్తే - క్రిమికీటకాదులతో సహా సృష్టి యావత్తూ నశించేది. మీ సహజ మార్దవంతో ఆ శక్తిని తటస్థీకరణ చేసి ప్రపంచాన్ని సక్రమంగా ఉంచింది మీరు. మీ మార్గాలు నిగూఢాలు . కొంత మందిని బాధపడమని విధిస్తున్నారు. మరి కొంతమందికి కేవలం ఆనందమే. కొంతమందిని మహదానంద నిలయమైన బృందావనానికి తీసుకువెళ్తున్నారు కూడా. మిమ్మర్థం చేసుకున్న వారెవ్వరూ లేరు. మీ మాయని అధిగమించి మిమ్మర్థం చేసుకున్నవారు - సర్వమూ జయించినట్లే - వారు ముక్తులు. మిమ్మర్థం చేసుకున్నవారు సాక్షాత్తూ భగవానుని పొందారు. దృష్టిని అడ్డుతున్న తెర తొలగించుకొని, మీ నిజస్వరూపాలు, మీ హృదయము గ్రహించగలందుకై శాయశక్తులా ప్రార్థిస్తాను. శాశ్వతావాస మార్గాన్ని నీ సహాయంతో దర్శించాలనీ, నీ బాహ్య సౌందర్యాకర్షణ వివశుడినై అంధునిలా అంధకారంలో అలమటించకూడదనీ కూడా ప్రార్థిస్తాను. నా ఉన్నతికై నీ యదార్థ రూపాన్ని వ్యక్తీకరించు. మిమ్మెదుర్కొంటే పురుషులు , సాధారణంగా, అయోమయంలో పడి స్థైర్యం కోల్పోతారు. మీ కోపానికి గురి అయ్యే దురదృష్టవంతుణ్ణి కాకూడదు గాక ! నిరంతరం ఆదరంతోనే చూడబడాలి గాక ! బాహ్య సౌందర్యం నన్నెప్పుడూ వివశుని చేయకుండు గాక! మృదువులై స్వాదువులైన మీ మాధుర్యాల్ని, భౌతికంగా కష్టమైనా, ఆస్వాదించే అదృష్టం నాకు కల్గుగాక! అది నేనొక్క రోజు చేయగలిగినా, నా పితృదేవతలతో సహా తరిస్తాను. నా జీవితం ధన్యమైనట్లు భావిస్తాను. కృష్ణుడలా విధించాడో లేదో తెలియదు.ఎవరూ ఏ యుగంలోనూ,మీ గురించి చెప్పలేకపోయారు. పూర్తిగా వ్రాయలేకపోయారు. అటువంటప్పుడు ,అతి నికృష్ట జీవినైన నేను ఆ ప్రయత్నాల్ని ఊహించనైనా ఎలా ఊహించగలను ?

విస్మరించగలిగేవా అని అడిగావు, అది సాధ్యమా? ప్రపంచంలో ఏ జీవి అయినా అలా చేయగలదా ? విశ్వచైతన్య శక్తివి. నీవెవరినైనా విస్మరిస్తే స్పృహ కోల్పోతాడు. ఇప్పుడు చెప్పు. నేను మరచిపోయానో లేదో! నేను నిన్ను విస్మరిస్తే దేనితో నేను [illegible] మూల శక్తిగా నీవే సృష్టిస్తున్నావు. పోషిస్తున్నావు.

ర్జునాదులకు ప్రాణమిత్రుడు, నిజమే, కాని, అప్పుడప్పుడు వారి మాటలను డచెవుల బెట్టాడు. ఎప్పుడు ద్రౌపది పిలిచినా దూరంగా ఉండలేకపోయాడు. ప్పుడప్పుడు సఖుల ప్రార్థనలు నిర్లక్ష్యం చేశాడు కాని, సఖియలు వాంఛించి నప్పుడు 'దని కూర్చుండ లేకపోయాడు. కనుక "మీరేమి చెప్పితే అది చేయటానికి అతడు ద్ధము" అని అంటాను. నీవు ప్రేమిస్తే వందరెట్లు అధికంగా అతను ప్రేమిస్తాడు. వి అతని మాటలు, నావికావు, వాటిని విశ్వసించు.

మహదానందకరమైన మహాష్టమి ఈ రోజు, అన్నివైపులా ఆనందం. ప్రతివాడూ ఆనందిస్తున్నాడు కాని, బహుశా , మా అమ్మ నా గురించి ఆలోచిస్తూ, ఒంటరిగా ఒక మూల నిట్టూర్పులు విడుస్తూ ఉంటుంది. నేనామెకు మహాదుఃఖాన్ని కలిగిస్తూండవచ్చు. మరి నీవు .... నీ మార్గాలు నీకు తెలుసు. నిన్నానందింప చేయటానికి నేను పూర్తి అసమర్థుణ్ణి.

నీ
హర

# 56వ పత్రము

ఒక జీవితకాలపు మంచి కృషిని ఒక చిన్న శ్వాస నాశనం చేయవచ్చు. ఎవరూ అంటువంటి శ్వాస (ధిక్కారము) నిగిడించకుందురుగాక ! జీవితం చివరి దశకు వచ్చినట్లే . ఇంకా ఈ ఖేలల ప్రయోజనమేమిటి? వీటికి రోజులు గడచిపోయాయి. ఇంకా మిగిలిన కొన్ని దినాలూ సద్వినియోగం చేసుకో. నీవానందించు, ఇతరులనూ ఆనందింపజేయి. ఇదే నేనర్థించేది. కృష్ణుని అసాధారణ మధుర నామం నీ హృదయ మలంకరించాలనీ, అంతర్బహిర్తత్త్వాలు ఒకేలా వర్తించాలనీ , మనస్సూ మాటలూ పొంతనగా పరస్పర స్నేహాను బంధంతో ఉండాలనీ ప్రార్థిస్తాను. మోసవర్తనకి హరినామం ఎన్నటికీ ముసుగుగా ఉపయోగింపబడకుండుగాక! బాహ్యానికి ఉదాత్తమైనదిగా కనిపించే ఆశ్రయం దుర్వృత్తిని మభ్యపరచే ఆవాసం కాకుండుగాక ! శ్రీ కృష్ణుని పొందటం ప్రధాన జీవితాశయం కావాలి. ఆప్తులూ, ఆత్మీయులైన వారి ప్రార్థనలను తృణీకరించక, మనస్సులో దుస్సాంగత్యం ఎన్నటికీ ఊహించరాదు. దుష్కృత్యాలు, దుస్సహవాసాలు జాగ్రత్తగా త్యజించాలి.

పిచ్చి
హర

* సమాప్తం *

రార్జునాదులకు ప్రాణమిత్రుడు, నిజమే, కాని, అప్పుడప్పుడు వారి మాటలను పెడచెవుల బెట్టాడు. ఎప్పుడు ద్రౌపది పిలిచినా దూరంగా ఉండలేకపోయాడు. అప్పుడప్పుడు సఖుల ప్రార్థనలు నిర్లక్ష్యం చేశాడు కాని, సఖియలు వాంఛించి నప్పుడు కాదని కూర్చుండ లేకపోయాడు. కనుక "మీరేమి చెప్పితే అది చేయటానికి అతడు సిద్ధము" అని అంటాను. నీవు ప్రేమిస్తే వందరెట్లు అధికంగా అతను ప్రేమిస్తాడు. ఇవి అతని మాటలు, నావికావు, వాటిని విశ్వసించు.

మహదానందకరమైన మహాష్టమి ఈ రోజు, అన్నివైపులా ఆనందం. ప్రతివాడూ ఆనందిస్తున్నాడు కాని, బహుశా , మా అమ్మ నా గురించి ఆలోచిస్తూ, ఒంటరిగా ఒక మూల నిట్టూర్పులు విడుస్తూ ఉంటుంది. నేనామెకు మహాదుఃఖాన్ని కలిగిస్తూండవచ్చు. మరి నీవు .... నీ మార్గాలు నీకు తెలుసు. నిన్నానందింప చేయటానికి నేను పూర్తి అసమర్థుణ్ణి.

నీ
హర

# 56వ పత్రము

ఒక జీవితకాలపు మంచి కృషిని ఒక చిన్న శ్వాస నాశనం చేయవచ్చు. ఎవరూ అంటువంటి శ్వాస (ధిక్కారము) నిగిడించకుందురుగాక ! జీవితం చివరి దశకు వచ్చినట్లే . ఇంకా ఈ ఖేలల ప్రయోజనమేమిటి? వీటికి రోజులు గడచిపోయాయి. ఇంకా మిగిలిన కొన్ని దినాలూ సద్వినియోగం చేసుకో. నీవానందించు, ఇతరులనూ ఆనందింపజేయి. ఇదే నేనర్థించేది. కృష్ణుని అసాధారణ మధుర నామం నీ హృదయ మలంకరించాలనీ, అంతర్బహిర్తత్త్వాలు ఒకేలా వర్తించాలనీ , మనస్సూ మాటలూ పొంతనగా పరస్పర స్నేహాను బంధంతో ఉండాలనీ ప్రార్థిస్తాను. మోసవర్తనకి హరినామం ఎన్నటికీ ముసుగుగా ఉపయోగింపబడకుండుగాక! బాహ్యానికి ఉదాత్తమైనదిగా కనిపించే ఆశ్రయం దుర్వృత్తిని మభ్యపరచే ఆవాసం కాకుండుగాక ! శ్రీ కృష్ణుని పొందటం ప్రధాన జీవితాశయం కావాలి. ఆప్తులూ, ఆత్మీయులైన వారి ప్రార్థనలను తృణీకరించక, మనస్సులో దుస్సాంగత్యం ఎన్నటికీ ఊహించరాదు. దుష్కృత్యాలు, దుస్సహవాసాలు జాగ్రత్తగా త్యజించాలి.

పిచ్చి
హర

* సమాప్తం *